# ఆధునికాంధ్రవాఙ్మయ
# వికాసవైఖరి.

———:0:———


జయంతి రామయ్యపంతులు బి. ఏ., బి. యల్. గారిచే

రచింపఁబడినది.





శ్రీ విద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాలలో

ముద్రింపఁబడినది.

1937.




[వెల రు ౧-౦-౦.

# FOREWORD.



In October and November 1934, I delivered, at the request of the Andhra University authorities, an extension lecture on the "Recent Developments in Telugu Literature" to the Student population at Waltair, Cocanada and Guntur. I have subsequently retouched it here and there and now publish it in book form. The subject admits of a more elabarate treatment This must be left to a younger generation.

In appraising the merits and demerits of recent literature, it is difficult to avoid hurting the susceptibilities of living authors. I have tried to do this duty in an impartial and dispassionate spirit, and I can only hope that I have not altogether failed in this attempt.

MUKTISWARAM.
19 April 1937.

J. RAMAYYA.

# విషయసూచిక.

# ఆధునికాంధ్రవాఙ్మయవికాసవైఖరి.

:(o):

## ౧ వ అ ధ్యా య ము.

:o:

ఆంధ్రవాఙ్మయారంభము.

ఆంధ్రవాఙ్మయము భారతముతో నారంభమైనది. ఇందు మొదటి మూఁడుపర్వములు నన్నయభట్టారకుఁడు రచించెను.(1) మిగిలినభాగ మించుమించుగా నిన్నూఱు సంవత్సరములపిదప, తిక్కన సోమయాజి పూర్తి చేసెను. భట్టారకుఁడు 1022 వ క్రైస్తవాబ్దమునఁ బట్టాభిషిక్తుఁడైన రాజరాజనరేంద్రునియాస్థానమం దుండుటచే, నాకవి యిప్పటికిఁ దొమ్మిదివందలసంవత్సరములక్రిందటివాఁ డగును. సంస్కృతమున వాల్మీకి పోలెఁ దెనుఁగునందు నన్నయభట్టారకుఁ డాదికవి యైనను, అంతకుఁ బూర్వము తెలుఁగులోఁ గవిత్వము లేనే లేదని చెప్పరాదు. సంస్కృతమునఁ గూడ వాల్మీకికిఁ బూర్వము కవిత్వము లేకపోలేదు. వేదము ఛందోమయమే. కావుననే దానికి ఛందస్సు అనుపేరు వచ్చినది. కాని, వేదముకంటె భిన్నమైన ఛందస్సు పూర్వము లేదనియు, వ్యాధుఁడు క్రౌంచపక్షిని వధింపఁగాఁ గరుణాతిశయముచే వాల్మీకిముఖము నుండి వెలువడిన—

(1) ఎఱ్ఱాప్రెగ్గడ యరణ్యపర్వములోఁ గొంతభాగ మిటీవల రచించినను స్థూలదృష్టిచే మొదటి మూఁడుపర్వములు నన్నయభట్టు రచించినట్లే నేను భావించినాఁడను.

మా నిషాద ప్రతిష్ఠాం త్వ
మగమ శ్శాశ్వతీః సమాః
య త్క్రౌంచమిథునా దేక
మవధీః కామమోహితమ్.

అనునదియే ప్రథమశ్లోక మనియు రామాయణమునందుఁ జెప్పఁబడియున్నది. తెలుఁగులో నన్నయభట్టే ప్రథమకవి యనుట కట్టియితిహాస మేదియు లేదు సరిగదా భారతావతారికలో-"సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకవితార్థయుక్తిలో, నారసి మేలునా" భారతముఁ దెనిఁగింతు నని భట్టారకుఁడు చేసిన ప్రతిజ్ఞవలననే యాకాలమందు గొందఱు తెలుఁగుకవు లుండిరని తోఁచుచున్నది. భట్టారకుని కాలమునకుముందు పుట్టిన యుద్ధమల్లుని బెజవాడ శిలాశాసనము మొదలగు కొన్ని పద్యాత్మకశాసనములు కానవచ్చుచున్నవి. కాని నన్నయకుఁబూర్వము పుట్టిన యుద్గ్రంథము లేవియుఁ గానరాకుండుటచే నట్టిగ్రంథము రచించుసామర్థ్యము గల ప్రథమకవి యాతఁడే యని భావించుట సమంజసమే.

భారతరచననాఁటికే యాంధ్రభాషాస్వరూపము సురుచిరమైనది. దేశ్యశబ్దములు మాత్రమే కాక ప్రాకృతద్వారమునఁ బెక్కు తద్భవశబ్దములు భాషలోఁ బ్రవేశించినవి. సంస్కృతపదములఁ దత్సమరూపముగా గ్రహించు పద్ధతికూడ నేర్పడినది. ఇతరవిషయములలోఁ గూడ భాషాలక్షణము చాలవఱకు స్థిరపడినది ఇంత వికాసము పొంది యుండినది కనుకనే మహాభార

తార్థములఁ దనగర్భమం దిమిడ్చికొనుసామర్థ్య మాభాషకుఁ గలిగినది.

ప్రాచీనకాలమందు భరతఖండమున విద్య లన్నియు సంస్కృతభాషయందే నిక్షిప్తములై యుండెను. ఆభాష నభ్యసించి శాస్త్రము లధిగమించినవారే పండితులయిరి. పలువు రీ విధముగాఁ బాండిత్యమును సంపాదించినను జను లనేకులు విద్యాగంధము లేకయే యుండెడివారు. అట్టివారి యుపయోగమునకై లోకహితైషులగు మహాకవులు సంస్కృతగ్రంథములలోని విషయముల దేశభాషలలో ననువదింప నారంభించిరి. రాను రాను గొందఱుకవులు సంస్కృతగ్రంథముల ననుసరింపసాగిరి. తెనుఁగునం దీరెండుపనులు నేఁటివఱకు జరుగుచునే యున్నవి. పాశ్చాత్యవిద్యాసంపర్కము కలుగకపూర్వము తెనుఁగులోఁ బుట్టిన గ్రంథము లన్నియు సంస్కృతగ్రంథముల కనువాదములో యనుసరణములో నై యున్నవి. కాని, కేవలము స్వతంత్ర రచన లనఁదగినగ్రంథములు లే వనియే చెప్పవచ్చును.

సర్వవిద్యాసంగ్రహ మనఁదగినట్టియుఁ బంచమవేద మను ప్రసిద్ధిఁ గన్నట్టియు భారతమే ప్రథమమునఁ దెలిఁగింపఁబడెను.

పురాణములు, ఇతిహాసములు.

తరువాత రామాయణము, భాగవతము మొదలగు గ్రంథములు తెలుఁగులోనికిఁ బరివర్తనము పొందెను. మొత్తముమీఁద నీకాలమందుఁ బుట్టిన యాంధ్ర వాఙ్మయము పురాణాత్మకము, నితిహాసాత్మకము నయి యున్న దని చెప్పవచ్చును. ఈగ్రంథములు రచించుటలోఁ బూర్వ

కవులు మూలగ్రంథములయం దయ్యైభాగములు ముందుగాఁ జదివి యందలివిషయమును మనస్సునకుఁ బట్టించుకొని వాని నాంధ్రపద్యరూపకముగా వ్యక్తపఱిచిరి. కావుననే వారికవిత సరళము, ధారాళము నయి యాంధ్రులకు సుగమముగానున్నది. వారికవిత్వమం దచ్చటచ్చటఁ బ్రౌఢపాక మున్నను మొత్తము మీఁదఁ గథ తెలుఁగువారికిఁ దేటతెల్లమగునట్లు చెప్పుటయే ప్రధానప్రయోజన మనుభావముతో వారు గ్రంథముల రచించిరి. కావ్యములు తెనిఁగించుటలోఁ బ్రథముఁ డనఁదగు శ్రీనాథుఁడు గూడఁ జాలవఱకీమర్యాదనే యనుసరించి నైషధమును దెనిఁగించెను. పెక్కుతావులం దాంధ్రరచన మూలసంస్కృతమునకు మెఱుఁగు వెట్టినట్లుండును. ఈకాలపుఁ దెనుఁగుగ్రంథములు చదువునపు డర్థస్ఫూర్తికై మూలగ్రంథములఁ జూచునావశ్యకత యెక్కడనో గాని యుండదు.

ప్రబంధములు.

రానురాను గొంతకాలమునకుఁ బ్రబంధరచన ముద్భవించినది. దీనికి దారిచూపినవాఁడు నాచనసోముఁడు. పెద్దనాదులామార్గమును క్షుణ్ణపఱిచి సర్వావయవసుందరములగు ప్రబంధములు రచించిరి. ఏదో యొక్క చిన్న యితివృత్తమును దీసికొని దానిని వర్ణనాదులచేఁ బెంచి యొకగ్రంథముగా రచించుట ప్రబంధఫక్కి. వీనియందు వస్తువుకంటె వర్ణనలు, వర్ణనలకంటె భాషాచమత్కృతియుఁ బ్రధానములు. చాలవఱకాంధ్రప్రబంధశైలి సంస్కృతకావ్యశైలిని- అందులో చంపూప్రబంధశైలిని- బోలి యుండును గాని కొన్ని

ప్రబంధముల శైలి యీకావ్య శైలిని దల దన్నిన ట్లుండును. మొత్తముమీఁదఁ బ్రబంధ శైలి పండితైక వేద్యము.

మనుచరిత్రము, వసుచరిత్రము, పారిజాతాపహరణము, ఆముక్తమాల్యద, ప్రభావతీప్రద్యుమ్నము మొదలగునవి ప్రబంధరాజములు. వీనిలో వసుచరిత్రము శ్లేషాది శబ్దాలంకారములతోడను బహువిధార్థాలంకారములతోడను నిండి యున్నది. తరువాతికవుల కనేకుల కిది యాదర్శప్రాయమై పెక్కు "పిల్లవసుచరిత్రలకు" మాతృభూత మైనది. ప్రబంధ శైలిని నెపముగాఁ బన్ని నేఁటివారలు కొందఱు సలక్షణాంధ్రభాష పండితేతరులకు దుర్గ్రాహ్య మను నపప్రథను గల్పించిరి. ప్రబంధములయందలి దుర్గ్రాహత్వము శైలివలనఁ గలిగినది గాని భాషా లక్షణము వలనఁ గలిగినది కాదు.

సంస్కృతగ్రంథముల ననువదించియో యనుసరించియో యాంధ్రగ్రంథముల రచించునాచారము నేఁటికినిఁ బ్రవర్తిల్లుచునే

ఆంగ్లభాషా సంపర్క మహిమ.

యున్నది. కాని, యిటీవల నాంగ్లేయవాఙ్మయ సంపర్కమువలన నూతనరీతుల ననుసరించి గ్రంథముల రచించునభ్యాసము కూడ నుత్పన్నమై బహుగ్రంథము లిదివఱకే బయలుదేఱినవి. ఈగ్రంథము లాధునికాంధ్రవాఙ్మయవికాసమునకు ముఖ్యచిహ్నములై యున్నవి.

ఒకదేశమువారు వేఱొకదేశము నాక్రమించి పాలించునప్పుడు పాలితు లగుజనులు విద్యలయందేమి యాచారములయందేమి పాలకుల ననుసరించుట లోకమర్యాద యై యున్నది.

రమారమి 900సంవత్సరములక్రిందట నార్మనురాజులు(Norman Kings) బ్రిటిష్‌దీవుల (British Islands) నాక్రమించి యించుమించుగా మున్నూఱుసంవత్సరములు పరిపాలించిరి. ఆకాలమున బ్రిటిష్ జనుల యాచారవ్యవహారములు చాలఁ దాఱుమాఱైనవి. అన్నిటికంటె వారిభాషయం దీమార్పధికమగుటచేత నాభాష నామావశిష్టమై యుండి నార్మనురాజులు దేశమును విడిచిపెట్టి పోయిన పిదపఁ బూర్వరూపము పోయి వేఱురూపము నొంది భాషాంతరముగాఁ బొడసూపెను. మహమ్మదీయప్రభువులు రాజ్యము చేసినకాలమం దుత్తరదేశమందును వంగదేశమందును రాజభాషాసంపర్కమున దేశభాషలలోఁ గొంత మార్పు గలిగినది. కాని, దక్షిణాపథమునందలి ద్రావిడభాషలలో నట్టిమార్పంతగాఁ గలుగలేదు. తెలుఁగు వ్యాపించియున్న దేశములో గోలకొండదేశమును మాత్రమే మహమ్మదీయులు పాలించిరి. అందయినను వారిపాలనము చిరకాలము జరుగలేదు. వారు వచ్చునప్పటికే తెలుఁగులో నుత్కృష్టమగు వాఙ్మయ మేర్పడి భాషాస్వరూపము స్థిరపడి యున్నది. యయాతిచరిత్రాదిగ్రంథములు కొన్ని మహమ్మదీయప్రభువుల కంకితము లగుట చూడ నాప్రభువు లాంధ్రము నాదరించిన ట్లగపడుచున్నది

ఏకారణముచేతనైన నేమి మహమ్మదీయసంపర్కము వలన నాంధ్రవాఙ్మయమందుఁగాని, భాషయందుఁగాని మార్పు లేమియుఁ గలిగియుండలేదు. ప్రబంధములలో నచ్చటచ్చటఁ జమత్కారార్థము కొన్ని పారసీకాది పదములు ప్రయోగింపఁ

బడినవి. అవి యైనను లెక్కకు మిక్కిలి కొంచెముగా నున్నవి. అంతకంటె నాంగ్లవిద్యాసంపర్కమూలమునఁ దెనుఁగులోఁగలిగిన వికృతు లత్యధికముగా నున్నవి. సంస్కృతవాఙ్మయప్రభావము తగ్గలేదు గాని యాంగ్లవాఙ్మయసంపర్కప్రభావము నానాఁటి కధికమై యాంధ్రభాషకును వాఙ్మయమునకును నూతనచ్ఛాయ కల్పించుచున్నది. నేలపైని కూర్చొని చదువు నేర్చుకొను

ఈసంపర్కము నేలంటుచదువులయొద్దనుండియు వచ్చినది. అక్షరాభ్యాసము మొదలుకొని చిన్నబడులలోఁ జదువుచెప్పు

పూర్వపు నేలంటు చదువు.

విధాన మిప్పటికంటెఁ బూర్వమువిలక్షణముగానుండెను. ఆబడులచ్చటచ్చట దేవాలయములందునుబహుళము గాఁ బెద్దపెద్దగృహస్థులయిండ్ల వీథియరఁగులమీఁదను నుంచెడువారు. తఱచుగా వీథియరఁగులమీఁద నుండుటచే వీని కిటీవల 'వీథిబళ్లు' అనుపేరు వచ్చినది. ఆకాలమందు పలకలు, పలకపుల్లలు లేవు. నేలమీఁద బూడిదయో యిసుకయో పోసి దానియందు అక్షరములువ్రాయుట నేర్పెడువారు. కొందఱుపాధ్యాయులు అక్షరములు నేలపై గుంటలుపడునట్లు వ్రాసి యా గుంటలలో బాలురచేత వ్రాయించి యక్షరములు వ్రాయుట నేర్పెడివారు.ఇట్లు వ్రాసిన యక్షరములకు "గుంటఓనమాలు" అని పేరు. అక్షరములు వచ్చినపిదప "గుణితము" చెప్పెడువారు. గుణిత మనఁగా- హల్లులపై నచ్చులును హల్లులును వచ్చినప్పుడు కలుగు నుచ్చారణమును నిరూపించుట.వర్తమాన కాలమం దక్షరగుణితము—"కకార అకారములు క, ఖకార

ఆకారములు కా, కకార ఇకారములు కి, కకార ఈకారములుకీ” ఈవిధముగాఁ జెప్పుదురు. పూర్వము “ కాకు (కకారమునకు) తలకట్టిస్తే క, కాకు దీర్ఘమిస్తే కా, కాకు గుడియిస్తే కి, గుళ్లో దీర్ఘమిస్తే “కీ” ఈవిధముగాఁ జెప్పుచుండెడువారు. అనఁగా- నక్షరముల నుచ్చారణమునుబట్టి గాక లిపిలో వాని కేర్పడిన గుర్తులయాకారమునుబట్టి యేర్పడిననామములే వాడుచుండెడు వారు. ఆనామము లిట్లుండెను.

| | |
|---|---|
| అ = తలకట్టు | ఉ = కొమ్ము |
| ఆ = దీర్ఘము | ఊ = కొమ్ముదీర్ఘము |
| ఇ = గుడి | ఋ = సుడి-వట్రువసుడి |
| ఈ = గుళ్లోదీర్ఘము | — |

తక్కినయచ్చులకు ఎత్వము, ఏత్వము, ఇత్యాది- ఉచ్చారణ నామములే గాని మాఱుపేళ్లు లేవు. అచ్చులతోఁ గూడని కేవల హల్లులకు “ముడు” లనిపేరు. “కాముడి” యనఁగాఁ గేవల హల్రూపమగు క్ ఈలాగుననే చాముడి, తాముడి—ఇత్యాదులు. ఈగుణితక్రమముకంటె నేఁటిగుణితక్రమమే యుచితముగా నున్నది.

“గుణిత” మైనపిమ్మటఁ బేళ్లుచెప్పెడువారు. పేళ్లనఁగా- శబ్దములు. పిల్లలకుఁజెప్పెడిపెక్కుశబ్దములు నామవాచకములగుటచే వానికిఁ బేళ్లను పేరువచ్చినది. పంతులు పేళ్లు తాటియాకులమీఁద వ్రాసి యిచ్చి వానిని జదువుట, వ్రాయుట నేర్పెడువాఁడు. పేళ్లతో సామాన్యవాక్యములనుగూడ నేర్పెడువాఁడు.

వేళ్లు చదువుటయు వ్రాయుటయుఁ జక్కఁగా నలవడు నప్పటికి బాలురకొకవిధముగాఁ బుస్తకముచదువుట కర్హతకలిగెడిది. అప్పుడు "బాల రామాయణము" చదివించెడివారు. బాలరామాయణ మనఁగా వాల్మీకిరామాయణ బాలకాండము నందలి ప్రథమసర్గము. ఇందు రామాయణకథ యంతయు సంక్షేపముగాఁ జెప్పఁబడుటచే సంక్షేపరామాయణ మనియు, బాలురకుఁ జెప్పుటచేఁ గాఁబోలును బాలరామాయణ మనియు దానికి నామములు గలిగినవి. సంస్కృతమందు దీనికి సంక్షేపసర్గ మని పేరు. ఇందు నూఱు శ్లోకము లున్నవి. ఒకటి రెండు శ్లోకములు తాటియాకులమీఁద వ్రాసి యీయఁగా వానిని బాలురుచక్కఁగాఁ జదివి కంఠోక్తిగా నొప్పగించినపిదప మఱియొకటి రెండు శ్లోకములు పంతులు వ్రాసి యిచ్చుచుండెడువాఁడు. చదువునప్పు డుచ్చారణమందుఁ గాని వరుసయందుఁ గాని తప్పులు వచ్చినపు డుపాధ్యాయుఁడు దిద్దుచుండెడువారు. ఈప్రకారము బాలరామాయణ మంతయుఁ జదువుసరికి బాలురకు వాచక మొకవిధముగాఁ గుదిరెడిది. బాలరామాయణము సర్థపూర్వకముగాఁ జదువకపోయినను గథ ప్రసిద్ధ మగుటచేతను, బడిలో నుపాధ్యాయులు నింటియొద్దఁ దండ్రులును జెప్పుమాటలచేతను బాలురకు రామాయణకథ చూచాయగాఁ దెలిసెడిది. ఈగ్రంథపఠనమువలనఁ బఠనశక్తి కలుగుటయేగాక పరమపవిత్రమైన రామకథకూడ సంగ్రహముగ బోధపడుచుండెడిది.

బాలరామాయణ మైనపిమ్మట, అమరకోశమును జది

వించెదువారు. ఆనాఁడచ్చుపుస్తకము లంతగా లేకుండుటచేతఁ బంతులు బడి బాలుర తెలివితేటలనుబట్టి దినమునకు రెండో మూఁడో నాలుగో పద్యములు తాటియాకులమీఁద వ్రాసి యిచ్చెదువారు. అవి చక్కఁగాఁ జదివి మఱునాఁ డొప్పగించిన పిదప మఱికొన్ని పద్యములు వ్రాసియిచ్చెదువారు. ఈప్రకారముగాఁ గాండత్రయమును జదివించెదువారు. వాచకము కుదురుటకై బాలరామాయణమును బాండిత్యమునకుఁ బునాదిగా నమరమును జెప్పెడివారు. అమరము పిదపఁ దెనుఁగు గ్రంథములం జదువుట కారంభించెదువారు. సుమతిశతకము, దాశరథిశతకము, భాస్కరశతకము, నరసింహశతకము మొదలగు సులభగ్రంథములు చదివి యనంతరము భాగవతములోని రుక్మిణీకల్యాణము, గజేంద్రమోక్షము, వామనావతారకథ, ప్రహ్లాదచరిత్రము మొదలగు భాగములు చదివెదువారు. తప్పులు లేకుండఁ జదువుటయేగాని యర్థము విప్పి చెప్పు నాచార మంతగా లేదు. చదువు సాగినకొలఁది స్థూలరూపముగా నర్థము స్ఫురించుచుండెడిది. ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, అను నిఘంటువులుకూడ నాదినములలో విద్యార్థులు చదివెదువారు. బడులలో సామాన్యముగాఁ జెప్పు విద్యయింతమట్టే. ఇది మైనపిమ్మట, తెనుఁగులో నధికప్రవేశము నభిలషించుబాలుర కుపాధ్యాయులు, భారతము, భాగవతము మొదలగు పెద్దగ్రంథములు పురాణశైలిని దత్తదుచితరాగములతోఁ జదువుట నేర్పెదువారు. చదువుటయులవాటైనకొలఁదిఁ బద్యములలోనిముఖ్యభావములు

హృద్గతములై యొకవిధమైన పాండిత్యము కలిగి భారతాదిగ్రంథములు చదివి పురాణశైలి నర్థము చెప్పెడు నైపుణ్యము కలిగెడిది. ఇట్టి పౌరాణికులు నేఁటికి నచ్చటచ్చటఁగలరు. నేఁటికాలమునఁ బట్టపరీక్షలో నుత్తీర్ణులయినవారిలోఁగూడ ననేకుల కీజ్ఞానము కుదురుటలేదు. ఈమాత్రముతోఁ దృప్తిపొందనివారు ప్రబంధములను, ఆంధ్రశబ్దచింతామణి, అప్పకవీయము మొదలగులక్షణగ్రంథములను బండితులయొద్దఁ జదివెడువారు. సంస్కృతవిద్యాభ్యాసముం జేయఁగోరువారు సంస్కృతపండితుల నాశ్రయించి సాహిత్యగ్రంథములను శాస్త్రముల నభ్యసించెడువారు. ఇది సామాన్య సాహిత్యవిషయము.

ఇదిగాక నిమేషము మొదలుకొని యుగములవఱకుఁ గల కాలపరిమాణమును, గ్రహములు, నక్షత్రములు, రాసులు మొదలగు ఖగోళవిషయములును, దేవతలనామములు, స్వరూపములు, స్వర్గమర్త్యపాతాళాదిలోకములరూపములును, దేవతాస్తోత్రములునుగూడ నేర్పెడువారు. అంకగణితముకూడ సూక్ష్మరూపముగఁ జెప్పెడువారు. 'ఏకైకా—మెక్కా=' ఒకఒకటి ఒకటి మొదలు 'పదిపదులు నూఱు' వఱకును గలయెక్కములు ముందు చెప్పి-పిదప- 'అకరంనకరం ఎకువీసానే' 'పదుకొండు పదుకొండ్లు నూటయిరువదియొకటి' ఇత్యాది—అకరంనకరీలు చెప్పెడువారు. లెక్కలకదియే మొదటిమెట్టు. అకరంనకరీలపిమ్మట, వెరసులు, గుణకారభాగహారములు చెప్పెడువారు. భూమికొలఁత ధాన్యాదులకొలఁత, వస్తువులు తూఁచుట మొదలగు వ్యాపారములలో

వినియోగపడు పరిమాణవాచక పరిభాష నేర్పెడువారు. ఇవి యన్నియు నేర్చినపిదప వానిననుసరించి పొడుపుడు లెక్కలు (Problems) కల్పించి యడిగెడివారు. ఇప్పటివలెఁ బలకలుగాని కాగితములుగాని లేకుండినందున నాలెక్కలకు సమాధానము చెప్పుటకుఁగావలసినగణితమంతయు మనస్సులోనే చేసికొనవలసి యుండెను. దానివలన ధారణాశక్తి వృద్ధిపొంది ప్రత్యుత్తరము లు శీఘ్రముగా నిచ్చునేర్పుకూడ నలవడుచుండెను. ఈబడుల లో నేర్చికొనిన గణితముచేతనే యిటీవల వర్తకము మొదలగు వ్యాపారములందుఁ గావలసిన లెక్కలు వ్రాయుసామర్థ్యము కలుగుచుండెడిది. ఆనాఁడు వ్రాఁతపని చాలవఱకుఁ దాటియాకులమీఁదనే జరుగుచుండెడిది. కాగితములపై వ్రాఁత కొంచెము కొంచెముగానుండెను. కలిపివ్రాఁత తెలియుటకై గృహస్థుల యిండ్లనుండుజాబులు తెచ్చి బాలురచేఁ జదివించెడివారు.

ఇది పూర్వకాలమందుఁ బల్లెటూళ్లబడులలోఁ జెప్పుచుండు నేలంటుచదువు స్వరూపము. చిన్నతనమందు వీధిబడులలోఁ దాము చదివిన చదువునుగూర్చి కందుకూరి వీరేశలింగముగారు స్వీయచరిత్రమం దిట్లు వ్రాసినారు:—"ఈయన(పులిపాక అమ్మిరాజుగారి) బడిలోనే నక్షరములును, గుణితమును, ఎక్కములును నేర్చుకొని పుస్తకము పట్టియుండును. అల్పకాలములోనే యీయయ్యవారిహాలోకయాత్రను విడిచినందున, తదనంతరము మాయింటికి సమీపమున తిరుమెళ్ల వారిలోపల నున్న సోమరాజుగారి బడికి మావారు నన్నుఁ బంపిరి. గూనివాఁ

డగుటచేత నీయనను గూనిసోమరాజుగారని సాధారణముగాఁ బిలిచెడివారు. ఈయన మొదటిపంతులువలెఁ గాక తెలుఁగునందుఁ గొంత పాండిత్యము గలవాఁడై పిల్లలచేతఁ బెద్దపుస్తకము(పురాణము)నుగూడఁ జదివించి యర్థము చెప్పుచువచ్చెను. నాచేతఁ బ్రథమమున నర్థసహితముగ బాలరామాయణమును, నమరనిఘంటువును చదివించిరి గాని యాసంస్కృతగ్రంథపఠనమువలన నాకప్పు డంతగా లాభము గలుగలేదు. అటుతరువాత వాచకమును వ్రాఁతయుఁగాక రుక్మిణీకల్యాణమును, సుమతిశతకమును, కృష్ణశతకమును, ఆంధ్రనామసంగ్రహమును నాచేత రోఁకటిపాటగా వల్లె వేయించిరి. నేను వీథిబడులలో నేర్చుకొన్న దంతయు నింతే.”

ఇది యంతయు నిప్పుడు మాఱినది. ఈమార్పు మా గ్రామమందు 1870 వ సంవత్సరములోఁ గలిగినది. ఇతరప్రాంతములం దంతకుఁ బూర్వమే కలిగియుండవచ్చును. మొత్తము మీఁద నూటేండ్లనాఁ డీమార్పు ప్రారంభమైన దనవచ్చునని తలఁచెదను.

నేఁటికాలపు నేలంటు చదువు.

ఇప్పుడు నేలపై వ్రాఁత నేలంటినది. అక్షరములు మొదలుకొని యచ్చుపుస్తకములు చూచి పలకలమీఁద వ్రాయుట యాచారమైనది. అక్షరము లయిన పిమ్మటఁ బేళ్లు, పేళ్ల తరువాత వాక్యములు, వాని యనంతరము చిన్నకథలు, నటుతరువాతఁ బెద్దకథలును గలపాఠపుస్తకములను జదువుచున్నారు. ఈపుస్తకము లన్నియు గద్య

మయములే. గీతములను, కందపద్యములను స్వల్పముగాఁ జది వించుట కలదు; గాని పూర్వమువలె శతకములు మొదలగు పద్య గ్రంథములఁ జదివించు నాచారము లేదు. చదివినపాఠములు పూర్వమువలెఁ గంఠపాఠము చేసి యొప్పగించు పద్ధతికూడఁ బోయినది. కాగితముల యుపయోగము ప్రబలి తాటియాకుల మీఁద వ్రాయు నాచారము బొత్తిగా నశించినది. చక్కని వ్రాఁత యలవడుటకై యొజ్జలు "నరువడి" వ్రాసి (దీనినే యొజ్జబంతి యనువారు) దానిక్రిందఁ బిల్లలచే వ్రాయించుపద్ధతి క్రమక్రమముగా క్షీణించుచున్నట్లగపడుచున్నది.

గద్యగ్రంథావిర్భావము.

మొత్తముమీఁద వర్తమాన విద్యాభ్యాసపద్ధతిలో గద్యాత్మకగ్రంథపఠన మధికముగా నున్నది. మొట్టమొదటి తరగతి మొదలుకొని పట్టపరీక్షవఱకుఁగూడఁ బ్రతి తరగతిలోను వచనగ్రంథములు పఠనీయగ్రంథములుగా నుండుటచే నీగద్యాత్మకగ్రంథనిర్మాణము ముదిరి దినదిన ప్రవర్ధమానముగా నున్నది. ఆంధ్రవాఙ్మయచరిత్రమందు వర్తమానయుగము గద్యయుగ మని చెప్పినను జెప్పవచ్చును. ఈ గద్యవాఙ్మయమునకు దారిచూపినవాఁడు పరవస్తు చిన్నయసూరి యని చెప్పవచ్చును. సూరిగారు మహావిద్వాంసులు. ఇంచుమించుగా 80 సంవత్సరములక్రిందటఁ జెన్నపురిలోనున్న రాజకీయోన్నతవిద్యాలయము(Presidency College)లోఁ బ్రధానాంధ్రోపాధ్యాయుఁడుగా నుండెడువాఁడు. ఆయన బాలవ్యాకరణ మనుపేర నుత్తమమయిన యాంధ్రవ్యాకరణమును రచియిం

చుటయేకాక యున్నతవర్గములోని విద్యార్థులు పఠించుట కర్హమయిన నీతిచంద్రిక యను గద్య గ్రంథముఁగూడ రచియించెను. ఈనీతిచంద్రికయే యొకవిధముగా నాంధ్రగద్యవాఙ్మయమునం దాదిగ్రంథమని చెప్పవచ్చును. దీనిశైలి ప్రాచీనపద్యగ్రంథములలో నచ్చటచ్చట నున్న గద్యముల శైలిని బోలియుండును. రచన మనోహరముగా నున్నది.

ఈ శైలి ననుకరించి యిటీవల కొక్కొండ వేంకటరత్నము పంతులుగారును, కందుకూరి వీరేశలింగము పంతులుగారును నీతి చంద్రికలు రచించిరి. వీరేశలింగము పంతులుగారి శైలి ప్రసన్నము. వేంకటరత్నము పంతులుగారి శైలి కర్కశము. ఈమూఁటిలోను సూరిగారికృతియే యుత్తమమని నేఁటికిని గణింపఁబడుచున్నది.

కందుకూరి వీరేశలింగ కృతిప్రశంస.

వీరేశలింగముగా రిటీవల ననేకకృతులు రచియించి యాధునికాంధ్రవాఙ్మయనిర్మాణమునకు మార్గదర్శి యను ఖ్యాతిని సంపాదించెను. ఆయన పూర్వకవికృతము లయి మఱుఁగుపడియున్న పెక్కుకృతులను బ్రకటించుటయేగాక నూతనగ్రంథములనేకములు రచించెను. ఈయన గ్రంథరచనము బహుముఖముగా నున్నది. ఇటీవలిగ్రంథకర్తలు త్రొక్కుచున్నదారు లన్నియు నీతఁడు త్రొక్కి చూపినవియే. బ్రహ్మసమాజ మతానుసారముగ సాంఘికాచారముల సంస్కరించుట, యాంధ్రవాఙ్మయము నభివృద్ధి నొందించుట యను నీరెండుకార్యములయందును నీయన తన యావచ్ఛక్తిని విని

యోగపడెను. వాఙ్మయాభివృద్ధియే మనకుఁ బ్రస్తుతవిషయము.

వీరేశలింగము పంతులుగారు రచించినగ్రంథమాల నీవిధముగా విభజింపవచ్చును.

౧. నవలలు.

౨. నాటకములు.

౩. కథలు.

౪. ప్రసిద్ధస్త్రీపురుషజీవితచరిత్రములు.

౫. వ్యాసములు.

౬. ప్రహసనములు.

౭. గ్రంథవిమర్శనములు.

౮. శాస్త్రగ్రంథములు.

౯. చారిత్రకగ్రంథములు.

౧౦. వార్తాపత్రికలు.

పూర్వకాలమునందుఁ దెలుఁగులో గద్యగ్రంథము లనఁ గద్యగ్రంథ దగినవిలేవు. పద్యగ్రంథములలో నచ్చటచ్చటఁ జిన్నములు. చిన్న గద్యము లున్నవి. ప్రబంధములలోఁ బద్యశైలికంటెఁ గ్లిష్టమైన శైలిలో రచింపఁబడిన దీర్ఘవచనములు కొన్ని గలవు. కాని, యామూలాగ్రముగ గద్యమయ గ్రంథములు లేవు. ఇటీవల విజయనగరరాజ్య మత్యున్నతస్థితిలో నున్నకాలమున ద్రావిడదేశముకూడ నారాజ్యములోఁ జేరియుండెను. ఆ కాలమం దాంధ్రనాయకరాజు లాదేశమును దంజావూరు, మధుర యనెడు పట్టణములు రాజధానులుగాఁ జేసికొని పరిపాలించు

చుండెడివారు. ఆనాయకులును వారి కధిరాజులగు విజయనగర రాజులు నాంధ్రులగుటచే నాంధ్రభాషకు ద్రావిడదేశమందు గౌరవ మధికముగా నుండెడిది. కవు లనేకు లానాయకరాజుల నాశ్రయించియుండి పెక్కు కావ్యములను రచించిరి. కొందఱు నాయకరాజులుగూడఁ గవులుగా నుండిరి. అట్టివారిలో రఘునాథ నాయకుఁడను తంజావూరు రాజును, విజయనగరం చొక్కనాథుఁడను మధుర రాజును ముఖ్యులు. తంజావూరిలోఁబుట్టిన వాఙ్మయమందు యక్షగానరూపనాటకములును మధురలో నుత్పన్నమైన వాఙ్మయమునందు గద్యగ్రంథములును విశేషములు. ఈగద్యగ్రంథము లిరువదియొకటివఱకుఁ గనవచ్చుచున్నవి. ఇవి యన్నియు భారతాది పురాణములకును శ్రీరంగమాహాత్మ్యాది స్థల మాహాత్మ్యములకును నాంధ్రానువాదములు. వీనిలో శ్రీరంగమాహాత్మ్యమును, మాఘమాహాత్మ్యమును విజయరంగ చొక్కనాథుఁడే రచియించినట్లున్నది. సముఖము వేంకటకృష్ణప్ప నాయకుఁడు జైమిని భారతమును, సారంగధర చరిత్రయును రచించెను. తెలిసినంతవఱకు నీకాలమందుఁ బుట్టిన వచనగ్రంథముల నామములును దత్కర్తల పేర్లును దిగువ నుదాహరించుచున్నాఁడను.

ఉత్తరగోపుర వచనము.

గజారణ్యమాహాత్మ్యము.

జైమినిభారతము—సముఖము వేంకటకృష్ణప్పనాయకుఁడు.

ద్వాత్రింశత్సాలభంజికలు—ఏకామ్రనాథుఁడు,

పంచతంత్రము.
ప్రతాపచరిత్రము—ఏకామ్రనాథుఁడు.
పాండవుల యశ్వమేధవృత్తాంతము.
మాఘమాహాత్మ్యము—విజయరంగచొక్కనాథుఁడు.
శ్రీరంగమాహాత్మ్యము ,,
వైశాఖమాహాత్మ్యము ,,
శ్రీరంగమాహాత్మ్యము—చేకూరి సిద్ధకవి.
సారంగధరచరిత్రము—సముఖము వేంకటకృష్ణప్పనాయఁకుఁడు
హంసవింశతి.
రామాయణము—సింగరాజు దత్తాత్రేయులు.
రామాయణము—శ్యామరాయకవి.
రామాయణము—వేంకటసుబ్బయ్య.
రామాయణము—తుపాకుల అనంతభూపాలుఁడు.
విష్ణుపురాణము ,,
రామాయణము—పైఁడిపాటి పాపయ్య.
హాలాస్యమాహాత్మ్యము—కళువెనంజరాజు.
శివభక్తవిలాసము ,,

ఈవచనగ్రంథము లన్నింటిలో జైమినిభారత ముత్తమముగా నెన్నఁబడుచున్నది. అది పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవికృత పద్యకావ్యము ననుసరించి రచియింపఁబడినది. ఈగద్యగ్రంథములలో ననేకము లిటీవల నాంధ్ర సాహిత్యపరిషత్తువారిచే సంపాదింపఁబడి పరిషత్పుస్తక భాండాగారమునం దుంపఁబడినవి. అం

తకుఁ బూర్వము దక్షిణదేశమం దిన్ని గ్రంథములు పుట్టిన వని యాంధ్రలోక మెఱుఁగదు. కావుననే చిన్నయసూరిరచితనీతి చంద్రికయే ప్రథమాంధ్రగద్యగ్రంథ మనువాదుక గలిగినది. ఆ గ్రంథమును దాని ననుకరించి కొక్కొండ వేంకటరత్నము పంతులు గారును వీరేశలింగము పంతులుగారును రచియించిన నీతిచంద్రి కలును జాలవఱకుఁ బద్య శైలిలో రచియింపఁబడినవి. ఇటీవల వీరేశలింగముగారు పలువురకు సులభముగాఁ దెలియునటులు శైలిని మార్చికొనిరి. స్వభావముచేత నాయన గ్రాంథిక శైలి ప్రసన్నమైనది. అందుపై సాంఘికాచారసంస్కరణ మావశ్యక మని జనులకు బోధించుపనిఁ బెట్టుకొనుటచే వ్యాసాదులను సుల భ శైలిని రచింపవలసిన యావశ్యకత కలిగినది. దానినిబట్టి సుల భము లగుపదముల నుపయోగించియు, సంధు లచ్చటచ్చట సడ లించియు భాషాలక్షణము చెఱుపకుండ సులభ శైలిని గల్పించెను.

వివేకవర్ధని యను పత్రికను నెలకొల్పి యాపత్రికను నడ పుటలోఁ దమ యుద్దేశమును దెలుపుచు వీరేశలింగముగా రిట్లు ప్రతిజ్ఞ చేసిరి.

సీ. ... ... ...

ఓపిక సర్వజనోపయుక్తము లైన

విషయమ్ములును నీతి విషయములును

గీ. సులభ శైలి నందఱకును దెలియునట్లు

కఠినసంధులు లోనుగాఁ గలవి విడిచి

వ్రాయుచు నొకప్పు డన్యదేశీయములును
లోను గాఁగల వానినిఁ బూని కూర్తు.

ఈపత్రికా ప్రకటనమునందు నాయుద్దేశములు భాషాభివృద్ధియు దేశాభివృద్ధియు రెండు. నే నేర్పఱుచుకొన్న భాషాభివృద్ధి మార్గము తెలుఁగుభాషలో వ్యాప్తమైన సులభశైలిని సలక్షణమయిన వచనరచన చేయుట" ఇత్యాది.

(స్వీయచరిత్రము.)

వీరేశలింగముగారికిఁ ప్రథమశిష్యుఁ డనఁదగిన చిలకమర్తి లక్ష్మీనరసింహముగా రీశైలి ననుసరించి ఋణ్ణము చేసిరి. ఈ శైలియే యిప్పటి వారందఱు ననుసరించు చున్నారు. ఆధునికాంధ్ర గద్యశైలికి వీరేశలింగముగారే మార్గదర్శి యని చెప్పుటలో నతిశయోక్తి లేదు.

వీరేశలింగముగారు రాజశేఖరచరిత్రము, సత్యరాజాపూర్వదేశయాత్రలు నను రెండు నవలలను రచించిరి. ఇందు మొదటిది, ఇంగ్లీషులో గోల్డుస్మిత్తు (Gold smith) నవలలు. అనుకవి రచించిన "వికార్ ఆఫ్ వేక్ ఫీల్డు" (Vicar of Wakefield) అనునవలఛాయనుబట్టియు రెండవది 'స్విఫ్టు' (Swift) కవి నిర్మితమగు "గలివర్సుట్రావెల్సు"(Gulliver's Travels) అను నవలఛాయ ననుసరించియు రచియింపఁబడినవి. ప్రథమగ్రంథమందలి కథానాయకుఁడు రాజశేఖరుఁ డను నొక బ్రాహ్మణుఁడు. ఈయన మూలగ్రంథనాయకుఁ డగు "వేక్ ఫీల్డు వికారు" (Vicar of Wakefield) వలెనే యమాయికుఁడును

బరోపకారపరాయణుఁడు నై కపటసహవాసమువలన ధనము చాల నష్టపెట్టుకొని చిట్టచివరకుఁ దెలివి తెచ్చుకొని పోఁగా మిగిలిన దానితోనే తృప్తిపొంది సుఖజీవనము చేసెను. పుస్తక మంతయు నాతని జీవితచరిత్రము. రెండవగ్రంథములోని కథానాయకుఁడు సత్యరాజాచార్యుఁ డను మాధ్వబ్రాహ్మణుఁడు. ఇతఁడు 'గలివరు' వలెనే యనేకదేశములు సంచరించి తాను గనినదియు వినినదియు వివరించెను. ఈకథలన్నియు మూలకథవలెనే నమ్మఁదగని పుక్కిటిపురాణములు. మంగళవార న్యాయమున సత్యరాజనఁగా నసత్యరాజని యన్వయించుకొనవలయును. తెనుఁగుగ్రంథములకును, ఆంగ్లమూలగ్రంథములకును, పోలికలు పెక్కుతావులఁ బొడగట్టుచున్నవి. కాని, తెనుఁగులోఁ గథాపాత్రములయొక్కయు గ్రామములయొక్కయు నామములు మార్చియు నితివృత్తముకూడఁ దెనుఁగుదేశములోని జరిగిన దనఁదగినట్లు మార్చియుఁ గవి కథకు నేవ లాంధ్రరూపమును గల్పించెను. ఇతర గ్రంథముల ననువదించియు ననుకరించియు రచించినగ్రంథములు సైతము స్వతంత్రగ్రంథములనియే పాఠకులకుఁ దోఁచునట్లు రచనచేయునేర్పు వీరికిఁ గలదు. అది కవితాప్రౌఢి లక్షణ మని నాయభిప్రాయము.

ఈ నవలలోని యితివృత్త మింతకంటె విస్తరించుట యనావశ్యకము. కాని వీరేశలింగముగారి పూర్వశైలికిని మాఱిన శైలికిని గలభేదము చూపుటకై నీతిచంద్రికనుండి కొన్నివాక్యములును నవలలనుండి కొన్నివాక్యముల నుదాహరించెదను.

౧. "పూర్వ మొకప్పు డవగ్రహనిగ్రహంబు సంభవించి జలాశయంబులెల్ల జలశూన్యంబులైన, దైన్యంబున గహనంబు నంగల మతంగజనివహంబు యూథనాథుపాలికిం బోయి సకరుణంబుగా నిట్లనియె. 'స్వామీ! యేమని చెప్పుదుము? ఈ నికటంబున మే మజస్రంబును స్నానపానంబులు సేయు తటిని, యీ యేఁటివఱపులచే నిదాఘం బగుడుఁ బ్రబలాతపతాపంబున జంభాలమాత్రావశిష్టంబయ్యె. అల్పకాసారంబులగతి తడవనేల?"

(నీతిచంద్రికవిగ్రహము. ప్రథమభాగము.)

౨. "పెద్దాపురమున కయిదాఱు కోసులదూరములో జగ్గమపేఁట యనుగ్రామ మొకటి కలదు. సీత నెత్తుకొనిపోయిన నాఁడు మధ్యాహ్నము రెండు జాములవేళ గ్రామకరణముయొక్క యింటివద్ద కెవ్వరో వచ్చి తలుపుతీయుమని కేకలు వేసిరి. అప్పుడు పదునాలుగు సంవత్సరముల ప్రాయముగలిగి మిక్కిలి యందగాఁడై యేహేతువుచేతనో తలపెంచుకొనియున్న చిన్నవాఁ డొకఁడు లోపలినుండి వచ్చి తలుపు తీసి యెందుకు వచ్చినా రని యడిగెను."

(రాజశేఖరచరిత్రము-౧౨ ప్రకరణము.)

3. "ఆఁడు మళయాళములో నాకు సిద్ధుఁ డనుగ్రహించిన పసరుయొక్క మహిమచేత నడవవలసిన ప్రయాసములేక మనోవేగమున గగనమార్గమునఁ బోయి క్షణకాలములో నేను లంకాద్వీపమున వ్రాలితినని చెప్పియున్నానుగదా! హనుమద్దేవుని తరువాత నీ కలికాలములో మన పెద్ద లెవ్వరును బురాణముల

లోఁదక్క దర్శింపనోచుకోని లంకాద్వీపమును వాయుపథమునఁ బోయి చేరఁగలుగుటకు మన భరతఖండవాసులలో నెల్ల నేనే ప్రథముఁడ నగుటచేత, ఇంతటి ఘనకార్యము నిర్వహించిన యా యుత్తమోత్తమ దినమును మహాపుణ్యదినముగా భావించి యేఁటేఁట మీ రుత్సవము చేసికొనెద రనెడు దృఢవిశ్వాసమును బట్టి నే నిక్కడ నడుగిడిన దినమును సరిగా త్రుటిలవలతో చెప్పుచున్నాను."

(సత్యరాజాపూర్వదేశయాత్రలు 2 వ భాగము 1 ప్రకరణము)

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారును బెక్కు నవలలు రచించిరి. వీరు వీరేశలింగముగారు త్రొక్కిన యాంగ్లేయగ్రంథానుసరణ సరణిని విడిచి చాలవఱకు స్వతంత్ర మార్గమునే త్రొక్కుటచే వీరిగ్రంథములలోని రచనావిశేషములకు మాతృకలనఁదగినవి యాంగ్లేయ గ్రంథము లున్న వేమోయని వెదకు నావశ్యకత యుండదు. వీరి నవలలలోని కథలు కొన్ని చరిత్రాత్మకములును కొన్ని కేవల కల్పితములును. చరిత్రాత్మక కథలలో కర్పూరమంజరి ముఖ్యమైనది. కల్పిత కథలలో గణపతి యుత్తమ మని నా యభిప్రాయము. లక్ష్మీనరసింహముగారు హాస్యరసప్రియుఁడు. కావున నాయన గ్రంథములం దవకాశ మున్న యెడల నెల్ల నారసము పొడకట్టుచుండును. వీరి హాస్యము మొత్తముమీఁద మృదువును హృద్యమును నయి యుండును. వీరేశలింగముగారుకూడ హాస్యరసప్రియులే గాని యాయనహాస్యము సోపహాసమై పరుల మనములఁ గ్లేశపెట్టును. పరులను నిందించు

నపుడే యాయన యారసమును బ్రయోగించును. లక్ష్మీనరసింహముగారి శైలిని జూపుటకై కొన్నివాక్యముల నుదాహరించెద

౧. "అంతశ్శోకమును బాహ్యోపచారములు మాన్పఁజాలవు. చక్కని వెన్నెలలు చల్లని జలములు మంచిగంధపుఁబూఁతలు శరీరమునకు సౌఖ్య మొసంగ నేర్చునుగాని శోకాగ్నిచే మఱుఁగుచున్న మనస్సునకు శాంతి కలుగజేయఁజాలవు. ఎండవేఁడిమిచే మలమల మాడిన నేలను గుంభవృష్టి గురిసి చల్లఁబడఁజేయనట్లు దుఃఖానల సంతప్తమగు మనస్సును కృపారసశీతలంబు లగు నాప్తుల వచనంబులే శోకపువేఁడిమి నడఁచి శాంతి నొందింపఁగలవు." (కర్పూరమంజరి, 4 ప్రకరణము.)

౨. "బ్రాహ్మణకుమారునకు గర్భాష్టమమునం దుపనయనము చేయవలయునని ధర్మశాస్త్రమునం దుండుటచేత నామె కుమారున కేడవయేఁట నుపనయనముఁ జేయ దలఁచె నని చదువరు లూహింపవచ్చును. ఆ యూహ సరికాదు. గర్భాష్టమమేమో ధర్మశాస్త్ర మేమో పిచ్చమ్మకుఁ దెలియదు. ఉపనయన సంకల్పమున కొక్కటే కారణము గలదు. పేదతనమే ప్రధానము. అన్నవస్త్రములకు వారికి మిక్కుటమైన యిబ్బంది కలిగెను. గంగాధరుఁడు వయస్సునఁ బిల్లవాఁడెకాని భోజనవిషయమునఁ బెద్దవాఁడని చెప్పవచ్చును. ముమ్మాఱు మూఁడుసోలల బియ్య మతని కొకవిధముగ సరిపోవుచుండెను."

(గణపతి-ఆఱవప్రకరణము.)

నేఁటికి నవలలు లెక్కకు మిక్కిలిగా బయలుదేఱుచు

న్నవి. మొత్తముమీఁద వీని కన్నింటికి నాంగ్లభాషలోని మూఁడవరకపు నవలలు మాతృక లని చెప్పవచ్చును. కొన్ని వంగ భాషా నవలల కనువాదములు. గ్రంథకర్తల కాంధ్రభాషా జ్ఞానము కంటె గ్రంథరచనాభిలాష యధికమగుటచేఁ గొన్నికొన్ని నవలలలోని భాషశైలియు హాస్యాస్పదములుగా నుండును.

ఇట్టినవల లనేకము లున్నవి. మిక్కిలి చవుకగా నమ్ముటచే ననేకులు కొని చదువుచున్నారు. కాని వీనిని జూచినప్పుడు "కావ్యాలాపాంశ్చ వర్జయేత్" అనుసంస్కృతోక్తియు "Much learning is weariness to the flesh" అను నాంగ్లేయోక్తియు స్మరణమునకు రాక మానవు.



# ఆధునికాంధ్రవాఙ్మయవికాసవైఖరి.

:(o):

## ౩ వ అ ధ్యా య ము.

:o:

వీరేశలింగముగారు క్రొత్తగా రచియించినగ్రంథములలో నాటకములు ముఖ్యములు. సంస్కృతమందును, ఆంగ్లభాషయందును గలమహానాటకములను బోలిన నాటకములు రచించుపద్ధతి తెలుఁగులో నంతకుఁబూర్వము లేదు. ఆకారణముచేతనే ప్రబోధ చంద్రోదయనాటకమును శాకుంతలనాటకమును అనర్ఘరాఘవనాటకమును బూర్వకవులు ప్రబంధములుగఁ దెనిఁగించిరి. రామరాజభూషణుఁడుకూడ నాకారణముచేతనే ప్రతాపరుద్రీయమును దెలిఁగించుచు సందలి నాటకప్రకరణమును విడిచిపెట్టెను. ఇందుమూలముననె సాహిత్యము నాటకాంతమనుమాట తెనుఁగునకుఁ బట్టలేదు.

నాటకములు.

ఇట్లనుటచే నాంధ్రమం దేవిధమైన నాటకములు లేవని యూహింపరాదు. యక్షగానరూపము లగు నాటకములు కొన్ని యుండెను. కొంతమంది యానాటకములను వల్లించి యొకసంఘముగాఁగూడి యూరూరును దిరిగి యాడుట నేఁడును జరుగుచున్నది. ఈనాటకములఁ బ్రదర్శించుటకు రంగస్థల మక్కఱలేదు. వీథిలో నెక్కడఁబట్టిన నక్కడనే యాడవచ్చును. తాటియాకులతోఁ జిన్న పందిరి వేసిన వేయవచ్చును. లేనిచో బట్టబయటనే

యక్షగాననాటకములు, పారిజాతాపహరణము.

యాడుదురు. గోనెగుడ్డతెర యొకటి చాలును. వీథులలో నాడుటచే వీనికి వీథినాటకములని పేరువచ్చెను. ఈవీథినాటకములలో పారిజాతాపహరణము, ప్రహ్లాదచరిత్రము, రామనాటకము ముఖ్యములు. పారిజాతాపహరణమును సామాన్యముగా భాగవత మందురు. గోదావరీమండలమం దిది ప్రసిద్ధనాటక మగుటచే భాగవత మాడుచున్నారనఁగా నాటక మాడుచున్నారను నర్థస్ఫూర్తి కలుగుచున్నది. నారదుఁడు శ్రీకృష్ణునకుఁ బారిజాత పుష్ప మిచ్చుటయు, నాతఁ డా పుష్పము రుక్మిణి కిచ్చుటయు, నావార్త విని సత్యభామ యలుగుటయుఁ గృష్ణుఁ డామెను సాంత్వనము చేయుటయు నిందలి యితివృత్తము. సత్యభామ కోపప్రదర్శనమే యీనాటకమునందలి ముఖ్యభాగము. ఈభాగమునకు భామకలాపమందురు. ఇందువచ్చుపాత్రములలో సత్యభామపాత్రమే ప్రధానము. ఈభూమికను విద్యావతియుఁ బ్రౌఢయు నగు గణిక పూనును. ఈనాటకగ్రంథమును సిద్ధేంద్రయోగి యనునొక సన్న్యాసి కృష్ణామండలములోని కూచిపూఁడి యను గ్రామమందు రచించి యాయూరిబ్రాహ్మణులకు నేర్పెనఁట. ఆయూరివారు దానినొక మహాధనముగా భావించి "కూచిపూఁడి భాగవతు" లనుపేర నూరూర నాడుచుందురు. ఇటీవల నీయాచారము తగ్గుచున్నట్లున్నది. కాని, నేఁటికి నాయూరిబ్రాహ్మణ బాలురు బాల్యమువదలుసమయమున నొక్కమారు అయినఁ గాలికి గజ్జె కట్టుకొని యాగ్రామమందు వేంచేసియున్న గోపాలస్వామి సన్నిధిని నృత్యముచేయునాచారము కలదని విన్నాఁడను.

తంజావూరి యక్షగాన నాటకములు.

ఇట్టి యక్షగాననాటకము లనేకములు నాయఁకరాజ్యకాలమున తంజావూరిలో నుత్పన్నమైనవి. వీనిలోఁ జాలవఱకు రఘునాథనాయఁకునికాలమందును నాతనికొడుకు విజయరాఘవనాయఁకునికాలమందును బుట్టినవి. తంజావూరునగరిలోనున్న "మహారాజాసరస్వతీపుస్తకభాండాగార" మందు 225 నాటకములున్నవి. వీనిలో రఘునాథనాయఁకుఁడు రచించినవి కొన్నియును విజయరాఘవనాయకుఁడు రచించినవి కొన్నియుఁ గలవు. కొన్నినాటకములు స్త్రీలు రచించినవి. విజయరాఘవకృత రఘునాథాభ్యుదయనాటకమునందు రఘునాథనాయఁకుని యాస్థానమం దనేక పండితులును, గవులు నుండిరనియు, వారిలోఁ గొందఱు స్త్రీలుకూడ నుండిరనియు నెప్పుడును విద్యాగోష్ఠి జరుగుచుండెడిదనియుఁ దెలియుచున్నది. విజయరాఘవనాయఁకుఁడు తా నీ నాటకమునురచించి తనతండ్రి సన్నిధానమున నాడించితి ననియుఁ జెప్పెను. విజయవిలాసకర్త కృతిపతియైన రఘునాథనాయఁకునిం బ్రశంసించుచు-

"భరతవిద్యాధురంధరుఁడొట రంగస్థలంబు రామాలంకృతంబుసేసె.

అని యొకచోటను—

"మాటల నేర్పులా సరసమార్గములా కొలువుండురీతులా
పాటలగంధులా కళలభాగ్యములా బహుదానలీలలా
నాటకశాలలా యొక టనన్వల దెన్నిటఁజూడ నన్నిటన్
మేటియుఁగీర్తిలోలుఁడుఁజుమీ రఘునాథనృపాలుఁడిమ్మహిన్"

అని యొకచోటను జెప్పెను.

మన్నారుదాస విలాసము.

దీనినిబట్టి రఘునాథుఁడు నాటకములు రచించియు, రచింపించియుఁ బ్రదర్శింపఁజేయుచున్నట్లు స్పష్టపడుచున్నది. ఈనాటకములలో వచనములును దరువులునుగాక ద్విపదలుకూడఁ దఱచుగాఁ గనఁబడుచున్నవి. హాస్యరసమును గలదు. ఈరీతినాటకముల రచనక్రమముం దెలుపుటకై రంగాజమ్మకృత మన్నారుదాసవిలాసనాటకముయొక్క యితివృత్తమించుక సూచించెద. ఈనాటకమునకు మన్నారుదాసను నామాంతరముగల విజయరాఘవనాయకుఁడు నాయకుఁడు.

గ్రంథకర్త్రి మున్ముందు రాజగోపాలస్వామిని స్తుతించి తాను నాటకమును రచించెద నని ప్రతిజ్ఞ చేసిన పిదపఁ బదునైను ద్విపదలతోఁ దంజాపురిని వర్ణించెను. ఆపురి కధీశుఁడైన "విజయరాఘవచంద్రుఁడు" రాజగోపాలవిలాస నామకభవనంబునందుఁ గొలువుండ విన్నవించ నన్నగిరి యన్నగారు (ప్రతీహారులు) వచ్చిరఁట యెటువలెను.

—♦ దరువు-సామంతరాగము-ఆదితాళము. ♦—

"నిడుద కుళ్లాయలు నిండుచోగలుఁబూని
సడిసన్న యన్నగార్లు సముఖానకు వచ్చిరి."

వచ్చి మన్నారుకోవెల శ్రీరాజగోపాలస్వామి పంగుని తిరునాళ్లకుఁ బిలుచుటకై స్వామివారి శ్రీముఖము తీసికొని నంబులువచ్చియున్నారని విన్నవించి రాజాజ్ఞచే వారిని బ్రవేశపెట్టఁగా నానంబులు "మంగళానిభవంతు, మన్నారు దాసహేమాబ్జనాయికా రాజగోపాలస్వామి పరిపూర్ణ కృపాభివృద్ధిరస్తు తథాస్తు"

అని యాశీర్వదించి శ్రీముఖమును జదివిరి. రాజానంబులుఁ దాం బూలాది సత్కారంబులచే గౌరవించి యనిపెను. నంబులు రాజ సన్నిధికి వచ్చుటయుఁ దిరిగి యచ్చటనుండి సెలవు పుచ్చుకొని వెళ్లుటయు వర్ణించు దరువులుగలవు. నంబులు పోయినపిదపఁ గోవెల కరణాలు వచ్చి గుడి యాయవ్యయములను వివరించు చు నొకరినొకరు నిందించుకొనసాగిరి. రాజు వారికి సెలవిచ్చి పంపివేసి, జ్యోతిష్కులను బిలిపించి మన్నారుకోవెల ప్రయాణ మునకు ముహూర్తము పెట్టుఁడని చెప్పెను. వారి పరస్పర సం భాషణము హాస్యరసపూరితమై యున్నది. ఆనాఁటి హాస్యస్వ రూపమును దక్షిణదేశమం దున్న యానాఁటి తెలుఁగు బ్రాహ్మ ణుల వ్యావహారిక భాషా స్వరూపమును దెలుపుటకై యా సం భాషణము నుదాహరించుచున్నాఁడను.

"ముహూర్తం నిర్ణయించరయా, అని భూనాయకుం డానతిచ్చిన గణితజ్ఞులకు లగ్ననిర్ణయమునకుఁగా విచ్చనగా బహుచర్చలు నడచెనఁట యెటువలెను.

భైరవజోస్యులు:—మంచనభట్లుగారు, పంచాంగం విప్పుడా.

మంచనభట్లు:—భైరవజోస్యులు, నేరనిమాటలే ఆడుదువు.
చక్కంగా అశ్విని భరణి కృత్తికలు గురుతెరుగవు నీకు
పంచాంగం విప్పేదిన్నా నీభవిష్టికి?

భైరవ:—మంచనభట్లుగారికి మూలానక్షత్రమో, మాటాడక
మునుపే మూలం రేగుచున్నది.

మంచన:—వోరి భైరవజోశ్శిగా తిథి వార నక్షత్ర కరణయోగా

లలో వొకటి గురుతెరుంగవే పంచాంగ మనంగా యేం
దిగా?

భైరవ:—మంచనను ముక్కు మీందనే వుండును కోపం సూర్య
సిద్ధాంతం యెరింగినవాని కొడుకవు. మొన్నటి అమా
వాస్యనాడు ముప్పాతికా పరిక గ్రహణమనిన్ని ఆగ్నే
యస్పర్శ అనిన్ని దబ్బరలే వ్రాస్తివే; మేము ఆర్యభట
వాక్యపరనీతాల గ్రహస్ఫుటం చేసి గ్రహణం లేదంటిమే.

మంచన:—నీవు పోచన సోమయాజులవారింట మొగవాండు
బుట్టునని ప్రశ్న చెప్పి యేకాక్షరప్రయోగం చేయించు
క వస్తివే.

భైరవ:—నీవు బుచ్చావధాని కొడుకు లచ్చిగాండు పదుహారో
యేంట పల్లకి యెక్కునని జాతకం వ్రాస్తివే. ఇదిగో
బిచ్చమెత్తుక తిరుగుచున్నాండే.

మంచన:—నే ఫలభాగం వ్రాసిన దిక్కున పదివేలమంది పల్లకి
తెదస్తులెనవారు నీకేమి తెలుసు పోరా.

మధ్యస్థి:—వోయి, చాలించరోయి మీ జగడాలు నగరివారు
ముహూర్తం నిర్ణయించమంటే యేషాగాధా లాడుచు
న్నారు.

అనిన విని వారు సంవాదము చాలించి లగ్ననిర్ణయము చేసి
రంట యెటువలెను:—

మేషం, వృషభం, మిథునం, కటకం, సింహం, కన్య,
కన్యకు స్వామివీక్షణ శుభవీక్షణాలు కలిగినప్పటికిన్ని తులాల

గ్నము చరలగ్నము గనక యాత్రకు మహాప్రశస్తము లగ్నాధిపతి శుక్రుండు సప్తమమందు కేంద్రించి లగ్నము పూర్ణముగా చూస్తున్నాండు. స్వస్వామి వీక్షణ శుభవీక్షణాలు కలిగియున్నది గనక భాగ్యస్థానానమండి బృహస్పతి చూస్తున్నాండు. గనక "యోయోభావస్స్వామి దృష్టోయుతోవా, సౌమ్యైర్వాస్యాత్తస్య తస్యాభివృద్ధిః కల్యాణసిద్ధిః పునరాగమశ్చ" అన్నాండు గనుక తులాలగ్నము విజయయాత్రకు మహాప్రశస్తము. స్వామి చిత్తము."

ఆముహూర్తముననే రాజు బయలుదేఱి మన్నారుకోవెలకుం బోయెను. వెంటనే స్వామి గరుడవాహనారూఢుండై యూరేగెను. ఈ యూరేగింపు టుత్సవములో "గణికలు పదకేళిక వినిపించిరంట యెటువలెను.

పదము—"తాళంజాలరా తమిమించెరా! బాళిలో నన్నేలుకోరా బంగారుమన్న ౹మొక్కేరా.

మరుండు నామీందదండెత్తె మమత మిగుల

హెచ్చేరా గరుడవాహన కౌంగిటం జేర్వరా."

ఊరేగింపుటుత్సవము విస్తారముగా వర్ణింపంబడినది. ఆయుత్సవములో రాజు స్వామిని దర్శించి యిట్లు స్తుతించెను.

సీ. "కరుణారసము చిల్కు కడకంటిచూపుల
గరిమతో భక్తులం గాచువానిం
జందమామను మించు నందంబు గనుపించు
మొలకనవ్వుల ముద్దుమోమువానిం

బద్మంబుపై వ్రాలు భ్రమరం బనస్మించు
మేటి కస్తురిబొట్టు నీటువాని
విజయసారథియూట విజయంబు చేకూర్చు
కనకవేత్రము కేలఁ గలుగువాని
నాదలను వైరముడి దాల్చు నందగాని
గొప్పచౌకట్లు వీనుల నొప్పువాని
రాజితం బైన కనకాంబరంబువానిఁ
గంటి మన్నారుఁ గన్నుల కఱవుదీఱ."

స్వామియుత్సవము చూడవచ్చిన యువతు లనేకులు విజయరాఘవనాయఁకుఁ జూచి మోహించిరి. వారిలోఁ గాంతిమతి యను నొకకన్యక రాజునందు మిక్కిలి యనురాగము గలదై యాతఁడు లభింపమి విరహావ్యథచే మిక్కిలి స్రుక్కెను. ఆ విరహము ప్రబంధరీతి ననుసరించి విరివిగా వర్ణింపఁబడినది. ఈవర్ణనమునందుఁ బెక్కు దరువులు గలవు. ఎట్టకేలకుఁ గాంతిమతి విలాసవతి యను నొకయువతిని రాజునొద్దకు దూతికగాఁ బంపెను. ఆదూతిక వచ్చునప్పటికి విద్వద్గోష్ఠి జరుగుచుండెను. ఆగోష్ఠిలో జరిగిన ప్రసంగ మించుక యుదాహరించెద.

శ్లో. భువనస్తు వసుధాతలం విజయరాఘవ క్ష్మాపతిః
వ్యసనస్తు కవితాస్థితిం విజయరాఘవక్ష్మాపతిః
నయం వ్రజతుమానసం విజయరాఘవక్ష్మాపతిః
శ్రియంభజతు సర్వదా విజయరాఘవక్ష్మాపతిః.

శ్రియం భజతు సర్వదే త్యత్ర లిఙ్ లోట్ తవ్య ప్రత్యయానాం

విధాయకత్వాత్ సర్వైశ్వర్య సిద్ధతయా పునర్విధానం సిద్ధసాధ నత్వాత్। విధేరజ్ఞాత జ్ఞాపకత్వాత్.

కిముచ్యతే వాణీ భునక్తు వసుధాతల మిత్యత్ర "ఐంద్రం పదం భూమిగతోనభుంక్తే" ఇతి రఘువంశప్రయోగానుసారేణ ఆత్మనే పదే ప్రయోక్తవ్యే కథం పరస్మై పదప్రయోగః."

అత్రేదముత్తరం. భుజోనవయితి సూత్రానుసారేణ అనవ నార్థత్వాత్మనేపద విధానాన్నాయమాక్షేపః। నచవాచ్యం। తర్హి తత్ర కాగతిరితి। అత్ర అనుభుంక్తే అనుభవతీత్యర్థః తథాచ నదోషః"

మాట—అవునోయి యెషువంటిభ్రాంతుం డైనా యిషువలె భ్రమ నుకొనునా। భుజిధాతువుకు అనుభవ మర్థమని యెషువలె చెప్పుచున్నావోయి.

—వజ్రశుంఠ మల్లుభట్టిగాండు యేమోయి అనే అట్టు అయినా నాబ్రదుకు, యిషువంటి బ్రహ్మిష్ఠో బ్రహ్మకొడుకును యేమో యి అనవచ్చునా.

—వోరి నీవలె వుభయతో బట్టి ప్రాయశ్చిత్తం చేసుకోకవుంటి నమరా.

—వోరి నీవు పుట్టి మూండాయిత్తారాలులే. నిన్నటిసుదుపడవు నావంట్టి యోగ్యుణ్ని జూచి యేమి వదరేవురా శునకంవలె పాదరక్షలు తీసి రెండు ప్రహరింతుమా.

—వోవృద్ధగార్దభమా నోరుగలదంచున్ను నెత్తి నోరుబెట్టుక

కూయవచ్చినాండవు, కపోలతాడనం శేతునో। త్వమేవగార్ధ
భః। త్వమేవశునకః। త్వమేవశూకరః ”

అంత విలాసవతి వచ్చి కాంతిమతి వృత్తాంతంబు దెలుప భూపతి యాయువతిం బరిగ్రహించుట కంగీకరించె. విలాసవతి తిరిగివచ్చు లోపల తత్తరమంది కాంతిమతి యెఱుకలదానింబిలిపించి ప్రశ్నింప నాయెఱుకత చెప్పిన యెఱుక :—

“యెరుకాదు గెరుఖాదు గెరుఖాదుగే దుండి। నీవుతలంశిన తలంపు నీవు తలంశిన తలంపు నిజముగా శెప్పేనే। నిజముగా శెప్పేనే తార్గాణగా శెప్పేనే నిక్కముగా శెప్పేనే తార్గాణగా శెప్పేనేదుండి। అమ్మాయమ్మ అమ్మాయమ్మ యీబురుకనికి యీబురుకనికి బువ్వదేవే బువ్వదేవే। అవ్వగురిసూడ మొరంటెలో ముత్యాలు దేవే ముత్యాలు దేవే దుండి॥

ముత్యాలు తెచ్చినపిదప—

“శ్రీరాజగోపాల। దోరకానాత। బంగారుమన్న। శంగమరేండా। శండలంకార। వందువరావది। వల్లనిదేవర। గొల్లలసామి। చంపకవనవాస। సంపంగిరాయ। విజయరాఘువవరద। విజయసహాయ। నీవేనేనటు। నాతలంపుననిలిశి। యీకలికి తెలంశినతలంపు। నిజముగా బలుకవయ్య। నిక్కముగా బలుకవయ్య। తార్గాణగా బలుకవయ్య। అని యెఱుకలబుట్ట చేపట్టి రాజచంద్రునిపట్టి చేపట్టి యేమనుచున్నది.

అమ్మాయమ్మ అమ్మాయమ్మ శెయిసూపు శెయిసూపు శెయిసూపువేమండి। దనముగల శెయ్యే। దాన్యముగల శెయ్యే। బం

గారు శెయ్యే! బాగ్గెముగల శెయ్యే! నుండి! అటునిటు సూడక నే శెప్పేగురి వ్రాంకొని వినవే వ్రాంకొని వినవేదుండి! కండ్లంటే తోడు! కడుపంటే కొడుకు! కంటెంటే మగండు! వాండే రెండే వాండు''

వా—అని మఱియు నే మనుచున్నది.

దరువు—

మదిరాక్షి హెచ్చు తలంపు మదిని దలంచితివి
అది నీకుఁ దెలిపెద నతివ యేమిచ్చేవే॥
అలరు విల్తుండు మించు చెలువుండు నినుఁ జేరఁ
గల గంటివి రేయి కలకంఠి యీవు.

యెఱుకతమాట—

అమ్మాయమ్మ! అతం డేవితమువాం డంటా అడిగేవే! అతం డేవితమువాం డంటా అడిగేవే! అతం డేవితమువాం డంటా అడిగేవే! అయితే తెలిపే వినవేదుండి.''

అని పేరుచెప్పకయే యాపురుషుఁడు విజయరాఘవనాయకుఁడని స్పష్టపడునట్లు వర్ణించి కాంతిమతిచే బహుమానము నంది యెఱుకత వెళ్లిపోయెను. వెంటనే విలాసవతి వచ్చి రాజునొద్ద జరిగినవృత్తాంతము విశదపఱుప నాకాంత కాంతునిసమావేశంబున కెదురు చూచుచుండెను. నాయకుఁడును విలాసవతి వెడలిపోయినపిమ్మట విరహార్తిచే మిగులఁ దపించెను. ప్రబంధశైలి నీవిరహము వర్ణింపఁబడినది.

రాజిట్లు విరహబాధం బడుచుండ నాయన యాచార్యుం

దగుశతక్రతు శ్రీనివాసతాతయాచార్యులు.

దరువు— మురువైన చౌకట్లు ముత్యాలకుళ్లాయి
సరిలేని రతనాల జంట యఱచట్ట
హారువొందు వాజపేయచ్ఛత్రములసీడ"

ను వచ్చి రాజు మనసు కాంతిమతియందుఁ దగులకొని యున్న దని తెలిసికొని యా యువతి తండ్రియగు రాజచంద్రమహారాజు నొద్దకుఁబోయి యాతనిచే నాపెను రాజున కిచ్చి వివాహము చేసెద ననిపించుకొని తిరిగి రాజునొద్దకు వచ్చి యా వృత్తాంతము తెలిపి పురోహితుల రావించి వారలతో—

"రారయా పురోహితులారా! మీరు యీనగరికి నూరు తరాలనుంచి తగువైనవారు గనుక ముహూర్తం గలవారు, అటు గనుక కనకాంబరమున్ను ముమంగురాలతోట్టికూడా నగరిముత్తై దువులచేత పండు పసుపు బంగారు టెంకాయలు, పూలు వక్క లాకులు మొదలైన శోభన ద్రవ్యాలు బట్టించుకొని మేళతాళాలతో గూడా ఆ రాజచంద్ర మహారాజుగారి నగరికిపోయి వధూవరుల పేరింట సంతోషముగా పొంతనంబులుజూచి రేపు చంద్రతారా బలాలు గలిగిన శుభ దినంబు గనక రాత్రి యిరవై అయిదవ ఘడియను సింహాలగ్నమందు వివాహముహూర్తమని తెలియఁ బలికి సిశ్చయ తాంబూలం నేయించి రారయా."

అని పలికి వా రట్లు సలిపి తిరిగివచ్చి తెలిపిన రాజు వివాహమునకై తరలిపోయెను. పెండ్లికొడుకును పీఁటమీఁదఁ గూర్చుండఁబెట్టి ముత్తైదువలు—

దరువు—సువ్వి మన్నారు దాస సువ్విరమ్యహర్మ్యవాస
సువ్వి రుచిరముఖవిలాస సువ్వి సువ్వి
సువ్వి చోళభూమిపాల సువ్వి సుజన వినుతశీల
సువ్వి యువతి పాంచాల సువ్వి సువ్వి
సువ్వి మన్మథాకార సువ్వి సుకవిమందార
సువ్వి సారసుగుణహార సువ్వి సువ్వి,

అనుచు "కోట్టంబులు వెట్టిరి."

పిమ్మట నాయకుఁడు భద్రగజం బెక్కి యూరేగి రాఁగ వధూవరులఁ బీఁటలపైఁ గూర్చుండఁ బెట్టి పురోహితులు వివాహసంకల్పమునడిపి క్రమముగా "దేవతాహ్వాన నాంద్యగ్నిముఖ స్నాతకవ్రత పునః పుణ్యాహవాచన అంకురార్పణ కన్యావరణ మంగళాష్టక నవ వస్త్రధారణ మంగళసూత్ర ధారణ వివాహ ప్రధానహోమాది శుభకర్మంబు" లాచరింపఁ జేయించు సమయంబునఁ బురోహితుల కొకరికొకరికి సంవాదం బీవిధముగా నడచె:—

పురోహితుల మాటలు—

కొండుభట్లమాట:—అవునోయి యల్లు సోమయాజులు నూరు తరాలనుంచి యీ యింటికి తగువైన పురోహితుండ నే నుండంగా నీ వెవ్వండి కొడుకవు నాస్వాతంత్ర్యం కొంగుముడి రూక తీసుక పొయ్యే టట్టుగా—

యల్లు సోమయాజులమాట—యేమోయి కొండుభట్లు, మా తాతకు చవ్వప్పనాయనివారు పాంకెనసంభావన కట్టడ

చేసివుండంగా నీ వెవ్వండవు అపహరించుక పొయ్యేట
ట్టుగా మా యన్న కొడకవా?

వోభళభట్లమాట—అవురా నరసంభట్టిగా నగరింటి సహస్ర
నామపూజకు సువర్ణ పుష్పాలుగలవే అవల్లా అపహరించి
బదులుగా మొలాముచేసిన పూలు తెచ్చి వేస్తివే యిది
నగరివారు వింటే అట్లాగే శ్రేయించరా యిది యెంత లే
దని కనిపించుకోకవుంటే నీ వాఁడనా మరి.

నరసంభట్లమాట—వోరి వోభళభట్టిగా నగరింటి దాన ధర్మా
లల్లా తవాప్యర్థం మ మూవ్యర్థం అంచున్ను యిరు జీవి
యెరుంగకుండా అంతా అంటించుకొని కాదనిపించుకపో
యినవాన్ని వినవా వెనకటికి నీవైన బుద్ధిగలిగి వుండరా"
ఇట్లు వాదు లాడుచుండఁగా మధ్యస్థుఁడగు వేఱొక
పురోహితుఁడు వారిని వారించె.

ఆ సమయంబున ముత్తైదువలు జాత్యనుగుణముగా మా
టలాడినారఁట యెట్లనలెను.

రంగావొఝుల తిమ్మక్కమాట—యేమో ప్రోలుభట్ల యల్లమ్మ!
నగరింట పెండ్లినాఁడయి నా వొకప్రక్క బ్రద్ద చేసుకొని
నమలరాదమవో?

యల్లమ్మమాట—అవునషే రంగావొఝుల తిమ్మక్క! నాకు ప్ర
క్కబ్రద్దా వొకటి కొదవా, చాలుచాలు, నిన్న మా
వారు సుక్కురారంసంతలో పిండికూర కంచున్ను గాను
గబెండి తెచ్చిరి. పెండ్లి పందిట్లో నోరు మొదలించపలె

నంచున్ను యింత దెచ్చుక తించునా యింతే.

తిమ్మక్కమాట—ఓ పొరుగింటి తిమ్మావధాని పెండ్లా వీరమ్మ పాటలు బాడుచున్నది. అంటుకొని నీవున్ను పాడ్రా దమవో.

యల్లమ్మమాట—యిదేందో నీవు నాగపసానివై పెద్దతనం చేసుక వుండేదానవున్ను కడమవారు పాటలు పాడేవారున్నా?

తిమ్మక్కమాట—వోశమ్మా మా యింటి ఆయన యెందుకో యెపపోయే వేళా-రమ్మంచున్నారు. నాకు పాటలు పాడేటందుకున్న ప్రొద్దువున్నదషే. మా పుట్టింటిలో వుండేటప్పుడు కొండవీటి సర్వానుచేత పదినుడుగులు నేర్చుకొంటిని. పాడుదనో అంటే శిగ్గవుచున్నది. యిక్కడంతా మొగవారే వున్నారు. నీవు ధవళ మెత్తు నేనుం గూడా పాడేగాని"

ముత్తైదువులంత ధవళములు శోభనములు పాడిరి. అంత యథావిధిగా వివాహము పూర్తి యైనది. విజయరాఘవనాయకుఁడు కాంతిమతీ సహితుఁడై నిజనగరము ప్రవేశించి సుఖస్థితినుండె.

యక్షగాననాటకముల స్వరూపమును బూర్వకాలమందరవదేశములోనుండిన యాంధ్రుల వేషభాషలను దెలుపుటకై

నాటక స్వరూపము. యీనాటకమునుండి యింతగ్రంథము నుదాహరించి నాఁడను. ఈయక్షగాననాటకములు, ఆంగ్లేయవా

జ్మయమునందలి "operas" వలె గానప్రధానములై సామాజికులకు వినోదము గల్పించుటకే చాలును గాని యంతకంటె నధికఫలము నీయఁజాలవు. మహానాటకములు, కావ్యములు, పురాణములు మొదలగుగ్రంథములు కథాప్రధానములు. వానివలన ఫల మధికము. కావ్యములయందుఁ బూర్వవృత్తమును గవి తా ననువదించి చెప్పును. శ్రోత లామాటల యర్థమును బట్టి పూర్వము జరిగినది తమ మనస్సులకుఁ బట్టించుకొని యానందింపవలసియున్నది. నాటకకర్త పూర్వవృత్తమునకుఁ బునస్సృష్టి కావించి దానిని యథార్థపురుషస్థానీయులగు పాత్రముల మూలమున వ్యక్తపఱుచును. రసజ్ఞులు నిపుణతతోఁ బ్రదర్శించినచో నావృత్త మంతయు నప్పుడు తమయెదుట జరుగుచున్నదను భ్రాంతిని గలిగించి సామాజికుల హృదయముల నార్ద్రములుగా నొనర్చి నందు కవిభావములు నాటుకొని రసము లంకురింపఁ జేయును. కావుననే సాహిత్యము నాటకాంత మనుమాట పుట్టినది. ఇట్టినాటకములు పూర్వ మాంధ్రవాఙ్మయమునందు లేకుండుటచే నాధునికకవులు కొందఱు ఆకొఱఁతను దీర్ప సమకట్టి పెక్కు సంస్కృతనాటకములను, గొలఁదిపాటి యింగ్లీషునాటకములను దెనిఁగించిరి. ఇటీవలఁ గొందఱు క్రొత్తనాటకములు గూడ రచియించిరి.

సంస్కృతనాట కానువాదమే యిప్పటికిని విరివిగా నడుచుచున్నది. సంస్కృత నాటకములను దెలిఁగించుటలో నాంధ్రకవులు రెండు భిన్న మార్గములం ద్రొక్కినారు. మూలము

సంస్కృత నాటకానువాదము.

లో నున్నది యున్నట్లు "తూచాలు" తప్పకుండ నక్షరార్థక్రమమునఁ దెలిఁగించుట యొక మార్గము. దీనిని వేదము వేంకటరాయశాస్త్రి ప్రభృతు లవలంబించిరి. మూలములోని భావము ప్రధానము చేసికొని యా భావము నాంధ్రభాషా సంప్రదాయానుసారముగా నాంధ్రుల కింపగునట్లు తెలుపుట రెండవ మార్గము. ఈమార్గమును వీరేశలింగ ప్రభృతు లనుసరించినారు. ఈ రెండవ రీతియే యుచిత మని నా యభిప్రాయము. ఆంధ్రులకు మూలగ్రంథములయందలి భావములు ప్రధానములుగాని యందలి పదములును వానికూర్పు మ ప్రధానములుగావు. భాషాస్వరూపమునుబట్టి శబ్దములేకాక వాక్యరచనారీతికూడ మాఱుచుండును. సంస్కృతశ్లోకమునందుఁ జక్కఁగా నిమిడియున్న భావము సంస్కృతభాషాపరిచయముగలవారి మనంబుల కెక్కిన రీతిగాఁ దెనుఁగువారి మనస్సులందుఁ బట్టునట్లుగాఁ దెలిఁగింపవలయు నన్న నాంధ్రకవి యా భావమును దనమదికిఁ బట్టించుకొని స్వీయభావముగాఁ జేసికొని యాంధ్రభాషాసంప్రదాయానుసారముగా వ్యక్తపఱుపవలయును. కమసాలి ప్రాఁతబంగారు నగను గరఁగించి క్రొత్త నగను జేసినట్లాంధ్రకవియు సంస్కృతవాక్యముల విడఁదీసి భావమును మాత్రము గ్రహించి యా భావమున కాంధ్రభాషానురూపమగు నూతన రూపము కల్పింపవలయును. అట్లుగాక మక్కికి మక్కి పెట్టి యక్షరార్థక్రమముగాఁ దెనిఁగింపఁబడిన గ్రంథములు మూలగ్రంథములకు వ్యాఖ్యానములుగా నుపకరింపవచ్చును గాని

యాంధ్రగ్రంథము లనిపించుకొనవు. ఆంధ్రుల కంతగా రుచింపవు.

అనువాదగ్రంథముల విషయమున నేమి స్వతంత్రగ్రంథముల విషయమున నేమి చెప్పవలసిన దింకొక్కమాట గలదు. శబ్దౌచిత్యమును సుప్రసన్నమైన శైలియుఁ గలిగిన కవిత్వము నిష్కళంకదర్పణముపోలెఁ బ్రకాశించుటంజేసి యందుఁ గవి భావములు చక్కఁగాఁ బ్రతిఫలించి పాఠకుల మనములకుఁ దేటతెల్లముగా నగపడును. అట్లు కానికవిత్వము దుమ్ముపట్టిన యద్దమువంటిదయి యందుఁ గవి భావములు కొన్ని యగపడుటయుఁ గొన్ని యగపడకుండుటయు నగపడినవైన నయథార్థముగా నగపడుటయుఁ దటస్థించును.

ఆంధ్రీకరింపఁబడిన సంస్కృత నాటకములలో "ఉత్తరే రామచరితే భవభూతిర్విశిష్యతే" యన్న కాళిదాసోక్తికి నిదానమయిన యుత్తరరామ చరిత్రము మొదటిదయినట్లు తోఁచుచున్నది. దీనిని వావిలాల వాసుదేవశాస్త్రిగారు 1880 వ సంవత్సరములో నాంధ్రీకరించిరి. ఇటీవలఁ బదిమందివఱకు దీనిని దెనిఁగించిరి. వారికెల్లను నేను గడగొట్టువాఁడను. వాసుదేవశాస్త్రిగారు, మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు, శ్రీమంత్రిప్రెగడ భుజంగరావుగారును రచించిన గ్రంథములను బరిశీలించితిని. ఈ మూఁటిలో సూర్యనారాయణశాస్త్రిగారి గ్రంథము మూఁడవ కూర్పులోని రచన యుత్తమముగా నున్నదని నా యభిప్రాయము. మచ్చున కొక శ్లోకమును దాని తెలుఁగు పద్యములను నుదాహరించెదను.

శ్లో. అద్వైతం సుఖదుఃఖయో రనుగతం సర్వా స్వవస్థాసు య
ద్విశ్రామో హృదయస్య యత్ర జరసా యస్మిన్నహార్యో రసః
కాలే నావరణాత్యయాత్పరిణతే యత్ప్రేమసారే స్థితం
భద్రం తస్య సుమానుషస్య కథమ ప్యేకం హి త త్ప్రార్థ్యతే.

ఉ. ఎవ్వని కైన జన్మమున హృచ్ఛ్రమ లేక సుఖాసుఖంబుల
న్నవ్వుచు నొవ్వకే చెలువున న్సతతంబును రాగలబ్ధితో
జవ్వన మూడి వార్ధకముసాఁగఁగ స్నేహము నొందుకొన్నఁదా
మవ్వపుఁగోర్కి నట్టి యతిమానుషశాలికి మంగళం బగున్.

వాసుదేవశాస్త్రిప్రణీతము.

ఉ. ఎయ్యది ఖేదమోదముల నేకము సర్వదశానుబద్ధ మే
దెయ్యెడ విశ్రమించు మన మెందలి రక్తి జరాసహాయమౌ
నెయ్యది యోలి లజ్జ నశియింప ఘనప్రణయంబు గాంచు నా
నెయ్యపుజంటకున్ శుభము నిత్యముఁ గోరఁబడుం గడంకతోన్.

భుజంగరాయప్రణీతము.

మ. సకలావస్థల నేది కష్టసుఖముల్ సైరించునో యేకమై
వికలం బైన మనంబు నెందుఁ గనునో విశ్రాంతి యెందొప్పు వా
ర్ధకమందుం దమిఁ బెండ్లియాది మృతిపర్యంతంబుగాఁ బ్రేమసా
ర్ధక మా నెయ్యది నిత్యభద్రమయి యా దాంపత్యమే పారెడున్.

సూర్యనారాయణశాస్త్రిప్రణీతము.

ఉత్తరరామచరితము తరువాతఁ దెలిఁగింపఁబడిన సంస్కృతనాటకములలో ముఖ్యమైనది. కాళిదాసకృత శాకుంతలము. దీనిని కందుకూరి వీరేశలింగముగారు 1883 సంవత్సరము

లోఁ బ్రకటించిరి. తా మీ నాటకములో మొదటి రెండంకము లు తెనిఁగించి 1876 సంవత్సరమునందు వివేకవర్ధనీ పత్రికలోఁ బ్రకటించి యంత పరవస్తు రంగాచార్యులుగారుకూడ నానాటకమునే తెనిఁగించుచున్నారని విని వారు ప్రకటించుచుండిన "సకలవిద్యాభివర్ధనీ" పత్రికను దెప్పించిచూడ నందులోఁగూడ మొదటి రెండంకములు మాత్రమే యుండుటచే నాచార్యులుగారి గ్రంథము పూర్తియైనపిదప నదిచూచి తాము తమగ్రంథము పూర్తి చేయవచ్చునని వేచియుండి యాగ్రంథ మెప్పటికిని బూర్తికాకపోవుటచే 1883 వ సంవత్సరములోఁ దమ గ్రంథమును బూర్తిగాఁ బ్రకటించితిమని వీరేశలింగముగారు స్వీయచరిత్రమునందు వ్రాసినారు. నాకుఁ దెలిసినంతవఱకు నీ క్రింద నుదాహరింపఁబడినవారుకూడ నీ నాటకమును దెనిఁగించిరి.

1. రాయదుర్గము నరసయ్యశాస్త్రులుగారు.
2. వేదము వేంకటరాయశాస్త్రులుగారు.
3. దాసు శ్రీరాములుగారు.
4. వడ్డాది సుబ్బారాయఁడుగారు.
5. మంత్రిప్రెగడ భుజంగరావుగారు.
6. వత్సవాయ నీలాద్రిరాజుగారు.
7. కాంచనపల్లి కనకమ్మగారు.

ఈగ్రంథము లన్నియు వీరేశలింగముగారి గ్రంథముతరువాత బయలుదేఱినవే. దాసు శ్రీరాములుగారు దీని నచ్చతెనుఁగున రచియించి తక్కినవారికంటె నధిక నిర్బంధములకు లోనయి

రి. నేను జూచినంతవఱకు వీరేశలింగముగారి యాంధ్రీకరణము మేలుగా నగపడుచున్నది. ఒక్కయుదాహరణము :—

శ్లో. యాత్యేకతోస్త శిఖరం పతి రోషధీనా
మావిష్కృతోరుణపురస్సర ఏకతోర్కః
తేజోద్వయస్య యుగపద్వ్యసనోదయాభ్యాం
లోకో నియమ్యత ఇ వాత్మదశాన్త రేషు. అ.౪.శ్లో.౨.

చ. ఒకదెస నస్తశైలమున కోషధినాథుఁడు పోవుచున్నవాఁ
డొకదెస భాస్కరుం డుదయమొందె ననూరుపురస్సరంబుగా
నొకసమయంబునందె వ్యసనోదయము ల్గనె రెండుతేజముల్
ప్రకటసుఖంబు దుఃఖమును బ్రాణుల కిట్లని తెల్పఁ కె వడిన్.

వీరేశలింగముగారు మాళవికాగ్నిమిత్రము, ప్రబోధచంద్రోదయము ననునాటకములును రత్నావళియను నాటికయును గూడఁ దెనిఁగించిరి. ఉత్తరరామచరిత్రముకూడఁ దెలిఁగింపఁ దలఁచిరి కాని వాసుదేవశాస్త్రిలుగా రాపని చేయుచున్నట్లు తెలిసి మాని వేసినారఁట.

మృచ్ఛకటికనాటకమును వాసుదేవశాస్త్రిగారు, తిరుపతి వేంకటేశ్వరకవులును దెనిఁగించినారు.

ముద్రారాక్షసనాటకమును—నుసర్ల అనంతరావుగారును, పాలెవు వేంకటసూర్యగోపాలముగారును దెనిఁగించినారు.

వడ్డాది సుబ్బారాయఁడుగారు వీరరసప్రధానమగు వేణీసంహారనాటకము నాంధ్రీకరించిరి. ఈనాటక మొకసారి ప్రయోగింపఁగాఁ జూచినాఁడను. సుబ్బారాయఁడుగారిపాక మీారసము

నకు సరిపడిన దని నాయభిప్రాయము. ఈకవి ప్రబోధచంద్రోదయమును, మల్లికామారుతప్రకరణమును చండకౌశికనాటకము నుగూడఁ దెనిఁగించెను.

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారిటీవల భాసనాటకములనుప్రతీతితో వెలువడిన పదునొకొండు చిన్న నాటకములం దెనిఁగించిరి. వీరిరచన వీరేశలింగముగారి రచనకంటె నించుకపలుచనయు సుప్రసన్నము నయి మూలగ్రంథాపేక్ష యేమాత్రము లేకయే భావము సువ్యక్తము చేయును. వీరి శైలిం దెలుపుటకు మూఁడుపద్యములనుమాత్ర ముదాహరించెదను :—

౧. అలరుందేనియఁ గ్రోలి మత్తుగొని యవ్యక్తధ్వనుల్ సేయు తేఁటులగ్రుచ్చున్ బిగియారుగాఁగిటనునాఁడుంచు మ్మెదల్గూరిమిన్
చెలికాఁడా మనకాలిచప్పుడయిన స్త్రీతిల్లి యీతేంట్లు నా
వలెఁ గాంతావిరహార్తిఁ గుందు మనమావంకం జనన్వద్దిఁకన్
(స్వప్నవాసవదత్త)

౨. మొదటన్ గాలికిఁ దూలి వెండియు నభంబుం గ్రమ్ము వర్షర్తునీ
రదమట్టుల్ దొలుదొల్త నోడి యిటుగర్జల్ సేయుదే వెండిచి
మ్మెదరా రమ్మిటు మాటలేమిటికి భూమిన్ వ్రయ్యలై కూలిపో
వుదు వజ్రాహతి నంజనాచలతటంబుంబోలి యొక్కుమ్మడిన్.—
(బాలచరితము)

3. భువి నభిషిక్తులైన నృపపుంగవు లెల్ల గతించినారటుల్
దివమున కేఁగెఁ గర్ణుఁడు నదీతనయుండును నేలఁగూలె నా
హావమున నేను జూడ హతమయ్యెను భ్రాతృశతంబునున్నదీ

హావణున నాయవస్థ యిఁక నాయుధముఁ గురుపుత్రుపీడవే.
(ఊరుభంగము)

ఇంగ్లీషునాటకములు తెనిఁగించుటలోఁ గూడ వావిలాల వాసుదేవశాస్త్రిగారే ప్రథములయినట్లు తోఁచుచున్నది. వీరు "జూలియస్ సీజర్" Julius Caesar అనునాటకమును సీజరుచరిత్రమను పేరఁ దెనిఁగించినారు. కథయందుఁ గాని పాత్రలనామములందుఁగాని మార్పులేమియుఁ జేయలేదు. ఆదినుండి యంతమువఱకుఁ దేటగీతములే వాడిరి. ఈఛందస్సే మూలములోని ఛందస్సునకు మిక్కిలిఁ జేర్పుగానుండునని వీరు చెప్పినమాట యుచితముగానే యున్నది.

ఆంగ్లేయ నాటకానువాదము.

వీరేశలింగముగారు—

౧ చమత్కారరత్నావళి. 3 కళ్యాణకల్పవల్లి
౨ రాగమంజరి ౪ వెనీసువర్తకచరిత్రము

అను నామములతో నాంగ్లేయ నాటకములకుఁ దెనుఁగు చేసిరి. నాలుగవదానిలోఁ దప్పఁ దక్కిన నాటకములలో మూలములోని పాత్రల నామములు విడిచిపెట్టి వానిస్థానమున సంస్కృతనామములను గల్పించిరి. ఇతివృత్తము మార్పలేదు గాని, యది భరతఖండమునందే జరగినట్లు తోఁచుటకై యచ్చటచ్చటఁ గొన్ని నూతనచ్ఛాయలఁ గల్పించెను. ఈ నాటకములను జదువునప్పుడు వానిలోనికథ విదేశకథ యను ననుమాన మైనఁ గల్గదు.

చమత్కారరత్నావళి (Shakespeare) కవికృతమగు (Comedy of Errors) ను వెనీసువర్తక చరిత్రమునకు, ఆకవి

యే రచియించిన (Merchant of venice) అను నాటకమును మూలములు. రాగమంజరి, కల్యాణకల్పవల్లులు (Sheridan) కవి రచితములగు (Duenna, The Rivals) అను నాటకముల యనువాదములు. చమత్కారరత్నావళియు కళ్యాణకల్పవల్లియుఁ గేవల గద్యాత్మకములు. రాగమంజరిలో నచ్చటచ్చటఁ బద్యములు గలవు. వెనీసు వర్తకచరిత్ర మంతయు ద్విపద మయము. ఈ నాటకమందు మొదటి రెండంకములు మాత్రమే ప్రకటింపఁబడినవి. ఈ నాటకములలో దేనికిని బఠనపాఠనము లంతగా లేవు. మొత్తము మీఁద నాంధ్రులకు సంస్కృత నాటకానువాదములపైఁ గలుగునాదర మాంగ్లేయ నాటకానువాదములపైఁ గలుగ లేదు.

నూతనాంధ్ర నాటకములు— నందకరాజ్యము.

క్రొత్తగాఁ గల్పింపఁబడిన యితివృత్తముతో స్వతంత్రముగా రచింపఁబడిన మొదటి తెనుఁగునాటకము వావిలాల వాసుదేవ శాస్త్రిగారు రచించిన నందకరాజ్య నాటకమే యని తలంచెదను. ఈ నాటకము 1880 వ సంవత్సరములోఁ బ్రకటితమైనది. పీఠికలో శాస్త్రులుగారు నాటకరచనకు నిమిత్తము నిట్లు వివరించినారు:—

“ఇది నేను వ్రాయుటకుఁ గల్గిన ముఖ్యోద్దేశము మనవారిలో—అందులో బ్రాహ్మణులలో—బహుతరముగాఁ గాన్పింపనట్టి యైకమత్యమును సర్వవిధంబుల స్వీకరించి దానివల్ల మనమెల్ల మేలు పడయఁ గోరవలయునని యెఱింగించుటె కాని మఱి

యొకటి కాదని స్పష్టముగాఁ జెప్పుచున్నాఁడను. ఈ సంగతినే పాడిమాటలతోఁ దెలియఁజేయక కథ యొకటి కల్పించి యం దులోఁ బరస్పర వైరములు పెంచినవారు శిక్షింపఁబడినట్లు కూర్చుట మంచి దని యెంచి, యిట్టి నాయభిప్రాయంబునె మన వా రెల్లరుఁ గైకొందు రని తలంచి నాటకధోరణిని వ్రాసితిని. కృష్ణాగోదావరీజిల్లాలలో—ముఖ్యతరముగాఁ గృష్ణాజిల్లాలోనే—రమారమి పాతికసంవత్సరములక్రిందట బ్రాహ్మణజాతివారిలో నెందుమూలముననో కాని వైషమ్యములు పుట్టి నానాఁటికిఁ బ్రబలి యనేకవిధములఁ బీడించుచుండుట యందఱికిని నఱచేతి యద్దములోని బొమ్మవంటిదేకదా. ఇట్టిబాధలు రాజకార్యముల లోను బ్రవేశించిన వనుటకు మానవకోటియొక్క మనోదౌర్బ ల్యము నెఱింగిన యెవ్వరు ననుమానింపరు. అసలే నాశిల్లి పోవు చున్న వైకమత్య (కట్టుదల) మను మొలకను వేరు దెంపఁ బోలు పడ్డ యీవిరోధముల నిందులోఁ బొందుపఱిచి యుభయత్ర మేలు చేయఁగింటి ననుకొనుచున్నాఁడను. పుస్తకము పూర్తిగఁ జదివిన దాఁక నాయీయభిప్రాయ మింత స్పష్టముగాఁ దేలక పోవచ్చును.

మఱియు నీదినములలో జరుగుచున్న యధికదౌర్జన్య ములుకూడ నిందు నక్కడక్కడ సందర్భవశమునఁ గానుపింపఁ గలవు. అద్దములో ముఖములు చూచుకొన్నగతి, నెప్పుడో జరిగించినట్లుగా నిందుఁ జెప్పఁబడ్డవియెల్లఁ బ్రస్తుతమున జరుగు చున్నవే యని నమ్మి నాచదువరు లెల్లరు నట్టివానికి దూరముగాఁ

దొలంగి దాన సుఖపడెదరుగాత మని కోరుటొక్కటే నే నిప్పుడు చేయఁగల పని యై యున్నది.”

ఈనాటకములోని యితివృత్త మెద్ది యన:—విశాలాపురము రాజధానిగాఁ జేసికొని నందకుఁ డనురాజు భూపరిపాలనము చేయుచుండెను. ఈతనియొద్ద శరభోజీ, అప్పాజీ యను నిద్దఱు మంత్రులుగా నుండిరి. వీరిని లోఁబఱుచుకొని గ్రామకరణములందఱు పూర్వకాలమందుఁ బుట్టియున్న వైదికబ్రాహ్మణ మాన్యములపై రాజానుమతిలేకయే క్రొత్తగాఁ బన్ను కట్టియుఁ గొన్నిభూములఁ గ్రమక్రమముగా నితరులకు సంక్రమింపఁజేసియు మఱియు ననేకవిధములఁగూడ వైదికుల కపకార మొనర్చుచుండిరి. బాధలు పడిపడి, కొందఱు వైదికులు రాజపురోహితుఁడగు శారదానందుని సాహాయ్యమున రాజును జేరి మొఱలిడిరి. రాజు పెద్దసభఁ గావించి యచటికి వైదికులను రాజకీయోద్యోగులను రావించి వారివాదప్రతివాదములఁ బరిశీలించి కరణములు వైదికబ్రాహ్మణుల బాధించిరని నమ్మి దీనికంతకు మంత్రులే ముఖ్యకారకులని నిశ్చయించి వారిద్దఱును గాశికిఁబోయి యచ్చటనే యావజ్జీవము నివసించున ట్లుత్తరువు చేసెను. ఇంతవఱకే ప్రధానకథ. అది చతుర్థాంకముతో ముగిసెను. పంచమాంకములోఁ బూర్వము కాళిదాసు విషయములో జరిగిన దనుప్రతీతిగల “సనేమిరా” కథవంటి యొక “సనేమిరా” కథ శారదానందుని విషయమై కల్పించి చిట్టచివర కుత్తరరామచరిత్ర నాటక సప్తమాంకములోని యంతర్నాటిక చివరభాగము నాటక మా

డించి గ్రంథసమాప్తి గావించెను. ఈపంచమాంకకథకుఁ బ్రధాన కథతో సంబంధ మేమియు లేదు. ఇది గ్రంథపూర్తికై కల్పింపఁ బడినట్లున్నది.

ద్వితీయాంకములో అన్నప్పశాస్త్రులచేత రాజసమక్షమం దష్టావధానము చేయించి యందుఁ బూర్వకవికృతపద్యములనే యను సంధించెను. నాల్గవయంకమందలి వాదప్రతివాదములందుఁ గొన్నిమాట లుదాహరించెద.

వైదికులపక్షమున రామదీక్షితులు చెప్పినమాటలు—

"బ్రాహ్మణులు మున్నెపుడొ రెండుభాగములుగ
నేరి-విహరించువారు లౌకిక్యాబ్ధిలోనుఁ
జతురతాపాటవపుఁదెప్పసాయమునను;
వేద మధ్యయనించియు వివిధశాస్త్ర
మభ్యసించియుఁ దక్కిన యందఱకును
బడసి గురుభావ మెల్లెట్లొ పరఁగువారు:—
వీరు వైదికుల్, లౌకిక్యలు వారు నేరి
కొన్నిచోట్లను బ్రాహ్మణు లన్నమాట
పరువుతోఁ జెల్లుచున్నది వైదికులకె
లౌకిక్యులకు జీతములు నెల్నెలకును ముట్టు
టొక్కటేకాక వారిలోఁ బెక్కుమంది
కరణములు గానఁ గాంతురు గౌరవంబు
వైదికులు రాజునకుఁ జేయుపనులు లేవు
కాదె, యనుబాలిశుఁడు నరకానఁబోవు.

*    *    *    *

భూపసంపత్తికిని వారె మూలబలము
కావునను వైదికులకు భూకాంతులు మును
పెక్కులుగ జీవనములు కల్పించినారు
బహుదినంబులు పోఁ గుటుంబములు పెరిఁగి
పఱకో పాతికో చిక్క, మావారు సగము
తగ్గి జీవించుచుండిరి దాన దాన
కానియేలొ, యిటీవల హాని వచ్చె.
వైదికులపుణ్యమునఁ బండ వారి పొలము
చూడనోల్లకయో తమచోట రాజు
పూర్ణవిశ్వాసముంచిన మిఱువు నోరు
లేని మామీఁదఁ జూపంగఁ బూనియొక్క
మంత్రిశరభోజి యూరూర యాత్ర మల్లి
కరణములఁ గట్టుకొని మాకు జరుగుచున్న
సర్వదుంబాల మాన్యముల్ చక్కలాగు
కొనియె; దీనను బొక్కసమునకుఁ జాల
నిండుగలిగెను గాఁబోలు నేఁటికిట్లు!
అట్టులైనను బాగుండు! నబ్దరీతిఁ
దిరిగి వెచ్చింపఁబడుఁ బ్రజాభరణమందు!
మతవిషయమందు లౌక్యులు మాకు నెదిరి
క్రొత్తపద్ధతి నేర్పర్చికొనిరి మొన్న;
దానితో మాకుఁ బనిలేక దౌలనుండ,

వెలువడినవారిఁ గులములోఁ గలుపుకొనుచు
యుగనిషేధంబు గణియింపకుంటె కాక
చేత నధికారముండుటచేత, మాకుఁ
జిక్క పిడికెఁడుపొలము కాఁజేసినారు"

రాజకీయోద్యోగులపక్షమున శరభోజి చెప్పినమాటలు.

"ఇప్పు డీదీక్షితులు విప్పిచెప్పినట్లు
వైదికుల పైన మాకేమి వైరమేమి?
మేము వారును నొక్కటై మెలఁగఁ గన్న,
నైకమత్యఫలంబుల ననుభవింపఁ
గాను, మాసరివా రెందుఁ గానరారు.
అయిన నావేడ్క మా కిందు నబ్బదయ్యె;
స్వామికార్యనిర్వహణము జగడమునకు
మూల మయ్యెను, నిజముగా భూపవర్య.
కోవెలల పెద్దకోనేర్లుగూడను దమ
వంతు జలబాష్ప మంపవే వారిదునకు;
వైదికు లయినమాత్రాన వా రదేల
పన్ను గట్టరొ, తలఁపుఁ డీ ప్రభువుగారు,
కష్టపెట్టుచుఁ బేర్కొను కాపులఁ దమ
చేలు దున్నించుకొను టొక్కచెడ్డతనము,
వీరు దయ్యాలుపెట్టినకారణమున
వీరి పొలముల పైరులు విఱుగఁబండి
వైరితోఁ గలహించిన వారి చేలు

మోఁక లేకుండఁగఁ బురుగు నాకిపోయె।
లంకపొలములకును వీరు సుంక మీరు.
సొంతకవతాలకంటె వేయింతలుగను
నూర్పు దెచ్చెదుపొలము పన్నులకుఁ దేకి;
పండి పండని దబ్బుపైఁ బన్నుగట్టి
యీడ్చి పుచ్చుకొనుట న్యాయ మెట్టు లగును?
మిరపకాయలో సున్నమో మ్రింగి యింత
వీరు సంపాదనము చేసినారు గాని
పంటపొలములు వీరి ప్రభావ మరసి
యిచ్చినా రనుకోఁబోకుఁ డెప్పటికిని
కొన్నియూళ్లను వైదికుల్ కోవెలలను
స్వస్తి చెప్పంగి చూసిరి; వారిక్రిందఁ
బొలము లుండుట కే హేతువుఁ గనఁబడదు.
వలసపోయిన వీరు, సభంబు విఱిగి
మీఁదఁ బడి చంపుసనుమాట, మేదినీశ!
వీరి బెదరింపుమాట యీభీతి యేల?
నారసాగెడు వీరిని నమ్ముకంటె,
నూరు వెడలింప మేలగు టొకటి నిజము.
మీకు నింతగఁ దయపయిం బ్రేమ యుంట
యెఱుఁగికాఁబోలు, వైదికు లెందు మమ్ము
నీసడింతురు, మఱి శపియించిరేమొ.
రాజుపని చూచుచున్న కరణము వెళ్లి

గ్రామపాచకునకు నమస్కార మెట్లు
చేయ మనసొప్పు? విన్నవించితిని నేను
గలతెలుంగెల్లఁ, బ్రభువులు ఘన మనీష."

ఈనాటకరచనకు మూలకారణమయిన బ్రాహ్మణవైషమ్యముల స్వభావము చక్కగాఁ దెలియుటకై యిన్నిమాట లెత్తి వ్రాసినాఁడను. ఈ వైదికనియోగిభేదము లీకాలమం దంతగా లేవు. వానిస్థానమున బ్రాహ్మణబ్రాహ్మణేతరభేదము లేర్పడినవి. ఈభేదములంగూర్చి నేఁటికవు లెవ్వరైన నాటకమును రచింపఁదలంచినచో వారికీ నందకరాజ్యము మార్గదర్శకము కావచ్చును. ఈనాటకమునందుఁ గథాచమత్కార మేమియు లేదు. ఏఁబదిసంవత్సరములక్రిందటనుండిన గ్రామవ్యవహారములు చక్కగా వర్ణింపఁబడినవి. శైలి ప్రసన్నముగా నున్నది. వీరేశలింగముగారు సాంఘికాచారవిషయకము లగు చిన్ననాటకములు కొన్ని కూర్చినారు. తెలుఁగులో నాటకరచనమున కాంగ్లసాహిత్యసంపర్కమే ప్రథమకారణమైనను, ధార్వాడనాటకసమాజముకూడ నింకొకకారణమని యూహింపవలసియున్నది. ఈ సమాజము 1880 వసంవత్సరములో రాజమహేంద్రవరము వచ్చియచ్చటఁ బెక్కు నాటకములం బ్రదర్శించినది. ఇవి చాలవఱకు మహారాష్ట్రభాషానాటకములే. కొన్ని హిందీనాటకములుకూడ నుండియుండవచ్చును. ఈనాటకప్రదర్శన మాంగ్లేయనాటకప్రదర్శనమును బోలియుండెను. పాత్రోచితము లయినభూమికలు, సందర్భోచితము లగుతెరలు, వాక్యోపవాక్యములు మనోహర

ముగా నుండెడివి. ఈనాటకములఁ బ్రదర్శించిన స్థలములందెల్లఁ దెనుఁగునందుఁగూడ నట్టినాటకములుండిన బాగుగా నుండునని యెల్లరకుఁ దోఁచుచుండెడిది. దీనివలన నాంధ్రనాటకరచనము నకుఁ గొంతప్రోత్సాహము కలిగినది. రాజమహేంద్రవరమునం దాసమాజమువారు నాటకము లాడుట ముగిసినవెంటనే తాను రత్నావళియను నాటికను చమత్కారరత్నావళి యను నాటకము నత్యంతశీఘ్రకాలములో రచించి యానాటకశాలలోనే యాడించితి నని వీరేశలింగముగారు చెప్పుచున్నారు.

పురాణములనుండియు దేశచరిత్రములనుండియు గ్రహింపఁబడిన యితివృత్తములతో ననేక నాటకములు బయలుదేఱినవి. వీరేశలింగముగారు ప్రహ్లాదనాటకము, హరిశ్చంద్రోపాఖ్యానము, దక్షిణగోగ్రహణము నను మూఁడునాటకము లిట్టివి రచించినారు. ధర్మవరము కృష్ణమాచార్యులుగారు రచించిన చిత్రనళీయసారంగధరనాటకములును, కోలాచలము శ్రీనివాసరావుగారు రచించిన రామరాజుచరిత్రము నీరీతివే. ఈకవు లిరువురును బళ్లారిపురమునందు న్యాయవాదులుగా నుండి యవకాశము కల్పించుకొని నాటకములు రచించి యాపురమునందున్న నాటకశాలలో నాడించుటయేకాక యానాటకములఁ బ్రయోగించుటలోఁగూడఁ బాల్గొనుచుండెడివారు. కృష్ణమాచార్యులుగారు రచించిననాటకములు పదునాలుగువఱకు నచ్చుపడినవి. అచ్చుపడనివిగూడఁ గొన్ని కలవఁట. వీరు నాటకరచనలో నాంగ్లేయనాటకచ్ఛాయలు కొన్ని గ్రహించినారు. అంకములలోని

ఇతివృత్తమును రంగములు (Scenes) గా విభజించుట వీనిలో నొకటి. విషాదాంతముగా నాటకము రచించుట యింకొక మార్పు. సారంగధరుని కాళ్లు చేతులు నఱికినపిమ్మట నాతఁడు మృతినొందినట్లు చెప్పి యంతటితో నాటకము ముగించెను. ఇట్టి విషాదాంతనాటకములు మననాటకసంప్రదాయములకు విరుద్ధములు. సారంగధరనాటకములో సారంగధరునిపై నపనిందమోపినందులకై చిత్రాంగిని శిక్షించుటకుఁ బూర్వము రాజు న్యాయసభ గావించినట్లును, అందుభయపక్షములవారును, దమతమ వాదములను దెలిపినట్లును, ఇతివృత్త మొకటి కల్పించి న్యాయవాది వృత్తియందుఁ దమకుఁగల యనుభవమును గవి ప్రకటించెను. ఈవిచారణలో రాజు న్యాయాధికారి. వాది రాజుభార్య. ప్రతివాది రాజు కొడుకు. నేర మేమో మిక్కిలి హీనమైనది. ఇట్టిస్థితిలో నాకాలమునం దిట్లు బహిరంగముగా విచారణ జరిగిన దనుటలో నౌచిత్యము చింత్యము. వినోదార్థమై గాన మచ్చటచ్చటఁ జేర్పఁబడినది. కర్ణాటరాజ్యావసానకాలారంభమున జరిగిన తల్లికోట యుద్ధములో నిహతుఁడైన అళియరామరాజు చరిత్రము రామరాజచరిత్రనాటకములోని యితివృత్తము. ఈ నాటకమును, జిత్రనళీయమును రంగమందుఁ బ్రదర్శించుటకు మిక్కిలి యనువుగా నుండును. ఈనాటకములఁ దఱచుగా నాడుటయుఁ జూచుటకై బహుజనము వచ్చుటయు సువిదితము. తిరుపతివేంకటేశ్వరకవులు పెక్కు నాటకము లీరీతిని రచించినారు. వారి కవిత్వమును గూర్చి ముందుముందుఁ బ్రశంసించెదను.

రంగస్థలమునఁ బ్రదర్శించుటలో చిలకమర్తి లక్ష్మీనరసింహకవికృత గయోపాఖ్యాన మధిక మని తోఁచుచున్నది. నేఁటి

**గయోపాఖ్యానము.** వఱకు దీనిప్రతులు లక్షదాఁక అమ్ముడుపడినట్లు వినుచున్నాము. ఆంధ్రుల కితరనాటకములకంటె నీనాటక మందధికాదరమున్నట్లు కనఁబడుచున్నది.

జనామోదమునుబట్టి నాటకరాజ మని చెప్పఁదగిన యీ నాటకమును గుఱించి యించుక విపులముగా విమర్శించుట సమంజసము. ఈయితివృత్తముగల పూర్వగ్రంథములు మూఁడు కనఁబడుచున్నవి. వానిలో మొదటిది నాదెండ్ల గోపమంత్రిప్రణీత మగు ద్విపదకావ్యము. ఈగోపమంత్రి కృష్ణదేవరాయలమంత్రి యగు సాళువ తిమ్మరసు మేనల్లుఁడు. కృష్ణరాయలయాజ్ఞానుసారముగాఁ గొండవీటిరాజ్యమును బాలించినాఁడు. కావున నితఁడిప్పటికి నాలుగువందల సంవత్సరముల పూర్వముండినవాఁడు. ఈద్విపదకావ్యమునుబట్టి రెండుపద్యకావ్యములు వెలుదేఱినవి. రామనామాత్యప్రణీతమగు రెండాశ్వాసముల చిన్నకావ్య మొకటియు వెల్లంకి సుబ్బయార్యప్రణీతం బగు నయిదాశ్వాసముల గ్రంథ మొకటియు. రామనామాత్యకృతి యహోబలస్వామి కంకితము. కావున నాకవి యాప్రాంతమువాఁడై యుండవచ్చు నని తోఁచుచున్నది. సుబ్బయార్యప్రణీతకృతి యొకానొక రామరాజున కంకితము. ఈరామరాజుచరిత్ర మేమియుఁ దెలియదు. కవికాలముం దెలుపు విషయ మేమియు గ్రంథమందు లేదు. కాని యీకవు లిద్దఱును రమారమి రెండువందలయేండ్లకుఁ బూర్వముండి రని యూహించెదను.

ద్విపదకావ్యము, కథప్రధానముగా సులభ శైలిని రచియింపఁబడినది. సందర్భోచితముగా నచ్చటచ్చటఁ గొలఁదిపాటి వర్ణనలు గలవు. రామనామాత్యుఁ డీకథను గ్రహించి కొంచెము వర్ణనలు పెంచి రసవంత మగు కావ్యమును రచియించెను. లక్షణవిరుద్ధప్రయోగములు కొన్ని యున్నవి గాని మొత్తముమీఁద గ్రంథము సరసముగా నున్నది. వెల్లంటి సుబ్బయార్యుఁడు కూడ నీకథను తీసికొని వర్ణనలు పెంచి ప్రౌఢపాకముతో నైదాశ్వాసముల ప్రబంధము రచించెను. బమ్మెర పోతరాజు రాకడ లచ్చటచ్చటఁ గలవు.

ఈగ్రంథముల కన్నిటికి సమానమైన యితివృత్త మేది యన—

శ్రీకృష్ణుఁ డొకనాఁడు ద్వారకాపురిసమీపమందు వనములో విహరించుచు నుదయకాలమున నొకసరస్సులో స్నానముచేసి సంధ్యావందనమొనర్చుచు సూర్యున కర్ఘ్యమిచ్చుచుండెను. ఆసమయమందు గయుఁ డను గంధర్వుఁ డాకాశమార్గమున బ్రహ్మదేవుని దర్శింపఁబోవుచు నుమిసెను. ఆయుమ్మి యర్ఘ్యమిచ్చుచున్న కృష్ణునిచేతిలోఁ బడియెను. పైకిఁజూచి యెవ్వనిం గానక యంత తప్పుచేసినవాఁ డెవ్వఁడై యుండునని యోచించుచుండ గయుఁ డని జలదేవత చెప్పెను. కృష్ణుఁ డుగ్రకోపమువహించి, యెవ్వ రడ్డమువచ్చినను సరియే మానక యా గయునిఁ జంపెద నని ప్రతిజ్ఞ చేసెను. కృష్ణునిప్రతిజ్ఞ యాకాశవాణిమూలమునఁ దెలిసికొని గయుఁడు కడు భీతినొంది పద్మగర్భునొ

ద్దకుఁ బోయి రక్షింపుమని వేఁడుకొనియెను. కృష్ణుఁడు సాక్షాద్విష్ణువు గావున నాతనిప్రతిజ్ఞం దప్పించుటకుం దాను జాలననియు నీలకంఠునిఁ బ్రార్థింపవలయు ననియు బ్రహ్మపలుకఁ, గయుఁడు కైలాసమున కేఁగి శంకరునిఁ బ్రార్థించెను. "కృష్ణుఁడు నేను నొక్కటియే కనుక నతనిపట్టు విడిపింపఁదగదు. నీవే పోయి యాతనిని వేఁడుకొనినచో రక్షించు" నని శివుఁడు పలికెను. కృష్ణునియొద్దకే వెళ్లినచో నాతఁడు తప్పక తన్ను వధించు ననుభీతిచేఁ బోనొల్లక యేమిచేయుటకుం దోఁపక గయుఁడు చింతించుచుండఁగా నారదుఁ డక్కడకు వచ్చి "యర్జునుని నీవు శరణువేఁడికొనిన నిన్నుఁ దప్పక యతఁడు కాచు" నని చెప్పెను. అట్లుచేసినచో నర్జునుఁడు పరమమిత్ర మగుకృష్ణునకు న న్నొప్పగింపకమానఁ డను భీతితో నాపాండవమధ్యమునొద్దకుఁ బోవెఱతు నని చెప్పఁగా "నట్లుగాదు భయకారణమును జెప్పకయే ముందుగాఁ బోయి శరణ మడుగుము. అర్జునుఁడు తప్పక యభయమిచ్చును. పిదప భయకారణమును జెప్పుము. చెప్పినను ధనంజయుఁడాడినమాట తప్పఁడు" అని నారదుఁడు నచ్చఁజెప్ప నంగీకరించి గయుఁడు ద్వైతవనంబున నున్న పాండవులయొద్దకుఁ బోయి యర్జునుం జేరి బలుదైన్యము దోఁప శరణువేఁడెను. "ఎవ్వరడ్డమువచ్చినను నిన్నుఁ దప్పక కాచెద" నని యభయంబిచ్చి పిమ్మట భయకారణ మేమి యని యర్జునుఁ డడుగ గయుఁడు జరిగినవృత్తాంతమును జెప్పెను. ప్రాణస్నేహితునితో వైరము ప్రాప్తించెనని చింతించి యుధిష్ఠిరునితోఁ జెప్పెను. గయుని రక్షిం

చుటే పరమధర్మ మని పాండవులందఱును గలసి నిశ్చయించిరి. ఈసంగతి తెలిసి "పట్టువదలి గయుని నాకొప్పగింపు"మని యర్జునితోఁ జెప్పుమని కృష్ణుఁడు వేగవంతుఁ డనువానిని బంపెను. అర్జునుఁ డాతనితో "శరణాగతుని విడువఁజాల" నని చెప్పెను. కృష్ణుఁడు తిరుగ నక్రూరునిచేతను జిట్టచివరకు సుభద్రచేతను వర్తమాన మంపెను. ఎవ రెన్ని చెప్పినను బార్థుఁడు తనపట్టు విడువకుండెను. దానిపైఁ గృష్ణుఁడు యాదవుల నందఱిం బ్రోగు చేసికొని యుద్ధమునకు సన్నద్ధుఁడై బయలుదేఱెను.

ఈలోపల నారదుఁడు హస్తినాపురమున కేఁగి కృష్ణుఁడు పాండవులతో యుద్ధము చేయఁదలఁచినాఁడని ధృతరాష్ట్రునితోఁ జెప్ప నాతఁడు దుర్యోధనుం బిలిచి నీవు మనసేనను దీసికొని వెళ్లి పాండవులపక్షమునఁ బోరవలయునని చెప్పెను. పాండవులతోఁ గలసి ముందుగాఁ గృష్ణుని జంపినపిదపఁ బాండవుల నవలీలగా వధించి నిష్కంటకముగా రాజ్యము చేయవచ్చు ననియెంచి దుర్యోధనుఁడు యుద్ధసన్నద్ధుఁడై ద్వైతవనమున కేఁగెను. కౌరవయాదవులకు ఘోరయుద్ధము జరిగెను. ఉభయపక్షములలో ననేకులు చచ్చిరి. పిదపఁ గృష్ణార్జునులకు ద్వంద్వయుద్ధమయ్యెను. వారిరువురు నొండొరులపై ననేకాస్త్రములం బ్రయోగించికొని చిట్టచివరకుఁ గృష్ణుఁడు చక్రమును, ధనంజయుఁడు పాశుపతమును జేపట్టిరి. ఆసమయంబున శంకరుఁడు ప్రత్యక్షమై వారిద్దఱి సమాధానపఱిచి కృష్ణునిచే గయుని రక్షింపించి నిహతమైన సేనను దిరుగ బ్రదికించెను.

లక్ష్మీనరసింహముగారీయితివృత్తములోఁ గొన్ని మార్పులు చేసి రమణీయమైన నాటకము రచించిరి. కథను బట్టియుఁ గొన్ని పద్యచ్ఛాయలను బట్టియు నీయన రామనామామాత్య ప్రణీత గ్రంథము చూచియున్నట్లూహింపఁ దగియున్నది. ఈకథలో నీయనచేసినమార్పులలో మొదటిది కృష్ణుఁడాదిత్యున కర్ఘ్య మిచ్చిన ప్రదేశవిషయ మైనది. పూర్వకృతులు మూఁడింటిలో నీకార్యము ద్వారకానగరసమీపమందలి వనములో నొకసరస్సునందు జరిగినట్లున్నది. నాటకములో నిది బృందావన సమీపమందుఁ గాళిందీనదిలో జరిగినట్లున్నది. చిన్నతనమందుఁ దాను సంచరించిన ప్రదేశములం దిరిగి చూచుటకును దనకుఁ బోషక జననీజనకు లగు యశోదానందుల దర్శించుటకును భార్యాసమేతుఁడై బలరామసాత్యకులతోఁగూడి కృష్ణుఁడు వచ్చి బృందావనమందు విడిసి యుండి కాళిందీనదిలో భార్యలతోఁగూడ జల క్రీడలు సలుపుటకు సంకల్పించి ముందుగా సంధ్యావందన మొనరించి యాదిత్యున కర్ఘ్య మిచ్చుచుండఁగా గయుని నిష్ఠీవనము చేతిలోఁ బడెననియు దానితోఁ గోపమువచ్చి పరివారమునంతను ద్వారకానగరమునకుఁ బంపివేసి తానుమాత్రము యశోదానందులం జూచి వచ్చెద నని చెప్పె ననియు నాటకమందున్నది. ఉత్తరరామచరితమునందువలెఁ బూర్వపరిచిత ప్రదేశములం జూచునప్పుడు గలుగు భావముల వర్ణించుట కనువై యుండునని లక్ష్మీనరసింహముగారీమార్పును జేసియుందురు. ఈసందర్భమందుఁ జెప్పిన కొన్నిపద్యములు మనోహరముగా ను

న్నవి. కాని, కృష్ణుని బాల్యక్రీడలు చాలవఱకుఁ "చిన్నతనపుఁ జేష్టలు" కావుననే కాఁబోలు మధురాపురమునకు వెళ్లినపిదపఁ గృష్ణుఁడు తిరిగి బృందావనమునకుఁ గాని గోకులమునకుఁ గాని వచ్చియుండలేదు. అట్టిసందర్భములో భార్యాసమేతుఁడై యిప్పుడచ్చటికి వచ్చుట యంత యుచితముగాఁ దోఁపదు. రెండవ మార్పు కృష్ణునిప్రతిజ్ఞ. యాకాశవాణి గయుని కెఱింగించినసందర్భమును గుఱించినది. పూర్వకృతులలో గయుఁడు సత్యలోకమునకుఁ బోవుచున్నపుడే, యనఁగాఁ గృష్ణుఁడు ప్రతిజ్ఞచేసినవెంటనే తెలిపినట్లున్నది. సత్యలోకమునకుఁ బోయి హిరణ్యగర్భుని సేవించి తిరిగి యింటికి వచ్చి భార్యతో సరససల్లాపములు చేయుచుండఁగాఁ నాకాశవాణి కృష్ణునిప్రతిజ్ఞను గయునితోఁ జెప్పె నని నాటకములో నున్నది. తాను సత్యలోకమునకు వెళ్లి వచ్చిన వృత్తాంతము తెలుపుచుఁ దనభక్తికి మెచ్చి చతురాననుఁడు వరము లడుగు మని తనతో నన్నట్లును, దాను—

మ. ధనమీయంగదె పాత్రయాచకులకున్ దానంబు గావింపఁగా
ఘనబాహాబల మీఁగదే కుజనశిక్షాదీనరక్షార్థమై
మనసీయంగదె చాలఁ గాలమును బ్రహ్మజ్ఞాన మార్జింపఁగాఁ
జనసీయంగదె ధర్మమార్గమున నిచ్చ ల్లోకసౌఖ్యార్థమై.

అని కోరినట్లును గయుఁడు భార్యతోఁ జెప్పెను. విరించి యట్టివరంబు లొసంగుటచే ధన్యుల మైతి మని భార్య యనఁగా గయుఁడు "కావుననే యిది మొదలు నాకు ముక్తిమీఁదనేగాని జీవితముమీఁద నిచ్చలే" దనియెను. ఆతనిభార్య చిత్రరేఖ

యది యమంగళవాక్య మని యెంచి చింతింప గయుఁ డామెను సమాధానపఱుచుచుండ—

"అవనిభారంబు హరియింప యదుకులమున
నవతరించిన యాదినారాయణుండు
దేవకీసూతి నీతలఁ ద్రెవ్వనేయుఁ
జండతరమౌ సుదర్శనచక్రధార."

అని యాకాశవాణి వినఁబడియెను. గయుఁడును భార్యయు మూర్ఛిల్లిరి. పద్యకావ్యములు మూఁటిలోను లేని యీ కథాభాగ ముత్తరరామచరిత్రములోని యీక్రింది కథను దలపించుచున్నది. చిత్రదర్శన మైనపిదప సీత యలసి నిద్ర పోవుచుండఁగా రాముఁ డామెయం దుండినతనప్రేమను వ్యక్తపఱుచుచు "కిమస్యా నప్రేయో యది పర మసహ్యస్తువిరహః" అనియెను. అనంతరక్షణమందే దౌవారికుఁడు వచ్చి "దేవ ఉపస్థితః" అని యావిరహమే సిద్ధమైన దని ధ్వనించునట్లు పలికెను. నిజముగా విరహమే సిద్ధ మైనది. విరించిని గయుఁడు వరములు వేఁడిన పద్యములోని భావము—

"స్థిత్యై దండయతో దండ్యాన్ పరిణేతుః ప్రసూతయే
అప్యర్థకామౌ తస్యాస్తాం ధర్మ ఏవ మనీషిణః"

అను రఘువంశశ్లోకములోని భావమును స్మరింపఁ జేయుచున్నది.

ఆకాశవాణి చెప్పిన యశుభవార్త విని గయుఁడును భార్యయు మిక్కిలి దుఃఖించిరి. ఈదుఃఖమును వర్ణించు పద్యగద్యములందుఁ గరుణరస మొల్కుచున్నది.

ఇట్లు కొంతవడి దుఃఖించి యీసందర్భమునఁ బరమేష్ఠిని శరణము కోరుట తప్ప వేఱు కర్తవ్యము లేదని గయుఁడు సత్య లోకమునకుఁ బోయెను. తరువాతికథ సమానమే.

శంకరుఁ డభయ మొసఁగమిచే గయుఁ డిట్లు విలపించి నట్లు రామయామాత్యకృతిలో నున్నది.

నాగలోకమునకు నేఁగి డాఁగియున్న
బలియు హరిభక్తుఁ డాతఁడు పట్టియిచ్చు.

సీ. ఉదధిమధ్యముచొచ్చి యొదిఁగి యుండెదనన్న
హరిమాయ యదియును నరసిచూడ
నగ్నికుహరములో నణఁగియుండెద నన్న
నాతనిసంచార మందుఁ గలదు
తారకాపథమునఁ దగిలి యుండెద నన్న
రవిమధ్యమున హరి రమణ నుండు
విపినభూములకేఁగ వెదకి తెచ్చియుఁ బట్టి
బంధించి తలద్రుంచి పగను దీర్చు
ఇట్టి పరహింస ప్రాపించె నేమి సేతు
నిది పరిహరించి ననుఁబ్రోవ నెవ్వఁ డోపు."

ఆ.వె. శివుని మాట నమ్మి శీఘ్రుంబె కృష్ణుని
సముఖమునకుఁ బోవఁ గ్రమము దప్పఁ
బాఱి లోకరిపులపాలికిఁ బోదురే
మఱియు నెంతమూఢమతులు నైన.

• ఈభావమునే గ్రహించి లక్ష్మీనరసింహముగారు—

"సీ. పాతాళమున కేఁగి బ్రదుకవచ్చునటన్న
బలిచక్రవర్తి నన్నట్టి యిచ్చు
నక్షత్రపథమున నక్కి యుండెద నన్న
భానుమండలమునఁ బరఁగు నతఁడు
జలధినాయకు వేఁడి శరణు చొచ్చెద నన్న
వటపత్రశాయినై యట వసించు

ఈ మొదలయిన నెనిమిది సీసచరణములును—చివర—

గీ. కడచెఁ గైలాససత్యలోకముల యాస
లెందుఁ బోవుదు గతి యేమి యెవఁడు ప్రోచుఁ
బదియు నాలుగుభువనము లేదకి చూడ
నేను దల దాఁచుకొనఁ దగు నెలవు లేదు."

అనుగీతమును మిగుల రమ్యముగా రచియించిరి.

పూర్వగ్రంథములలో నర్జును నొద్దకుఁ గృష్ణుఁడు ప్రథమమున వేగవంతునిచేతను పిదప నక్రూరునిచేతను, జిట్టచివరకు సుభద్రచేతను—ఇట్లు మూఁడురాయబారములు పంపినట్లున్నది. నాటకములో వేగవంతుని రాయబారము లేదు. అక్రూరుఁడు సుభద్రయు నేకకాలమందే వచ్చినట్లున్నది. అక్రూరుఁ డర్జునితో—

"నీతో ముఖ్యముగా నీబావ చెప్పుమన్న సందేశము వినుము."

".గీ ప్రాఁతచుట్టాల మని నొక్కి పలుకు మనియె
నొరులకైఁ బగఁ బూనుట యొప్ప దనియెఁ

బడుచుఁదనపు బింకమ్ములు విడువు మనియెఁ
దలకు మీఱిన పని చేయఁ దగని దనియె."

అని చెప్పి "మాకృష్ణుని వర్తమానంబునకు నుత్తర మేదో యొసఁగుఁడు" అని యడుగఁగా యుధిష్ఠిరుం డిట్లనియె.

"సీ. నళినగర్భునిగన్న నారాయణుఁడు తాను
బాంధవుం డగుట మాభాగ్య మనుము
బాల్యకాలమునుండి పాండవు లనయాన
నెన్నఁడు జవదాఁటి యెఱుఁగ రనుము
ఎన్నిసారులు వార లెంచిన మావాఁడు
గావించు తప్పిదా కోటియె యనుము
పరులకై మాతోడఁ బంతగించుట యెల్లఁ
దనవంటి వానికిఁ దగని దనుము
ప్రాయమున నీవు తనకన్న బాలుఁడైన
మోడ్పుఁగేల్పట్టి పలుమాఱు మ్రొక్కె ననుము
పాండుపుత్రులు విడరాని బంధు లనుము
గయుని క్షమియించి పార్థుని గావుమనుము."

ఆసందర్భముననే యర్జునుఁడు—

"నీయమూల్యోపకారంబు మఱవను.

మ. అతిరాగంబు సుభద్రపైఁ బొడమ సన్యస్తాన్యకామస్థితిన్
మతి యొక్కింతయుఁ బ్రొజ్యరాజ్యపదవిన్యస్తంబుగాకుండ నే
యతిగా నుండిన వేళలం బిలిచి నెయ్యంబాఱ నా సోదరీ
పతిఁగాఁ జేసిన నాఁటిమేటి కృప నాపైఁ జూపవే శ్రీహరీ.

ప్రాణంబులు మాయధీనముచేసిన విపన్నుని బగతున కొప్పగించి శరణాగతత్రాణ బిరుదాంకమగు భరతవంశమునకుఁ గళంకము తేఁ జాల నని మనవిచేయుదును."

అని ప్రత్యుత్తర మిచ్చెను. ఈవాక్యములు వినయపౌరుషగర్భితములై పాండవులకుఁగల ధర్మనిష్ఠను బ్రకటించుచు మిక్కిలి రమణీయములుగా నున్నవి.

సుభద్రార్జునసంవాదములో నాటకమందుకంటె రసవత్తరమైన మాటలు కొన్ని రామయామాత్యునిగ్రంథములో నీక్రింది రీతిగా నున్నవి. చూడుఁడు—

సీ. పుండరీకాక్షుండు పోరానిబంధుండు
ప్రాణపదము నీకుఁ బ్రాణనాథ
ఆపదబ్ధిఁ దరింప నక్షయ మగునావ
చెలువొందు నీబావ జీవితేశ
కల్లైన మఱవఁడు కరుణాకటాక్షంబు
నీమీఁద స్నేహంబు నెఱయ నునుచు
నాతనికృపను నీ వఖిల శత్రుల నెల్ల
సమయంగఁ జేసితి సాహసమున.
పెరటి చె ల్లెల్లు నుండనౌఁ బృథివిలోన
నేరికైనను నెఱుకయా నొచిచూడ
నెచటి గయుఁ డితఁ డూ రేది యెంచిచూడ
నింతచల మేల నొద్దయ్య యింద్రతనయ.

(ఈపద్యమునందలి భాషయెట్లున్నను భావము చక్కఁగా నున్నది.)

సుభద్ర తిరిగి ద్వారకకు వచ్చి యర్జునుఁ డన్నమాట లన్నతోఁ జెప్పి యతనిం గావు మని ప్రార్థించి "అన్నయ్యా! ఎఱుఁగక నీమఱఁది శరణు నొసంగెను. అద్దానఁ దప్పేమున్నది." అనఁ గృష్ణుఁడు కోపించి చెల్లెలితో—"ఔను తప్పు నీ మగనిది కాదు, నాదే—

సీ. "నీనాథునకు నేను మేనమఱందినై
యుదయంబు నొందుట యొక్క తప్పు
అన్నయానతిఁ ద్రోసి యా మహాత్మునకు ని
న్నుద్వాహ మొనరించు టొక్క తప్పు
చిన్ననాఁటనుగోలెఁ జెలిమిమై వారికి
నుపకారములు సేయు టొక్క తప్పు
గర్వితమతి వారు గావించు దౌష్ట్యంబు
నొప్పరికించుట యొక్క తప్పు
ఒప్పులే మేము చేయుట యొక్క తప్పు
తప్పు చేయకయుండుటే గొప్ప తప్పు
అన్ని తప్పులు మాయందె యున్న వబల
తలఁచిచూడఁ బార్థునియందుఁ దప్పు గలదె.

కల్యాణీ! ఇందు నిన్ననవలసినపని లేదు. స్త్రీబుద్ధి యల్పతయే దీనికిఁ గారణము.

ఉ. వంత యొకింత లేనటులు బాల్యమునుండియుఁ బుట్టినింటివా
రెంతటిభాగ్య మిచ్చినను నేత్రకియుఁ జూచినఁగాని కాంతకున్
సుంతయుఁ బ్రేమముండ దిఁక సోదరు లాదిగ బంధుకోటిపైఁ

గాంతలు మధ్యవచ్చిన మగండనినం బడి చత్తు రెంతయున్.

మఱియు-

గీ. సారె చీరెలు నగలును జాలఁ గొనుచుఁ
బుట్టినిండ్లు గుల్లలు చేసి పోయి సతులు
తుదకు మగని పక్షము చేసి యెదురగుదురు
మగనిపైఁ గూర్మి యధికంబు మగువ కెపుడు."

అని యాగ్రహించినట్లు నాటకములో నున్నది. దెప్పుళ్లతో నిండియున్న యీపలుకులు సామాన్యజను లనుకొనవలసినది ; గాని కృష్ణునంతటివాఁడు తన చెల్లెలితో ననవలసినవి కా వని నాయభిప్రాయము. పై మూఁడవపద్యము స్థానమందు రామయామాత్యకృతిలో—

"గీ. మగలమీఁది ప్రేమ మగువల కెల్లను
గలిగియుండు నిజము కల్లగాదు
తల్లి దండ్రి యన్న దమ్ముల మీఁదను
మెండు కూర్మి లేదు మెలఁతలకును."

అను పద్య మున్నది. మొదటి రెండుపద్యములకు సరిపోయిన పద్యములు పూర్వకృతులందు లేవు.

కృష్ణార్జునులకు వాగ్వాదము జరిగినట్లు ద్విపదకావ్యమందు లేదు. కాని పద్యకావ్యములు రెంటియందును ద్వంద్వయుద్ధము కొంత జరిగినపిమ్మట వారి కిరువురకు సంవాదము జరిగినట్లున్నది. లక్ష్మీనరసింహముగారి కథవట్టును గొంచెము మార్చి యుద్ధ మారంభించుటకుఁ బూర్వము బలరామునితోఁ గూడి

కృష్ణుఁడు పాండవులయొద్దకు వచ్చినట్లును, అప్పుడు కృష్ణార్జును లకు వాక్యప్రతివాక్యములు జరిగినట్లును జెప్పినారు. స్థూలదృష్టికి నీపీరసల్లాప మెంతయు సరసముగా నుండును. కాని యందుఁ గొన్నికొన్ని భాగములు పాత్రోచితములు గావని నాయభిప్రాయము. అవి యేవి యన—

కృష్ణుఁ డర్జునుతో—"అర్జునా

గీ. తలఁపవైతి నీకును నాకుఁ గలుగు చెలిమి
తలఁపవైతి చుట్టఱికపు ధర్మమైన
ఫాలనేత్రుని గెల్చిన బంట వగుటఁ
దలఁచినాఁడవు కాఁబోలు దర్ప మొకటి."

అనినఁ బార్థుఁడు—"అయ్యా!

గీ. దర్పము గలాఁడనంచు నేఁ దలఁపలేదు
పూర్వమైత్రిని దలఁపక పోవలేదు
మానధనుఁడ నగుట నీకు మఱఁది నగుట
దలఁచినాఁడను క్షత్రియధర్మ మొకటె."

అని బదులుచెప్పెను. ఈసంభాషణ మెంతయు నుచితముగాను రసవంతముగాను నున్నది.

"నే ననేకవిధముల నీ మృదుపదారవిందవందన మొనర్చి ప్రార్థించితి నని సుభద్రాకుమారులతోఁ జెప్పి పంపితిని, అయినను నీవు క్షమింపవైతివి." అని యర్జునుఁ డనఁ గృష్ణుఁడు—

"అయ్యో క్షమించెడువాఁడను నేనా?

సీ. ధార్తరాష్ట్రులు వృకోదరు నీసుమెయిఁ జంప
విషభోజనంబులు వెట్టునాఁడు
నెన రొకింతయు లేక నిదురించుతఱి వాని
నంబులఁ బడఁద్రోసి యలరునాఁడు
వారణావతమునఁ జేరిచి మిమ్మెల్లఁ
గౌరవు ల్లక్కయి ల్గాల్చునాఁడు
కొలువులో యువరాజు గురుజనంబులమ్రోల
నువిద గట్టిన కోక లొలుచునాఁడు
రాజసూయార్థమై బృహద్రథతనూజు
భీమసేనునిచేతఁ జంపించునాఁడు
మీకుఁ జుట్టమ్మనైతిని గాక నేఁడు,
బాంధవుఁడ నౌదునే నేను ఫల్గునుండ.

కృష్ణునితోఁ బనితీఱినది గావున నతనిని మీరు నిరాకరించుచున్నారు. ఏఱుదాఁటి తెప్పగాల్చిన ట్లయ్యె. ఇట్లు కృతఘ్నుఁడ వగుదు వని యెన్నఁడెఱుఁగ" నని బదులుచెప్పెను. ప్రల్లదములతోఁ గూడియున్న యీప్రత్యుత్తరము కృష్ణునకుండ వలసిన యౌదార్యమునకుఁ దగియుండలేదు. ఈపద్యమునకు మూలమనఁదగు పద్యము రామయామాత్యగ్రంథములో నిట్లున్నది.

సీ. "గరళంబు పెట్టించెఁ గౌరవాధీశుండు
గాలిసూనునకును గపటమునను
బాములచేతను బావని గఱపించెఁ
గ్రోధియై మిక్కిలి గురువిభుండు

లక్క యిండ్లను మిమ్ము లయము చేసెదనంచు
నింగల మంటించె నీర్ష్యమునను
జలమునఁ బాంచాలి సభలోన నానాఁడు
కోకలు విడిపించెఁ గుత్సితమున
అట్టి యాపద లెల్లను మట్టుపెట్టి
కాచి రక్షించినాఁడను గ్రమముతోడ
నేఁడు నదియెల్లఁ దలఁపక నీవు ఇపుడు
కత్తి గట్టితి నామీఁదఁ గయ్యమునకు"

అని క్రమక్రమముగా వాదము పెరిఁగి కృష్ణుఁడు కోపముతో—

"మూఢుఁడా! ఆగయుఁడు నిరపరాధుఁడా! అట్లయిన చో లోపము నాయం దున్నట్లున్నయది. ఇంత దురాచరణుఁడ వని మున్నెఱుంగక బలరామాదియదుపుంగవులతో గలహించి నాచెలియలు సుభద్రను నీకిచ్చి వివాహము చేసితిని."

అనఁగా ధనంజయుఁడు కోపముతో—

"నీ చెలియలి నాకేల యొసంగితివి? మఱియొక మహారాజకుమారున కర్పింపలేకపోయితివా? ఇంతమాత్రపు కన్య దొరకకపోయినయెడల బ్రహ్మచారినై యుందునే" అని బదులు చెప్పెను. దానిపైఁ గృష్ణునకుఁ గ్రమక్రమముగాఁ గోప మధికమై యవలకుం బొమ్మని యర్జునుం దన్నెను. అని నాటకము.

ఈసంభాషణమును, దన్నులును సామాన్యులకు సరిపోయిన సరిపోవచ్చును గాని కృష్ణార్జునులవంటి ధీరాగ్రేసరులకుఁ దగనిది యని నాయభిప్రాయము. ఇంతటితో ముగియక క్రమ

క్రమముగా రోష మధికమయి కృష్ణార్జును లొకరినొక రధిక్షే
పించుకొనసాగిరి.

సీ. "నీచ ముచ్చము నాక రాచపాడి దొలంగి
బిడియ మించుక లేక బిచ్చమెత్త
జనవిరుద్ధమ్ముగ సైదోడు లేవురు
వెలఁది నొక్కర్తు నే పెండ్లియాడఁ
గొలువు కూటమునందు గురుజనంబుల ప్రోల
సుదతిఁ బందెము వెట్టి జూదమాడ
సిరులెల్లఁ గోల్పోయి సిగ్గునఁ దలవంచి
కట్టుగుడ్డలతోడఁ గాన కేఁగ
నీవు నీయన్నదమ్ములు నేర్తు(రి)గాక
నేర్తురే మమ్ముబోంట్లు నిశ్చయముగ
జలధివలయిత ధారుణీచక్రమందు
మీసహోదరులకు సాటి మీరె సుమ్ము."

అని కృష్ణుఁడు దెప్పఁగా

"మీరు చేయుపనులు మేము చేయఁగలమా?

సీ. అల్లుఁడా రమ్మని యాదరమ్మునఁ బిల్చి
బంపుమామనుబట్టి చంపఁగలమె
జలకేళి సవరించు జవరాండ్ర కోకల
నెత్తుకపోయి చెట్లెక్కఁగలమె
యిల్లిల్లు దిరిగి వ్రేపల్లెలో మ్రుచ్చిలి
మిసిమిముద్దలు తెచ్చి మ్రింగఁగలమె

గొల్లబొట్టెలఁ గూడి కోల చేకొని కానఁ
గదుపులు నేర్పుతోఁ గాయఁ గలమె
తల్లిదండ్రులు పరుల కీఁదలఁచు కన్య
బలిమిమైఁ దెచ్చి భార్యఁగాఁ బడయఁగలమె
దుష్టులనువంక పీరులఁ దునుమఁ గలమె
యనపరాధుల దండింప నరుగఁ గలమె?"

అని యర్జునుఁడు ప్రత్యుత్తరమిచ్చెను. ఈసంభాషణముకూడ విరసముగానె యున్నది. ద్విపదకావ్యమందును వెల్లంటి సుబ్బయార్య గ్రంథమందును ధనంజయుఁడుగాక దుర్యోధనుఁడు కృష్ణు నధిక్షేపించిన ట్లున్నది. ద్విపదవాక్యము లిందుఁ బొందు పఱుచుచున్నాఁడను :—

ద్వి. "శోభింప గోపాలకుల మూఁకగాదు
చూపట్టు ప్రతిభట స్తోమంబుగాని
విన గోపికాగీత వినుతులుగావు
తనరిన హయహేషితంబులు గాని
సరినెక్కఁ గేలికాచలములు గావు
సరభస మత్తకుంజరములు గాని
మట్టఁ గాళియఫణి మేదిని గాదు
దట్టంపురథ సముత్కరములు గాని
మలయ బృందావన మార్గంబుగాదు
బలువైన సంగ్రామపద్ధతి గాని
గోపాల నీకేల ఘోరయుద్ధంబు
భూపాలుఁ డవుగావు పొ మ్మని యేసె."

ఈమాటలు దుర్యోధనునిచే ననిపించుటయే యుచితముగా నున్నది.

వాగ్వాద మైనపిమ్మటఁ గృష్ణార్జునులు ద్వంద్వయుద్ధమున కుఁ బూనిరి. తొలుత నర్జునుఁడు మూర్ఛపోయెను. మరణించె ననుకొని కృష్ణుఁడు మిక్కిలి దుఃఖించెను. అంతఁ దెలివి వచ్చి యర్జునుఁడు తిరిగి యుద్ధము నారంభించెను. కొంతసేపటికిఁ గృష్ణుఁడు మూర్ఛిల్లిన నర్జునుఁడు దుఃఖాక్రాంతుఁడై దురపిల్లెను. వీరల విలాపములు కరుణరసభరితములుగా నున్నవి. అస్త్రాంతరము లన్నియు వినియోగింపఁబడినపిమ్మటఁ గృష్ణుఁడు చక్రమును ఫల్గునుఁడు పాశుపతమును జేపట్టిరి. ఆసమయమున ఫాలాక్షుఁడు ప్రత్యక్షమై వారల సమాధానపఱిచి తప్పు లీవిధముగాఁ బంచిపెట్టెను.

చ. "ధరఁగలవారిఁ జూడక యె తానుమియుఁగ గయుతప్పు; చూడ కీ
కరణి నొసర్చువాని నటకం గమకించుట నీదితప్పు; తా
నరయక ముందుగా శరణ మాతని కిచ్చుట పార్థుతప్పు,నో
సరసిజనాభ యక్కతన సంధియొసర్చుట యొప్పునిత్తఱిన్."

ఈతప్పులపంపకము లక్ష్మీనరసింహముగారి కల్పనము. సరసముగా నున్నది. గయుఁడు నర్జునుఁడును దమతప్పులను క్షమింపుమని కృష్ణుని వేఁడఁగా నాతఁ డర్జునుతో—

మ. "కుటిలాచారులుధార్తరాష్ట్రులకుమీఁ గయ్యమాదానికై
పటుశస్త్రంబులఁ దత్తదర్థమయి సంపాదించితో లేదో యం
చెటులైనం గనఁగోరి యాహవము నే నీలీలఁ గల్పించితిఁ

ద్రుటిలోఁ గూల్చెద వీవు శాత్రవుల నోడుర్వారగర్వోన్నతా."

అని చెప్పెను. ఈయర్థము పూర్వగ్రంథములందును గలదు. కృష్ణుఁడు చెప్పిన సమాధానము, హరిశ్చంద్రు ననేకవిధములం గష్టపెట్టి యాతం డొతకును సత్యమును విడువకుండుటం గని చివరకు "నీసత్యవ్రతము లోకమునకు వెల్లడింప నే నీవన్నాగము పన్నితి" నని హరిశ్చంద్రునితో విశ్వామిత్రుఁ డన్నమాటను బోలియున్నది.

విమర్శనదృష్టితోఁ జూచినపుడు కొన్ని నెరసులు కనఁబడినను లక్ష్మీనరసింహముగారి నాటకము మొత్తముమీఁద రసనమంచితమై సామాజిక చిత్తసమాకర్షకమై యున్నది. పాకము ద్రాక్షాపాకము. శైలి సుప్రసన్నము.

ఈకథయం దర్జునుఁడే ప్రధాననాయకుఁ డని చెప్పవలసియున్నది. ఆతనియందు శౌర్యము, ధర్మనిష్ఠ, యీరెండు నొకటి కొకటి తీసిపోకుండ నిండియున్నవి.

ఈకథ కొంతవఱకు మరుత్తరాట్చరిత్రమందలి యొక కథను బోలియున్నది. ఆకథలో నాగులు కొందఱు మునులఁ జంపఁగా రాజగు మరుత్తుఁడానాగులను దండింప సన్నద్ధుఁ డయ్యెను. నాగులు మరుత్తుని తండ్రియైన అవేక్షితు శరణము వేఁడ నాతఁడు వారి కభయ మిచ్చి వారిని జంపవల దని కొడుకుతోఁ జెప్పెను. దుష్టుల దండించుట రాజధర్మముగాన నాధర్మము నే నుపేక్షింపఁజాల"నని మరుత్తుఁడుప్రత్యుత్తరమిచ్చెను. శరణాగతత్రాణముకూడ క్షత్రియునకుఁ బరమధర్మమే కావున

నాగులఁ జంపుటకుఁ దా నంగీకరింప నని యవేక్షితుఁడు పలికెను. వారిద్దఱుఁ దమతమధర్మములఁ బరిపాలించుటకై యొకరి నొకరు చంపుట కుద్యుక్తులయిరి. అంత నాగు లందఱును వచ్చి తాము ఇంక ముం దెన్నఁడును మునుల కపకారముచేయ మనియుఁ జచ్చిన మునులను బ్రదికింతు మనియుఁ జెప్పి మునులను బునర్జీవితులం జేసిరి. కరుణించి మరుత్తుఁడు నాగులం జంపుట యుడిగెను. ఈకథలో మరుత్తుఁడు నవేక్షితుఁడునుగూడ ధర్మము నాశ్రయించియే యొకరి నొకరు ప్రతిఘటించిరి. గయోపాఖ్యానములో గయుని తప్పు ప్రమాదమువలనఁ గలిగినది గాని బుద్ధిపూర్వకము గాదు. అదియైనను బెద్ద తప్పుగాదు. దానికై కృష్ణు నంతటివాఁడు గయుని జంపఁ దలంచుట యుచితముగా లేదు. ఈలోపము మూలకథయందే యున్నది. వేదము వేంకటరాయ శాస్త్రి ప్రణీత ప్రతాపరుద్రీయనాటకము కూడ జనామోదముఁ బడసినది. దీనిలో వెఱ్ఱివాని పాత్రము మిగుల రమణీయముగా నుండును.

క్రొత్త నాటకములు రచించినవారిలో పానుగంటి లక్ష్మీనరసింహారావుగా రొకరు. వీరింతవఱకు (1930) రచించిన నాటకములు 26. నర్మదాపురుకుత్సీయము మొదటి దనియు, విచిత్రవివాహము చివరది యనియుఁ దెలియవచ్చుచున్నది. వానిలో ననేకములు రామాయణాదిగ్రంథములలోని కథలను గుఱించినవి. కొన్ని కేవల కల్పితకథలు గలవి కూడఁ గలవు. వీరి శైలి సులభమై ప్రవాహరూపముగా నుండును. వీరి నాటకములు

సాధారణముగా గద్యమయములు. సీసములు సకృత్తుగాఁ గలవు. వృత్తము లుండవు. పాత్రములభాష గద్యమయముగా నుండుటయే స్వభావోచిత మని వీరి యభిప్రాయము. ఇది కొంతవఱకు సరియే కాని గంభీరభావముల వ్యక్తపఱుచుటకుఁ బద్యములవలె గద్యము లనువుపడవు. కావుననే యుత్తరరామచరితము మూఁడవయంకములోఁ జిరవియోగానంతరము రామదర్శనము లభించుటచే సీతహృదయమం దుదయించిన భావసమ్మర్దమును వర్ణింపఁదలఁచి సీత ప్రాకృతభాషలో సంభాషించుటచేత సంస్కృతపద్య మామెచేఁ జెప్పించుటకు వీలులేక కవి యొక యుపాయము పన్ని, సీత—

"భగవతి! నిష్కారణపరిత్యాగినో ప్యేతస్య దర్శనే నైవం విధేస కీదృశీ మేహృదయావస్థా-" అని తమస నడిగినట్లును, తమస

"జానామి, వత్సే, జానామి,

"తటస్థం నైరాశ్యా దపిచ కలుషం విప్రియవశా
ద్వియోగే దీర్ఘేస్మిన్ ఝటితి ఘటనాత్ స్తంభితమివ
ప్రసన్నం సౌజన్యా ద్దయిత కరుణై ర్గాఢ కరుణం
ద్రవీభూతం ప్రేమ్ణా తవ హృదయ మస్మిన్ క్షణ ఇవ."

అని సమాధానము చెప్పినట్లు కల్పించెను.

కేవల నూతనాంధ్రనాటకములలోఁ బ్రదర్శనయోగ్యము లగునవి పెక్కు గలవు గాని మంచి సాహిత్యగ్రంథము లనఁ దగినవి యంతగా లేవు.

పూర్వము తెనుఁగులో రావణదమ్మీయము (లంకావిజయము) చంద్రరేఖావిలాపము మొదలగు తిట్టుకవిత్వములు కొన్ని ప్రహసన యున్నవి గాని ప్రహసనములులేవు. సంస్కృతములు. భాషయందుఁ గలవు. ఆంగ్లవాఙ్మయములోని Farces అనువాని ననుసరించి యివి క్రొత్తగా నిర్మింపఁబడినవి. నిర్మాతలలో వీరేశలింగముగారు ప్రథములు. ఈయన పదునాలుగు పెద్దప్రహసనములును నలువదినాలుగు చిన్నప్రహసనములును మొత్తము—ఏఁబది యెనిమిది రచియించెను. పెద్దప్రహసనములలో నించుమించుగా నన్నియు దురాచారపరాయణు లగు గృహస్థుల నెవ్వరినో మనస్సునం దుంచుకొని వారి నాక్షేపించుటకై కల్పించినవి. చిన్నప్రహసనము లప్పు డప్పుడు హాస్యసంజీవని యనుపేర వివేకవర్ధనీపత్రికయందుఁ బ్రకటింపఁబడినవి. కవి సాంఘికాచార సంస్కరణాభిలాషి గావునఁ దనయుద్యమమున కనుగుణముగాఁ గొన్ని యాచారముల నీప్రహసనములలో నాక్షేపార్హములుగా వర్ణించెను. ఈప్రహసనములలోని భాష స్వభావసిద్ధముగాను బాత్రోచితముగాను నుండును. మచ్చునకై రెండుప్రహసనములనుండి కొన్నిమాటల నెత్తి వ్రాయుచున్నాఁడను.

౧. "ఆచారము"—అనుప్రహసనమునుండి—(చేదస్తపు చెలమమ్మమాట.)

"నీవు అదృష్టవంతురాలవు గనుక వోక్క-మోస్తరుగా ఆచారం జరుపుకుంటున్నావు. నాకు నీలాగు జరుగదు. అక్కడకీ

నేను రోజుకు రెండువందలస్నానాలుచేస్తాను. యీవేళమట్టుకు
యిప్పటికి పదిస్నానాలు చేసినాను. తెల్లవారి లేచి దొడ్లోకి వెళ్లి
నప్పుడు కాలికింద యేమో మెత్తగా తగిలి అది యేమిగుడ్డో
అని తలనిండా స్నానముచేసినాను. తరువాత మాకోడలు దగ్గ
రనుంచి వెళ్లినప్పుడు పైటకొంగు తగిలినట్టు అనుమానం కలిగి
మళ్లీస్నానము చేసినాను. గోదావరికి వెళ్లి స్నానముచేసి బిందె
యెత్తుకొని వస్తూ బట్టలువుతుక్కునేవాళ్ల నీళ్లుపడ్డట్టుతోఁచి మళ్లీ
వెళ్లి మునిగినాను. తీరా వడ్డుకు వచ్చేటప్పుడు నీళ్లలో కాలి
కేదో ఆకు తగిలి అంట తప్పేలాలు తోమేవాళ్లు వేసిన అంటా
కని నీళ్లు పారపోసి వెళ్లి మళ్లీ స్నానం చేసినాను. తరువాత బిం
దెత్తుకుని సఘం దూరం వచ్చేటప్పటికి యిరవై గజాలదూరములో
మాలవాఁడు కనఁబడి నీళ్లు నడివీథిలో పారపోసి వాణ్ని నాలుగు
తిట్టి వాడి జీవానికి వుసూరుమంటూ మళ్లీ వెనుకకు గోదావరికి
వెళ్లి స్నానముచేసి నీళ్లు తెచ్చుకున్నాను. యింటికి వచ్చినతరు
వాత పొయ్యిమీఁద యెసరుపెట్టి దాసీది తోమి తెచ్చిన గరిటె
తొలుచుకోబోయి దానిని మసి వదలనందున నూతిదగ్గర మళ్లీ
స్నానం చేసినాను. ఆ అంట్లతప్పేలాలలో వకటి తీసుకొని వెళ్లి
మాకోడలులోపల పెట్టినందున యింట్లోవస్తువు లన్నీ తడుపుకొ
నేటప్పటికి జామయినది. తీరా వంట చేసుకుంటూవుండగా బల్లి
మీఁదపడి వకమాటున్ను శూద్రవాళ్లమాట వినబడి వకమా
టున్ను రెండుస్నానాలు చేసినాను. యీలోగా అన్నం చిమిడి
పోయింది. వేగిరం మునిగివచ్చి అన్నం తప్పేలా దింపి ఆపొయి

మీాద కూరవేసి గంజివార్చుకున్నాను. ప్రొద్దుటనుంచీ మడికట్టు
కొని కూర్చున్నందున కడుపుబ్బి అవతలకు పోవలసి వచ్చి ఆఖ
రుస్నానము చేసినాను. ఎన్నిస్నానాలయినవో లెక్కపెట్టినావా?''

౨. హిందుమహాజనులమతసభ—నుండి.

రామచంద్రరావుపంతులుగారు—

మనమతం మనకుర్రవాళ్లకు బాగా తెలియకపోవుటచేత వాళ్లు అన్యమతంలో ప్రవేశించడం తటస్థ మవుతూవున్నది. మనం దేవాలయంలోనో మఱి యేబహిరంగస్థలములోనో వారానికి రెండుసార్లు పిల్లలందరూ పోగయేట్లుచేసి కొంతమంది పండితులచేత వాళ్లకు మనమతం బోధ చేయిస్తూవుండవలెను. నేను చెప్పినది బాగావున్నదా!

మహాజనులు:—

బహుబాగా వున్నది. తప్పకుండా రేపటినుంచీ ఆలాగు చేయవలసినదే. అయితే యీామతబోధ యేదేవాలయంలో చేస్తే బాగావుంటుంది? పండితుణ్ని యెవరిని పెడుదాము?

వ్యాసరాయాచార్యులు:—

ఈవేదశాస్త్రపాఠశాల ఆంజనేయస్వామికోవెలలో పెట్టి ముఖ్యప్రాణాచార్యులుగారిని పండితుల్నిగా యేర్పరిస్తే బాగా వుంటుంది.

రామానుజాచార్యులు:—

కాదుకాదు. శ్రీకేశవస్వామివారి ఆలయంలో తిరుమంట

పంమీాద పాఠశాల పెట్టించి శ్రీవేదాంతదేశికాచార్యులవారిని పండితులనుగా నియమిస్తే బహు దివ్యంగా వుంటుంది.

బసవయ్య అయ్యావార్లు:—

శ్రీబసవేశ్వరస్వామివారి గుళ్లో పాఠశాలవుంచి వీరభద్రయ్యవార్లంగారిని పండితులనుగా పెడితే మరీబాగావుంటుంది.

రామానుజాచార్యులు:—

ఆగుళ్లో పెడితే మాపిల్లలను మేము పంపము.

బసవయ్య అయ్యావార్లు:—

మీాగుళ్లో పెడితే మాపిల్లలను మే మంతకుమునుపే పంపము.

పరబ్రహ్మసోమయాజులు:—

మాకు శివకేశవులు యిద్దరూ సమానమే. పాఠశాల వకరోజు శివాలయంలోను వకరోజు విష్ణాలయంలోనూ వుంచి హరిశాస్త్రులువారిని పండితులనుగా పెట్టండి. యెవరికి యిబ్బంది లేకుండా వుంటుంది.

రామానుజాచార్యులు:—

స్మార్త పండితుణ్ని వేస్తే మాకు పనికిరాదు.

వ్యాసరాయాచార్యులు:—

మాకంతకు మునుపే పనికిరాదు.

బసవయ్య అయ్యావార్లు:—

మాకు బొత్తిగానే పనికిరాదు.

రామానుజాచార్యులు:—

మాకు వైష్ణవపండితుడే వుండాలి.

వ్యాసరాయాచార్యులు:—

మాకు మాధ్వపండితుడే వుండాలి.

బసవయ్య అయ్యవార్లు:—

మాకు శైవపండితుడే వుండవలెను.”

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు రచించిన ప్రహసనము లెనుబదిమూఁడు ప్రకటింపఁబడినవి. ఇవి చిన్నచిన్నవి. వీరేశలింగముగారి ప్రహసనములంత పెద్దవి కావు. ఇందు కథాసన్నివేశముకంటె మాటల చమత్కారమే యెక్కువయినది. లక్ష్మీనరసింహముగారు చమత్కారముగా మాటలాడుస్వభావము గలవారు. ఈవిషయములో వీరికి మేనమామ యగు పురాణపండ మల్లయ్యశాస్త్రులుగారి పోలిక కొంత కలిగినది. అధికప్రయత్నము లేకయే ప్రహసనరచన మీయాన కలవడినదని చెప్పవచ్చును. లక్ష్మీనరసింహముగారి హాస్యమునకును వీరేశలింగముగారి హాస్యమునకును భేదమున్నది. వీరేశలింగముగారి హాస్యము చిక్కనిది. లక్ష్మీనరసింహముగారి హాస్యము పలుచనిది. లక్ష్మీనరసింహముగారి హాస్యము గిలిగింతలుపెట్టి నవ్వించును. వీరేశలింగముగారిహాస్యము గిల్లి బాధించును. అది యపహాసాత్మకము. పరదోషోద్ఘాటనము ప్రయోజనముగా గలది. లక్ష్మీనరసింహముగారిహాస్యస్వరూపమును సూచించుటకై “గ్రంథప్రకటనము” అను ప్రహసనమునుండి కొన్నిమాటలెత్తి వ్రాసెదను.

(1) "వెక్కిరింతల వెంగళప్ప తాను రచించిన "వెఱ్ఱి పప్పీయ" మనుగ్రంథముయొక్క ఔత్కృష్ట్యము ప్రకటించుచు నాగ్రంథమును గూర్చి యుద్దణ్డపండితు లిచ్చిన యభిప్రాయము లంగూడఁ బ్రకటించినారు. వారిలో "మహామహోపాధ్యాయ కొంకనక్క గురులింగశాస్త్రిగా" రిట్లు వ్రాసినారు.

"మీా వెఱ్ఱిపప్పీయమును నేను సమగ్రముగాఁ జూచితిని. కాళిదాస, భవభూతి, మాఘ, మయూర, వ్యాసవాల్మీకుల కవిత్వములకంటె యిందలి కవిత్వము వేయిరెట్లధికముగ బాగున్నది. ఇందలిపద్యములు గారి ముక్కలవలె యెంతో రుచిగానున్నవి. దీనికి అల్లపుపచ్చడివలె చిన్నవ్యాఖ్యానము కూడ గ్రంథకర్తగారే రచియించినందున సర్వజనగ్రాహ్యమై యున్నది. ఇట్టి గ్రంథము జన్మమెత్తి చూచి యెరుగను. ఇకముందు చూడఁబోను. ఇంకొకజన్మమున కూడ చూడగలనని నమ్మకములేదు. ఇందలి వీరరసపద్యములు రెండు చదువగానే నా కావేళ మత్తి గొడుగుకామతో నాభార్యను మెత్తగా మర్దించితిని. మీాగ్రంథమందలి పైరెండుపద్యములను నేను చదువుచుండఁగా దగ్గర నుండి విన్న మాసీళ్లబ్రాహ్మణుఁడుకూడ ఆరనము గ్రహించి కావడిబద్ద తిరగవేసి నన్ను వెన్నుపూస విరుగునట్లు కొట్టెను. కాఁబట్టి ఈగ్రంథ మందరు కొనఁదగినది."

(2) యమ్. ఏ. డి.; బి. యే. డి; యస్. ఏ. డి.; పి. ఏ. డి.; మొదలగు గొప్పపరీక్షల నిచ్చి యుద్యోగముచేయుచున్న నీరసాల నీలాచలంగారి యభిప్రాయము.

"వెంగళప్పగారు దయతో పంపిన వెఱ్ఱి ఐప్పీయమును వందనపూర్వకముగ నందుకొంటిని. ఈ గ్రంథకర్తగారు మనపూర్వులవలె అనకతనక ప్రబంధములు, పుక్కిటిపురాణములు వ్రాయక, దేశచరిత్రగ్రంథములు వ్రాయునభిలాషతో వెఱ్ఱిపప్పగారి చరిత్రమును రసవంతముగా వ్రాసి యీ దేశమునకుఁ గూడ మహోపకారము చేసినారు కనుక, ఈ దేశస్థులు, పరదేశస్థులు, ఈ లోకమువారు, పరలోకమువారు కూడ వారియెడల కృతజ్ఞులై యుండవలెను. ఇందలి జాలిరసపుపద్యములు చదివి నేను యింటఁబడి యేడ్చుచుండఁగా పొరుగువారందరు నా కేదో యాపద వచ్చిన దని పరుగెత్తుకొని వచ్చిరి. ఇందలి హాస్యరసమున్న కథ పట్టు నేను చదివినప్పుడు నాకు డొక్కలోనొప్పి గుండెలోపోటు బయలుదేరి క్రిందఁబడి పొరలుచుండఁగా మహారోగము వచ్చిన దని మావారందరు వైద్యుని తీసికొనివచ్చిరి. కాఁబట్టి యీ గ్రంథ మందరు కొనవలెను."

పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు హాస్యరసప్రియులే. వారి నాటకములలోఁ దఱచుగ హాస్యరసము స్ఫురించుచుండును; గాని, "సాక్షి" యనుగ్రంథము కేవల హాస్యరసమయము. తొలుత వార్తాపత్రికలలో నప్పుడప్పుడు ప్రకటింపఁబడిన వ్యాసముల సముచ్చయమే యీగ్రంథము. ఈవ్యాసము లాంగ్లేయ భాషలో Spectator అనుగ్రంథములోని వ్యాసములఛాయను రచియింపఁబడినవి.

సాక్షిసంఘ మని యొకటి యున్నట్లును దాని నిర్వాహకు

నకుం గారణ మీరాక్రిందిది యెనట్లును దత్సంఘములో ముఖ్యులగు సాక్షిగారి మాటలవలనఁ దెలియవచ్చుచున్నది.

"ప్రాపంచికచర్యలు చిత్రవిచిత్రమహావిచిత్రములై యున్నవి. ప్రపంచ మంతయు మాయామయ మైనది. పత్రికలలో మాయ, బ్రాతలపాలిలో మాయ, న్యాయాధికారి కలములో మాయ, న్యాయవాది నాలుకకొనను మాయ, వర్తకుని త్రాసులో మాయ, వసుధాకర్షకుని నాఁగేటిలో మాయ, ఎక్కడఁ జూచినను మాయగా నున్నది. మనుష్యులొనర్చు తప్పులు వారికొఱకేర్పడిన శిక్షలు నమితములు. తప్పు చేసినవానికి రాజకీయశిక్ష యొక్కటియే చాలదు. సంఘశిక్షకూడ నుండవలెను. పదిసంవత్సరములు కఠినశిక్షకంటెఁ బదిసంఘములవలన నేరగాని గూర్చి చేయఁబడిన యనాదరణము నేరము నాఁపుటలో బలవత్తర మైనది. రాజకీయదండనము గల యీనేరములకే సంఘదూషణము నేరము నడఁగించుటకుఁ గావలసినప్పుడు రాజకీయదండనము లేని మొదటఁ జెప్పిన నేరములకు—మనుజులమాయాప్రచారములకు—సంఘదూషణ (Social odium) మావశ్యకమై యుండదా? ముఖ్యముగా నుండును. ఉండక తప్పదు. ఇట్టి నేరములను గూర్చియే మేము వ్రాయుచుందుము. నేరములు వెల్లడింతుము. వానిస్వభావముల విశదపఱుతుము. వానివలన సంఘమునకుఁ గల్గుహానిని స్పష్టపఱుతుము. వానియందు జనుల కసహ్యము గల్గునట్లు చేయుటకై ప్రయత్నింతుము. నేరములనే నిందింతుము కాని యట్టినేరములకు లోనయిన వారిని నిందింప

ము. వారిని దలపెట్టనేనఁ దలపెట్టము. మాకు వారితోఁ లేశ
మును బనిలేదు. ఇంతియేకాక మతవిషయములను గూర్చియు,
నారోగ్యవిషయములను గూర్చియుఁ, గవితాద్యభిరుచిప్రధాన
శాస్త్రములఁ గూర్చియు, సంఘదురాచారములఁ గూర్చియు,
విద్యాభివృద్ధిసాధనములఁ గూర్చియుఁ జరిత్రాద్యంశములఁ గూ
ర్చియు నావశ్యకము లని మాకుఁ దోఁచిన యింకఁ గొన్నియిత
రాంశములను గూర్చియు వ్రాయుచుందుము." అనియు, నీసం
ఘములోఁ గాలాచార్యుఁడను శ్రీవైష్ణవుఁడును, జంఘాలశా
స్త్రి యను జైనుఁడును, వాణీదాసుఁ డను శూద్రుఁడును, బొ
జ్జయ్య యను కోమటియు, సాక్షి యను నారామద్రావిడియును
సభ్యులనియు నా గ్రంథమునందలి సాక్షిసంఘనిర్మాణ మను మొద
టి భాగములోఁ జూడవచ్చును.

వీరి వచనరచన నిరాఘాటధారాప్రవాహమువలె నుండు
ను. నొక్కి చెప్పవలసిన విషయము వచ్చినపుడు మాటలు
మార్చి మార్చి చెప్పినదే పలుమాఱులు చెప్పుట యీయన
కిష్టము. ఈయన శైలి తెలియుటకై సాక్షినుండి కొన్ని పంక్తు
లుదాహరించెదను.

౧. "విమర్శకస్వభావము" అను వ్యాసమునుండి.

"నే నీరాత్రి మా సభాకుటీరమునకుఁ బోవునరికి మాకవి
యగు వాణీదాసుఁడును జంఘాలశాస్త్రియుఁ గోడిపుంజులవలెఁ
గాళ్లు దువ్వుచు గొఱ్ఱెపొట్టేళ్లవలెఁ దలలువంచి బుసకొట్టుచు
నాఁబోతులవలె ఱంకెలు వేయుచు మల్లులవలెఁ దొడలు దండ

లుఁ జఱచుచుఁ బంజాబీమైసూరుపద్ధతుల పదవిన్యాసపు గమని కలలోఁ జేయిచేయి గలుపుకొనుటకు సిద్ధమై యుండిరి. కలహ కారణము గోచరింపలేదు. కాని వారిని శాంతిపఱచుటకుఁ బ్రయత్నించితిని. ఎందులకో కచాకచికదనోత్కంఠత యని యడుగ వా రెవ్వరును నామాట వినిపించుకొనలేదు. కాని కవి నిష్కారణకఠినముష్టిప్రహారము నోరులేని నడుమ నున్న బల్ల కొక్కటి ప్రసాదించి యిట్లు గద్దఱించెను.

వాణీ—ఏమంటివి ? నాకుఁ గవిత్వమే తెలియదా? అది లోకజ్ఞానమునఁగాని రాదా ? దానికి దేశాటన మావశ్యకమా? ఆ ! ఆసేతుహిమాచలపర్యంతము నీ వల్లలాడని స్థలమున్నదా? కాలిదురదయే తీరినదిగాని కవితాలేశమైన నంటినదా ! కాఱులఱచుట కవిత్వ మనుకొంటివా ? తిట్టినతిట్టు తిట్టకుండఁ దెంపులేక తిట్టు దిట్టరితనము నిరవశేషశబ్దజాల నిరాఘాటప్రయోగ నిపుణత యనుకొంటివా ? ఇదిగో ! నీకబ్బినవి గండ్రతనము, పెంకితనము, తెగనీలుగుఁదనము, నుడుకుఁబోతుతనము, వెక్కిరింపుఁదనము, గయావలీతనము. గలలగభేద మెఱిఁగి నీవు కవిత్వము చెప్పఁగలిగినపుడు నన్నధిక్షేపింపుము. అది నీకుఁ బదునాల్గు భువనములు దిరిగినను రాదు.

జంఘా—(వికటముగ నవ్వి) నీవేమ్చుచున్న తెలివితక్కువ నిర్భాగ్యపు టల్లరి చిల్లరి యవకతవక యాసమ్మయోసమ్మ యారిగ చొప్ప యలుకుగుడ్డ కవిత్వము నేఁ జెప్పలేక మానివేయలేదు. గడియసేపు ఛందోగ్రంథ మైనఁ జూచితినేని నిపేలపిండి వట్టి

గడ్డి కల్లబొల్లి కాకికూఁత కవిత్వము నాకవిత్వముచుట్టు ముమ్మాఱు త్రిప్పిత్రిప్పి దిగఁదుడుచుటకైనను జనికిరాకుండఁ జేయఁగలను. ఆఁ! ఆసమర్థత లేక యూరకుండలేదు. గడియకుఁ గావడిగ్రంథములు చెప్పఁగలను. నాకవితాధారముంను గంగాధారను బిల్లకాల్వక్రిందఁ జేయఁగలను. ఆకాశము తూటుపడినట్లు—

వాణీ—ఏదీ మగవాఁడ వైనయెడల నాకొక్కమత్తేభము జెప్పుము. అంతవఱకెందులకు? మూఁడుముక్కలు గద్యము చెప్పుము. ముచ్చెమటలుపట్టి చావునకు సిద్ధమయ్యెదవో లేదో! ఆ! కుక్కకూఁత నక్కకూఁత యనుకొంటివేమి?"

౨. సకలాంధ్రదేశమశకమత్కుణమూషిక మహాసభ—యను వ్యాసమునుండి

"నరజాతి యంతటి తుచ్ఛజాతి ప్రపంచమున మఱియొకటి లేదు. నరుఁడు మనశత్రుఁడు—ప్రబలశత్రుఁడు—తానే మహా వీరుఁడట! వీరాధివీరుఁడట!—అతిధీరుఁడట—మహారథుఁడట. వీనిగర్వము కాలిపోను! పిఱికి పెద్దమ్మలలో నగ్రగణ్యుఁ డెవఁడు? నరుఁడు—తెలిసినదా? (వినుఁడు—వినుఁడు) శత్రుదర్శనముననే తోఁక ముడుచుకొని పరుగెత్తువాఁ డెవఁడు? నరుఁడు. ఎంతసేపును బ్రాణ మఱచేతిలో నుంచుకొని మూలమూలల దాఁగెడు వాఁ డెవఁడు? నరుఁడు. (సెబాస్ సెబాస్ అను కేకలు) చేత వాతఁగాని చచ్చుపెద్దమ్మలతో నగ్రతాంబూలమునకు సిద్ధపడు వాఁ డెవ్వఁడు? నరుఁడు. తేలును జూచి భయమా? జెఱ్ఱిని గాంచి యేడుపా? పామును జూచి పరుగా? దోమ కఱచిపోవు

నేమో యని సాయంకాల మగుసరికే సన్ననిగుడారములలో దూఱినవాఁడు వీరుఁడా ? మన నల్లిపోతులలో నొక్కటి ప్రక్కఁ జేరి కటుక్కున నంటఁ బొడిచినయెడలఁ గల్లు ద్రావినవానివలెఁ దెయితక్కలాడువాఁడు వీరుఁడా ? అంతవఱకుఁగూడ నెందు లకు ? ముల్లు కాలికి గ్రుచ్చుకొనునేమో యని ముచ్చెలు తొ డుగుకొని కాని వెలుపలకు రాఁడే! వీని భయము బ్రద్దలైపోను! పల్లేరుగాయ యనఁగ గడగడ లాడిపోవునే !—బట్టలలోఁ జీపు రుము ల్లున్నయెడల నూడఁదీసికొనిన దాఁక నేడ్చుచునే యుం డునే—"

---

# ఆధునికాంధ్రవాఙ్మయవికాసవైఖరి.

———:(o):———

## 3 వ అ ధ్యా య ము.

———:o:———

### —♦ వివిధగ్రంథములు. ♦—

స్త్రీల కుపయోగించుకథ లను పేరుపెట్టి వీరేశలింగము గారు పెక్కుకథల నల్లినారు. వానిలో మొదటిది విక్టోరియామహారాజ్ఞిగారి చరిత్రము. అది యొక యింగ్లీషుగ్రంథమున కనువాదము. మూలగ్రంథము పేరుమాత్ర మెక్కడను గనఁబడదు. మఱికొన్నికథలు షేక్సుపియరునాటకములను బట్టి Lamb అను నాంగ్లేయవిద్వాంసుఁడు రచించిన కథల కనువాదములు. ఇచ్చటను మూలగ్రంథముల మాట యెత్తలేదు. కథలు మూలానుసారముగానే యున్నవి. పాత్రముల పేళ్లును ప్రదేశముల పేళ్లును మాఱినవి. మూలగ్రంథములఁ జదువనివారికీ గ్రంథము లన్యభాషాగ్రంథానువాదము లనుకొనుట కవకాశ ముండదు. మూలగ్రంథములఁ గప్పిపుచ్చి వానిలోనివిషయము స్వకపోలకల్పితముగాఁ గనఁబడున ట్లనువదించు నేర్పు వీరేశలింగముగారి కధికముగా నున్నది. ఇదియు నొక కళాకౌశలవిశేష మనియే చెప్పవచ్చును. ఈకథానముచ్చయములో నీతికథామంజరి యను పేరితో Aesope's Fables అను గ్రంథములోని కథల కనువాదము లనేకములు గలవు.

(margin: కథలు.)

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు కూడ రెండుసంపుటములకు సరిపడిన కథలు రచించినారు. వీరికథలలో భారత భాగవతగ్రంథములలోని విషయములను గ్రహించిన కథ లనేకము లున్నవి. వానితరువాత రాజస్థాన కథావళి ముఖ్యము. ఇందలి కథలు "Tods' Annals of Rajasthan" అను గ్రంథము నుండి గ్రహింపఁబడినవి. "రఘుకులచరిత్ర" మనుపేరితో కాళిదాసకృత రఘువంశము నీయన తెనిఁగించెను.

తెనుఁగులో శాస్త్రగ్రంథము లంతగా లేవు. ఉన్నమట్టుకు సంస్కృత గ్రంథానువాదములే. పావులూరి మల్లన్న రచిం
శాస్త్రగ్రంథ న గణిత మొకటి యున్నది. శరభరాజీయము మొ
ములు. దలగు కొన్ని వైద్యగ్రంథము లున్నవి. ఆంధ్రవాసిష్ఠరామాయణము, సీతారామాంజనేయము, ఇత్యాది కొన్ని గ్రంథములలో వేదాంతశాస్త్రము కొద్దిగాఁ బ్రతిపాదింపఁబడినది. తంజావూరు పుస్తకభాండాగారమునందు జక్కరాజు వేంకటకవి ప్రణీతమగు కామందక నీతిశాస్త్రము గలదు. ఇది సంస్కృతమునకుఁ దెనుఁగు.

ఇటీవల వీరేశలింగముగారు తర్కసంగ్రహమును దెనిఁగించినారు. పురాణపండ మల్లయ్యశాస్త్రులుగారు శుక్రనీతిసారమును, శ్రీశంకరాచార్యకృత సూత్రభాష్యమును దెనిఁగించినారు. మామిడిపూఁడి వెంకటరంగయ్యగారు, అకుండి వేంకటశాస్త్రిగారును గలసి కౌటిలీయార్థశాస్త్రమును దెనిఁగించినారు. కట్టమంచి రామలింగారెడ్డిగా రాంగ్లేయసంప్రదాయానుసారముగా

నర్థశాస్త్రమను నొక చిన్నగ్రంథము రచించినారు. కూచిమంచి గోపాలకృష్ణమ్మగారు పూర్వమీమాంసాగ్రంథ మొకటి "ఆంధ్ర మీమాంసాన్యాయముక్తావళి" యనుపేర రచించినారు- ఇది సంస్కృతమునకు సరియైన తెనుఁగు. ఈగ్రంథము నాంధ్ర విశ్వ కళాపరిషత్తువారు ప్రకటించిరి.

వీరేశలింగముగారు Physiology అను శరీరశాస్త్రము ను Astronomy అను జ్యోతిశ్శాస్త్రమును నాంధ్రీకరించినారు. ఆంగ్లేయభాషలో నుండు భౌతికశాస్త్రములఁ దెలిఁగించుట కిది యె మొదలు. ఇఁక ముందీశాస్త్రము లన్నియుఁ గళాశాలల లో దేశభాషయందే విద్యార్థులకు బోధింపవలయు నను సంకల్ప ము పుట్టినది. ఈసంకల్పము నాచరణములోఁ బెట్టవలయునన్న నాంగ్లేయగ్రంథముల దేశభాషలోనికి మార్పవలయును. అట్లొన రించుటకు ముందుగాఁ బరిభాషాపదములు (Technical Terminolgy) గుదురవలయును. పాశ్చాత్యభాష లన్నిటియం దు శాస్త్రపరిభాష, గ్రీకు, ల్యాటిను (Greek and Latin) భాషలయం దుండును. అట్లుండుటచేత నొక్కశబ్దమే యన్ని భాషలయందు వినియోగపడుచున్నది. ఆప్రకారమే యీభరత ఖండమునం దన్ని దేశభాషలకును సమానముగు శాస్త్రపరిభాషా పదములను సంస్కృతభాషలో రచింపవలసి యున్నది. మంచి సంస్కృతాంగ్లసాహిత్యములు గలపండితులు పరిశోధించినచోఁ బెక్కుపదములు సంస్కృతవాఙ్మయమునందు సిద్ధమైనవే దొరకు నని నానమ్మకము. కేవల భౌతికశాస్త్రపదములు కొన్ని దొరకక

పోవచ్చును. అట్టిశబ్దములఁ గ్రొత్తగా రచింపవలయును. సంస్కృతభాషయందు రచించినచో దేశభాష లన్నింటికిఁ బనికివచ్చును గాన నాభాషయందే రచింపవలయును. ఇదివఱకో నాగరప్రచారిణీసభవారీపని కొంత కావించినారు. శేషించిన పని పూర్తి చేయుటకు విశ్వకళాపరిషత్తులు (Universities) కొన్ని కూడి తగిన పండితసంఘము నేర్పఱిచి యీపని చేయించుట యావశ్యకము. ఈ పరిభాషానిర్మాణము ముందు జరిగినఁ గాని భౌతికశాస్త్రగ్రంథములు దేశభాషలోనికిఁ దెచ్చుటకువీలుండదు.

నిఘంటువులు.

సంస్కృతమునందువలెనే తెలుఁగునందును బూర్వము పద్యమయములగు కొన్ని నిఘంటువు లుండెను. ఈనిఘంటువు లన్నియుఁ బర్యాయపద మాలికలు. వీని యన్నింటిలో "ఆంధ్రభాషార్ణము"త్తమము. ఇది యమరముఫక్కి ననుసరించి సమకూర్పఁబడినది. ఈనిఘంటువు లన్నియు గట్టిగ వల్లె వేసినవారికే యుపయోగించును. వల్లింపకయే సందేహము కలిగినప్పుడు చూచుకొందు మనువారి కవి యుపకరింపవు. సంస్కృతమందును దేశభాషలన్నిటియందును బూర్వ మిదియే యాచారము. ఇపుడు మనకున్న నూతనరీతి నిఘంటువు లాంగ్లేయనిఘంటుపద్ధతి ననుసరించి సమకూర్పఁబడినవి. ఇంచుమించుగా నన్నిభాషలయందు నీనూతనగ్రంథనిర్మాణము తొలుత నాంగ్లేయ విద్వాంసులచేతనే యైనది. దేశభాష లభ్యసించు నాంగ్లేయుల యుపయోగార్థము దేశభాషాపదముల కాంగ్లభాషార్థకును, ఆంగ్లపదములకు సరియయిన దేశ్యశబ్దములును గల

నిఘంటువులే తొలుతఁ బుట్టినవి. తెలుఁగులో నిట్టి నిఘంటువును మొదట సమకూర్చినవాఁడు "క్యాంబెల్" (Campbell) మహాశయుఁడు. పిదప బ్రౌణ్యనిఘంటువు పుట్టినది. ఇది చార్లెస్‌ఫిలిప్సు బ్రౌను (Charles Phillips Brown) అను నాంధ్రభాషాభిమానిచేఁ బండిత సాహాయ్యంబున సమకూర్పఁబడినది. ఈయన మండల న్యాయాధికారి (District Judge) యుద్యోగము చేయుచు నాంధ్రభాషయందుఁ దనకుఁ గలయభిరుచిచేఁ బలువురు పండితులఁ జేర్చి వారి సాహాయ్యంబున నీ నిఘంటువును ఘటియించెను. ఇం దాంధ్రశబ్దముల కాంగ్లార్థములు వివరింపఁబడినవి. విడిశబ్దములేగాక అచ్చటచ్చటఁ జిన్నసమాసములును వాక్యములును నీయఁబడినవి. అర్థస్ఫూర్తికై పూర్వకవి ప్రయోగములును లోకవ్యవహారములోని వాక్యములు నచ్చటచ్చట నుదాహరింపఁబడినవి. మొత్తముమీఁద నీగ్రంథ మాకాలమందు మిక్కిలి ప్రశస్యముగా నుండెను. కాని యది యాంగ్లభాష తెలిసినవారికే యుపయోగించును గాని కేవల మాంధ్రుల కుపయోగింపదు. అసాధుశబ్దములుగూడఁ గొన్ని యం దగపడుచున్నవి. కావునఁ బండితులు దీనిం బరమప్రమాణముగా గ్రహింపకుండిరి.

పండితాదరపాత్రమును సకలాంధ్రజనోపయోగకరము నగు నిఘంటువును గూర్చుటకు పరవస్తు చిన్నయ్యసూరిగారును బహుజనపల్లి సీతారామాచార్యులుగారును యత్నించిరి. సూరిగారిగ్రంథము సమాప్తము కాలేదు. సీతారామాచార్యులుగారి

గ్రంథము "శబ్దరత్నాకరము" అనుపేరఁ జిరకాలమునుండి యుపయోగములో నున్నది. అనేకవిషయములలో నీ నిఘంటువు ప్రశస్తమైన దనుట నిర్వివాదము. ఒక్క చేతిమీఁద నింత కార్యము నెఱవేర్చుట సుకరము కాదు. అయినను గొన్నివిషయములలో నిది సమగ్రము కాదని యెంచి శ్రీపీఠికాపురాధీశ్వరుల ప్రోత్సాహమునను వారి యౌదార్యపూర్వకధనసాహాయ్యమునను, ఆంధ్రసాహిత్యపరిషత్తువారు, "శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటువు" అను పేర నొక్క పెద్దనిఘంటువు రచింపించుచున్నారు. ఈనిఘంటువునందు శబ్దరత్నాకరమునందుఁ గలవానికంటె సంస్కృతశబ్దములు చాల నధికముగా నుండును. దేశ్యశబ్దములుకూడ నెక్కువగా నే యుండును. దేశ్యశబ్దములకును తత్సమక్రియాపదములకును బూర్వకవి ప్రయోగములు విపులముగా నుండును. తత్సమేతరశబ్దముల కితరభాషలలో నున్న సజాతీయపదములు చూపఁబడును. తెనుఁగుచదువుకొనువారికే కాక సంస్కృత విద్యార్థులకుఁగూడ నీనిఘంటు వుపకరించును. మొత్తముమీఁద నీనిఘంటువులకన్న మిన్న యనిపించుకొను ననుటకు సందేహము లేదు.

యశఃకాయు లగు కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావుగారు విజ్ఞానసర్వస్వమును నొక యుద్గ్రంథమును సమకూర్పఁ దలపెట్టి కొంతవఱకుఁ బనిచేసినారు. ఈగ్రంథము కొంతవఱకు నిఘంటువును బోలియుండును గాని ముఖ్యవిషయములలో దానికంటె విలక్షణమైనది. నిఘంటువు శబ్దార్థములను మాత్రమే తెల్పును.

విజ్ఞానసర్వస్వము (Encyclopeodia) శబ్దములచే సూచింపఁబడు వస్తువుల స్వరూపస్వభావములను వివరించును. ఇట్టిగ్రంథములు పూర్వము సంస్కృతములోఁ గాని తెనుఁగులోఁ గాని లేవు. ఆంగ్లభాషయం దున్నగ్రంథములరీతి ననుసరించి సంస్కృతములోఁ దొలుదొల్త రాజా రాధాకాంతదేవమహాశయుఁడు శబ్దకల్పద్రుమమను పేర నొక గ్రంథమును రచించెను. పిదప తారానాథతర్కవాచస్పతి యను పండితుఁడు వాచస్పత్యమను నింకొకగ్రంథమును రచించెను. మహామహోపాధ్యాయులు పరవస్తు రంగాచార్యులుగారు "లఘుశబ్దార్థ సర్వస్వము" అనుపేర వేఱొక గ్రంథమును రచించిరి. ఆగ్రంథములో—అకార ఆకారాదిపదములు మాత్రమే యింతవఱకుఁ బ్రకటింపఁబడినవి. ఈ మూఁడుగ్రంథములును బృహన్నిఘంటువు లనఁ జెల్లును; గాని యాంగ్లేయవాఙ్మయమునందలి Encyclopeodia వంటివి కావు. వీనియందు శబ్దవిమర్శనమే యెక్కువగాఁ గనఁబడును గాని వస్తువిమర్శన మంతగా లేదు.

లక్ష్మణరావుగారిగ్రంథ మాంగ్లగ్రంథములఁ బోలినది. అన్యగ్రంథసాహాయ్యము లేక యిట్టిగ్రంథ మొక్కపురుషుఁడు రచించుట దుస్సాధము. లక్ష్మణరావుగా రాంగ్లేయగ్రంథములఁ జూచి యుందు రనుటకు సందేహ ముండఁగూడదు. మహారాష్ట్రభాషయం దిట్టి నిఘంటు వొక్కటి కల దనియు నది లక్ష్మణరావుగారికిఁ జాల నుపకరించిన దనియు విన్నాఁడను. అకారాది శబ్దము లన్నియు మూఁడు సంపుటములుగఁ బ్రకటించిరి. ఆకా

రమునొద్దకు వచ్చిరి. ఆంధ్రశబ్దముక్రింద నాంధ్రదేశచరిత్రము విపులముగాఁ గూర్పఁదలఁచి లక్ష్మణరావుగారు చారిత్రికగ్రంథములేగాక తామ్రశిలాశాసనములఁ గూడఁ బరిశోధింపసాగిరి. ఈ విషయములో నీయనచేసిన పరిశ్రమము శ్లాఘ్యము. ఆపని కొనసాఁగకపూర్వమే యాయన మృతినొందిరి.

దేశచరిత్రమును దెలుపుగ్రంథములు సంస్కృతములో విరళముగా నున్నవి. వానిలో నెల్ల రాజతరంగిణి యను కాశ్మీరదేశచ ఇతిహా రిత్రము ముఖ్యమైనది. దీనిలో నెనిమిది తరంగములు సములు. గలవు. దానిని పోలవరము జమీందారు కొచ్చెర్లకోట రామచంద్ర వేంకట కృష్ణారావుగా రాంధ్రీకరించిరి. తెనుఁగులో నట్టిసమగ్రగ్రంథములు లేవుగాని వెలుగోటివారి వంశావళి యని యొకటియు, తొండమాన్ వంశావళి యని యొకటియుఁ బూర్వగ్రంథములు కనఁబడుచున్నవి. ఇవి రెండును బద్యరూపముగా నున్నవి. వెలుగోటివారివంశావళి సమగ్రముగాఁ బ్రకటింపఁబడలేదు. తొండమాన్ వంశావళి, ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలోఁ బ్రకటింపఁబడినది. ఇది పుదుకోట రాజవంశములోఁ గొన్నితరముల రాజులచరిత్ర తెలుపును. ఆంధ్రభాషార్ణవగ్రంథకర్త యగు నుదురుపాటి వెంకన్నకవియు నాతనిపుత్రుఁడు సాంబశివకవియు రచించినది. కృష్ణరాయల రాజ్యపద్ధతిని వర్ణించు రాయవాచకమనుగ్రంథ మొకటి దక్షిణదేశమున దొరకినది. దీని నాంధ్రసాహిత్యపరిషత్తువారు విపుల మైనపీఠికతోఁ బ్రకటించియున్నారు. ఇదిగాక ప్రతాపచరిత్రమును, కొండవీటి దండకవిలె మొదలగు

వచనగ్రంథములు కొన్ని గలవు. రాయవాచకములో జాలవఱకు సత్య మున్నది గాని తక్కిన గద్యగ్రంథములు చాలవఱకుఁ బుక్కిటిపురాణములు. పూర్వోదాహృతము లైన పద్యగ్రంథములలో నతిశయోక్తి యుండును. ఇంతియకాక తెలుఁగుగ్రంథములు పెక్కింటిలో, కృత్యాదిని జారిత్రికవిషయములు బహుళముగా నున్నవి. వీనియన్నింటికంటెఁ దామ్రశాసనములందును శిలాశాసనములందును దేశచరిత్రమును దెలుపువిషయము లనేకము లున్నవి. శాసనములనఁగా దేవాలయములకును బ్రాహ్మణులకును బూర్వపురాజులు గాని వారి భృత్యులుగాని చేసిన భూదానము మొదలగు దానములను దెలుపు దానపత్రము లనవచ్చును. అందు దాతల వంశావతారాది విషయము లనేకము లిముడ్పఁబడియుండును. ఈశాసనములకును గావ్యాదులలోని విషయములకును సమన్వయముచేసి యతిశయోక్తులు నిరాధారోక్తులు విసర్జించి సత్యమును దేల్చి దేశచరిత్రము నిర్మింపవలసి యున్నది. ఈనిర్మించుటలో దొరకిన సాధనసామగ్రిని బరిశీలించుట ముఖ్యవిషయము. న్యాయమూర్తి యైన ధర్మాధికారి వాది ప్రతివాదులు తెలుపు విషయములఁ బరిశీలించి సత్యమును గనిపెట్టునట్లు ఐతిహాసికుఁడుకూడ సామగ్రిని మధ్యస్థభావముతో నిష్పక్షపాతముగఁ బరిశీలించి సత్యమును గనిపెట్టవలయును, గాని, వేగిరపాటుతో నపసిద్ధాంతము చేయఁగూడదు. ఇది యంత సులభ మైన పనిగాఁ గనఁబడదు.

ఇప్పుడు పలువు రాంధ్రులు చరిత్రాంశపరిశోధనముచయఁ

బూనుకొనుచున్నారు. ఈపనికై రాజమహేంద్రవరములో నాంధ్రచరిత్ర పరిశోధకసభ (Andhra Historical Research Society) అను పేర నొకసభ కూడ స్థాపింపఁబడినది. ఏతత్సభా ప్రతిష్ఠాపకులలో చిలుకూరి వీరభద్రరావుగా రొకరు. ఈయన యాంధ్రులచరిత్ర మను పేర నొక పెద్దగ్రంథమును రచియించినారు. పైని నేనుదాహరించిన సాధనసామగ్రి యీగ్రంథమందు చాలవఱకు విమర్శింపఁబడి యున్నది. ఈవిషయమై యింతగ్రంథమును దెనుఁగులో రచించుటకు వీరభద్రరావుగారే ప్రథములు. వీరియత్న మెంతయు శ్లాఘ్యము. అయినను నీగ్రంథమందు లోపములు లేకపోలేదు అందలి సిద్ధాంతములు కొన్ని నిలుచునట్లు లేదు. నానాఁటికి నూతన ప్రమాణములు బయలుదేఱుచున్నవి. వానినిబట్టి కొన్నికొన్ని సిద్ధాంతములు మార్పవలసి యున్నది.

ఆంధ్ర చరిత్రపరిశోధకసభవారు రాజరాజనరేంద్రసంపుటమని యొకటియు, కళింగసంపుట మని యొకటియు రెండుగ్రంథములను బ్రకటించిరి. కాకతీయసంపుట మొకటి వెలువడ నున్నది. ఈసంపుటములలో నాయావంశస్థులగు రాజులచరిత్రము తెలుపు వ్యాసములు పెక్కులు ప్రకటింపఁ బడియున్నవి. ఈసభవారు పత్రిక నొకదానిని గూడఁ బ్రకటించు చున్నారు. అందు శాసనము లాదిగఁ జరిత్రాంశము లనేకములు ప్రకటింపఁబడుచున్నవి. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలోఁ గూడఁ బెక్కు శాసనములును ఇతర చారిత్రిక విషయములును బ్రకటింపఁబడుచున్నవి.

తిరుపతి వేంకటేశ్వరకవులు విక్రమాంకదేవచరిత్రమును,

చంద్రప్రభ చరిత్రమును సంస్కృతమునుండియు, బుద్ధచరిత్ర మాంగ్లమునుండియు, దెనిగించిరి. విజ్ఞానచంద్రికామండలివారు హిందూదేశచరిత్రము భాగములు కొన్ని ప్రకటించి యున్నారు.

కొరుగంటి సీతారామయ్యగారు, తంజావూరు నాయక రాజులచరిత్రమును సంక్షేపముగఁ దెలుపు గ్రంథ మొకటి రచియించినారు. వెల్లాల సదాశివశాస్త్రిగారు వెలుగోటి వంశచరిత్రము, సురభివంశచరిత్రమును గూర్చినారు.

వాసిరెడ్డి వెంకట సుబ్బదాసుగారు "వాసిరెడ్డి వంశచరిత్రము" అను నొక పద్యగ్రంథమును రచించినారు. వీరికలో—"నాశక్తికొలఁది శాసనాదులచేత నేమి, ముద్రితగ్రంథ విమర్శనాంశములచేత నేమి, శ్రుత కథాసంవిధానముచేత నేమి, స్వానుభవముచేత నేమి యీచరిత్రమును న్యాయాధికవృత్తుల నందగొండ వ్రాసితి" నని గ్రంథకర్త చెప్పెను.

ఈవిధముగా మద్దులపల్లి గురుబ్రహ్మముగారు కొండవీటి చరిత్రమును రచించిరి. దేశమం దెల్లెడల వెదచల్లిన ట్లున్న శాసనములనన్నింటిని సంగ్రహించి దొరతనమువారు ప్రకటించుచున్నారు. వీనిని బరిశీలించి దేశచరిత్రమును యథార్థముగా నిర్ణయింపవలయు నన్న యుత్సాహము లోకమం దుదయించినది. ఈయుత్సాహము నిప్పుడు నేను బేర్కొన్న గ్రంథములు సూచించుచున్నవి. వీనియందలి సిద్ధాంతము లన్నియుఁ బరమసిద్ధాంతములని గ్రహింపఁదగినవి కావు కాని దేశమం దీయుత్సాహముదయించుట భావిసూచకము.

దేశచరిత్రముతోపాటు భాషాచరిత్రమునుగూడ రచించుటకు యత్నములు జరుగుచున్నవి. గురుజాడ శ్రీరామమూర్తిగారి కవిజీతములును వీరేశలింగముగారి యాంధ్రకవులచరిత్రము నీయుద్యమమున కారంభములు. ఆంగ్లేయభాషలో "జాన్సను" (Johnson) మహావిద్వాంసుండు రచించిన కవిజీవితముల (Lives of the Poets) ననుసరించి యీగ్రంథములు రచింపఁబడినవి. వీరేశలింగముగారంతకుపూర్వము లోక మెఱుఁగని యనేకకవులను గనిపెట్టి వారికాలనిర్ణయముచేసి వారు రచించిన గ్రంథములఁ బేర్కొని యందలివిషయములను గుణదోషములను విమర్శించిరి. ఇది మిక్కిలి ప్రయాసముతోఁ జేయఁదగినపని. వంగూరి సుబ్బారావుగారును భోగరాజు నారాయణమూర్తిగారును ఆంధ్రవాఙ్మయచరిత్ర మనుపేరఁ జిన్నగ్రంథములను రచించినారు. టేకుమళ్ల అచ్యుతరావుగారు కర్ణాటరాజ్యకాలమందుఁ బుట్టిన యాంధ్రవాఙ్మయచరిత్రము విపులముగా రచించిరి.

మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు సంస్కృతకవుల చరిత్రమును వ్రాసిరి. సంస్కృతవాఙ్మయచరిత్రము సమగ్రముగా సమకూర్ప సంకల్పించి వైదికవాఙ్మయవృత్తాంత మొక సంపుటముగా ముందుగా రచించిరి. ఇది యాంధ్రవిశ్వకళాపరిషత్తువారిచేఁ బ్రకటింపఁబడినది.

సరియైన జీవితచరిత్ర మనఁదగిన గ్రంథములు మన దేశమునందుఁ బూర్వము లేవు. వేమభూపాలీయము, సాళ్వాభ్యుద

జీవితచరిత్రములు. యము, రఘునాథాభ్యుదయము మొదలగు సంస్కృతగ్రంథము లాయారాజుల యుత్కర్షముం దెలుపు పొగడ్తలుగాని సత్యమైనచరిత్రలు కావు. తెలుఁగున, కృష్ణరాయవిజయము, రామరాజీయము నను రెండుగ్రంథములు గలవు. మొదటిది రాయవాచకము ననుసరించి కుమార ధూర్జటి రచించినది. రెండవది అందుగుల వెంకయ్యాకవిచే రచియింపఁబడినది. ఇందుఁ గర్ణాటరాజ్యము నేలిన యార్వీటివంశపురాజులచరిత్రము స్థూలరూపముగాఁ దెలుపఁబడినది. పాశ్చాత్యవిద్యా సంపర్కమున నిటీవలఁ బెక్కుగ్రంథములు బయలుదేఱినవి. వీరేశలింగముగారు విక్టోరియామహారాజ్ఞిగారి చరిత్రమును, జీససుచరిత్రమును ఇంగ్లీషునుండి తెనిఁగించిరి. తోలేటి వెంకటసుబ్బారావుగారును కొటికలపూఁడి సీతమ్మగారును వీరేశలింగముగారి చరిత్రమును సంక్షేపముగా రచియించిరి. పిదప వీరేశలింగముగారే తమజీవితమును "స్వీయచరిత్ర" మనుపేర రచింప నది విజ్ఞానచంద్రికాగ్రంథమాలలో 15 వదిగాఁ బ్రకటింపఁబడినది. ఈగ్రంథము 1910 సం॥లో రచియింపఁబడినది. తమకీగ్రంథమును సమకూర్చుతలంపు మొదటినుండియు లే దనియుఁ గొందఱు మిత్రులు మఱిమఱి కోరినను దా మాకార్యమునకుఁ బూనకుంటి ననియుఁ జిట్టచివరకు స్నేహితుల బలవంతముమీఁదనే రచియింపవలసి వచ్చిన దనియు వీరేశలింగముగారు గ్రంథపీఠికలోఁ జెప్పినారు. ఇట్లయ్యును వీరు తమ చిన్నతనమునాఁటివృత్తాంతముం గూడఁ బూసగ్రుచ్చినట్లు సూక్ష్మాంశ సహితముగా యథాక్రమముగా

వివరించినారు. దీనినిబట్టి యూహింప వీరి గ్రహణశక్తియు మేధ యు నసాధారణము లని చెప్పవలసి యున్నది. ఆపీఠికలోనే "తన్నుఁగూర్చి తాను వ్రాసికొనునప్పు డీశ్వరముఖమునుజూచి సత్యమునే చెప్పఁజూచినను సమకాలపువా రది యాత్మస్తుతి గానో పరనిందగానో చేకొని యన్యథా భావింపనచ్చు"నని నుడివిరి. ఈమాటలం దలపించువాక్యములు కొన్ని గ్రంథమునం దక్కడక్కడఁ గలవు. కొన్నిటి నుదాహరించెదను.

"ఏకసంధా ద్విసంధా గ్రాహుల యందు బుద్ధివిశేషము కొంత కలవాఁడ నగుటచేత నేనింటనుండి పాఠశాలకుఁ బోవుచు నొకసారియో రెండుసారులో దారిలోఁ బాఠమును జూచినంత మాత్రముననే నాకది ముఖస్థమై యప్పటికిఁ దప్పులేక యప్ప గింప శక్తుఁడ నగుచుంటిని."

"నాలవతరగతిలోఁ జదువుకొనుచున్న కాలములో నన్నుఁగూర్చి నేను విశేషముగాఁ జెప్పుకొనవలసిన దేదియు లేదు. తెలివిగలవాఁడ ననియు, పాపభీతియు దైవభక్తియుఁ గల వాఁడ ననియు, ఆడినమాటతప్పనివాఁడననియు, సాధువర్తనము గలవాఁడ ననియు, సత్యము పలుకువాఁడననియు భావించి పాఠ శాలయందు బాలురందఱు నాయం దతిమాత్రగౌరవము కలవా రయి యుండిరి."

"ఎక్కడ నేయక్రమము కనఁబడినను నాది సహించి యుండెడి స్వభావము కాదు. ఆయక్రమమునకుఁ బ్రతిక్రియఁ జూచువఱకును నామనస్సున కూఱట గలుగదు."

"నా కెంతబాధ కలిగినను నే నోర్చుకొని యుండఁగలుగుదును గాని యితరులకు నిష్కారణముగా బాధ కలిగినప్పుడు సహించియుండఁజాలను అందులోను నానిమిత్త మొరులకు బాధ కలిగినప్పుడు నామన స్సెట్లు పరితపించునో వివరించుటకు భాష చాలదు."

"ఆప్రధానోపాధ్యాయుఁ డాదినమునఁ జెప్పినప్పుడును చిన్నమెత్తుమాట యనక యెంతో గౌరవముతోఁ జూచుచుండెడివాఁడు. తెలివిగలవాఁడ నని మాత్రమే గాక శాంతచిత్తుఁడ ననియు వినయపరుఁడ ననియు, సాధువర్తనుఁడ ననియుఁ గూడ నాయం దాయనకు విశేషప్రేమయు."

"ఈశ్వరుఁడు నాకు వేగముగా వ్రాయుశక్తిని ప్రసాదించియున్నాఁడు. పద్యములనుగాని వచనములనుగాని నే నొకసారియే వ్రాయుచుందును. వ్రాసినదానిని మరల దిద్ది వ్రాయుట నా కలవాటులేదు. అందుచేత నావ్రాఁత దిద్ది దిద్ది మరల మరల వ్రాయుచుండువారిదానివలె నంత మెఱుఁగుగా నుండదనుకొనెదను."

ఇవి యన్నియు సత్యము లగుటచేతనే వీరేశలింగముగా రుగ్గడించియుందురు. కాని యిట్టిప్రశంసలు తమువిషయమై తామే చేసికొనుటచే నతిశయోక్తులుగాను, ఆత్మప్రశంసగాను బరులకుఁ దోఁపవచ్చు ననుమాటయు వాస్తవమే. కృతికర్తయుఁ గృతినాయకుఁడు నొక్కఁడే యయినప్పు డట్టియూహల కవకాశము కలుగుట సహజము.

ఈయన సాంఘికాచార సంస్కరణప్రియుఁడు. ఈవిషయములో నీయన చేసినపనులన్నింటిలో స్త్రీపునర్వివాహకరణోద్యమ మధికమైనది. ఈవిషయములోఁ దాము చేసినకార్యముల గ్రంథము నాల్గవప్రకరణమునందు విరివిగా వివరించిరి. ప్రథమ స్త్రీపునర్వివాహము 1881 వ సంవత్సరాంతమున జరిగినది. ఇప్పటికిఁ గొంచెము తక్కువగా 58 సంవత్సరము లయినది. ఈ మధ్యకాలములో జరిగిన విధవావివాహము లన్నియుఁ గలిసి 53 ఉండునో యుండవో! ఈనూతనపద్ధతి యాంధ్రదేశమందు వ్యాపింపలేదు.

వూండ్ల రామకృష్ణయ్యగారు మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారి జీవితచరిత్రమును సంక్షేపముగా రచించినారు. ఇటీవల, అనంతపంతుల రామలింగస్వామిగారు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి జీవితచరిత్రమును విపులముగా రచించి వజ్రాయుధపత్రికలోఁ బ్రకటించిరి.

తిరుపతివేంకటేశ్వరకవులలో రెండవవా రగు చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు "జాతకచర్య" యనుపేరఁ దమ జీవితచరిత్రమును బద్యమయముగా రచించినారు. తమ జాతకఫలమును జెప్పురీతిగా నీచరిత్రమును గూర్చినందున దాని కా పేరన్వర్థమైనది. విద్యాభ్యాసమునకై యీయన పడినపాటు లిందు వివరింపఁబడినవి. ఈచరిత్రములోఁ బ్రసంగవశమున తిరుపతిశాస్త్రిగారి చరిత్రముగూడఁ గొంత యిమిడియున్నది. వేంకటశాస్త్రులుగ్గారు తమ లోపములను దాఁప యత్నింపక జరిగినసంగతులు

జరిగినట్లే చెప్పిన ట్లూహింపఁ దగియున్నది. శనిప్రభావమువల నఁ దమకుఁ జిన్నతనమందు, తిట్టుకవిత యలవడినదని చెప్పి—

గీ. "తిట్టుఁగవనమ్మునకు ఫలస్థితిగ ఖైదు
గల్గునంతటి యిక్కట్టు గడలుకొల్పి
మాతృపీడ నొనర్చి యి మ్మందుఁ డెన్ని
యేనిదోసఁగులనొడఁగూర్చెఁదాను మొదట" (దోలుతఁదాను)

అని వ్రాసిరి. ఇట్టిభాగములు మఱికొన్నియుఁ గలవు.

తిరుపతిశాస్త్రిగారి వివాహమును వర్ణించుచు వేంకట శాస్త్రులుగారు చెప్పిన యీపద్య మసమాన పదబంధ బంధుర ముగా నున్నది.

చ. "జరిగె వివాహ మద్భుతరసప్రసరత్కలకంఠకంఠ బా
స్వరతరుణీమణీ పటపసంగత మంగళవాద్యఘోషవి
స్ఫురిత దిగంతరాగత విశుద్ధచరిత్ర ధరాసురాధిరా
జరుచిర మంగళ శ్రుతిరసప్రథిత ప్రమద ప్రదమ్ముగన్."

పానుగంటి లక్ష్మీనరసింహారావుగారు స్వీయచరిత్రమును సమకూర్చుచున్నారని వినియున్నాఁడను.

ప్రాచీనకాలమునుండియు మనదేశమునం దష్టావధాన శతావధానములు చేయువాదుకయు నాశుకవిత్వము చెప్పు వా

అవధానులు. దుకయుఁ గలదు. రమారమి యిరువదిసంవత్సర ఆశుకవులు. ములక్రిందట నూజివీడు వాస్తవ్యులగు మాడభూషి వేంకటరంగాచార్యులుగా రీరెండువిద్యలయందును కృష్ణాగోదా వరీమండలములలో సుప్రసిద్ధులుగానుండిరి. పిదప పిఠాపురవాస్త

వ్యులు దేవులపల్లి సుబ్బరాయశాస్త్రులు వేంకటకృష్ణశాస్త్రులు ననునిద్దఱు సోదరకవు లష్టావధానశతావధానములు చేయుట యందుఁ బ్రవీణులై యుండిరి. నేఁటికి రమారమి నలువదిసంవత్సరములక్రిందట తిరుపతి వేంకటేశ్వరకవులు బయలుదేఱి కవిత్వమందును, నవధానములు చేయుట యందును నద్వితీయముగ విఖ్యాతిని సంపాదించిరి. వీరిలో మొదటివారు దివాకర్ల తిరుపతిశాస్త్రులుగారు, వెలనాఁటిశాఖలోనివారు. రెండవవారు చెళ్లపిళ్ల వేంకటశాస్త్రులుగారు, ఆరామద్రావిడ శాఖలోనివారు. వీరి కుటుంబమునందుఁ గొన్నితరములనుండి తెనుఁగుఁగవిత్వ మనుస్యూతముగా వచ్చుచున్నది. వీరిరువురును గలసి చర్ల బ్రహ్మయ్యశాస్త్రులుగా రనుపండితునియొద్ద వ్యాకరణశాస్త్ర మభ్యసించిరి. ఆకాలమున వీరి కిద్దఱకు నత్యంతమైత్రి యేర్పడినది. ఆకాలముననే వేంకటశాస్త్రిగారి సంపర్క మహిమచే తిరుపతిశాస్త్రిగారికిఁ గవితాధోరణి యలవడినది. చదువు పూర్తియైన పిమ్మట వీరిరువురును గలసియే కవిత్వము చెప్పుచు నవధానములు చేయుచుండిరి. అవధానములలో నొకపాద మొకరు నింకొక పాదమును రెండవవారును జెప్పుచుండిరి. వీరిద్దఱును గలసి విశాఖపట్టణములో శతావధానము చేయుట నేను చూచితిని. పిదపఁ గొన్నాళ్లకుఁ దిరుపతిశాస్త్రులుగా రొక్కరే నరసరావుపేటలో నవధానము చేసిరి. ఆయవధానము గుంటుపల్లి గోపాలకృష్ణయ్యగారు రచించిన చమత్కారనిధాన మను ఖండకావ్యమునందు వర్ణింపఁబడినది. ఈకవు లనేకసంస్థానాధిపతుల దర్శించి వారిచే సన్మానితు

లైరి. మొత్తముమీఁద నీకాలమం దవధానవిద్యయం దీకవు లగ్రగణ్యు లని చెప్పవచ్చును. ఒక్కయావధానమందే గాక ప్రబంధకవిత్వమందుఁగూడ వీరు ప్రవీణులు. వీరు రచించినగ్రంథములు నాటకములు, ప్రబంధములు వచనగ్రంథములు పెక్కులు గలవు. వీరిలో నిద్దఱుఁ గలసి రచించినవి కొన్నియు నొక్కరొక్కరే రచించినవి కొన్నియుఁ గలవు ఏవి యెవ్వరు రచించినను నన్నియు తిరుపతి వేంకటేశ్వరకవులు రచించినట్లే ప్రకటితములైనవి.

ఈకవు లాయాస్థానములకుఁ బోయినప్పుడు కొన్నితావులలో వీరి కితరకవులతోడను బండితులతోడను వివాదములు కలిగెను. వాదమువచ్చినప్పుడు తమపట్టు నెగ్గించుకొనుటకే యత్నింతురు గాని వీరు వెనుదీయరు. వీరికి వివాదము కలిగినది ముఖ్యముగా కొప్పరపు కవులతోడను రామకృష్ణకవులతోడను. కొప్పరపువారితో వివాదము పుట్టినప్పుడు "గుంటూరుసీమ" యనెడు గ్రంథమును రామకృష్ణకవులతో వివాదము వచ్చినపుడు "గీరతము" అనుగ్రంథమును వీరు రచించిరి. పరమతఖండనమును స్వమతమండనమును జేయ వీరు గ్రంథములను రచించిరి అసభ్యము లగుదూషణము లిందుఁ గానిపింపవు. వీరి కవిత్వము మొత్తముమీఁద హృదయాహ్లాదకరముగ నుండును. రసహీనములైన చప్పనిపద్యములు వీరి కృతులం దంతగాఁ గానిపింపవు. అవధానవిద్యయందే గాక కావ్యరచనాపద్ధతియందుఁ గూడ నీకవు లీనాఁడు తీర్థభూతు లయినా రని చెప్పవచ్చును.

వీరిశిష్యుల మని చెప్పుకొనుట గౌరవ మని తలంచు యువకులు పలువురు గలరు. వీరిలోఁ జాలమంది వేంకటశాస్త్రులుగారి శిష్యులే. ఈశాస్త్రులుగారికి జనాకర్షణశక్తి మెండు. ఈయన యెక్కడనున్నను వీరివాఙ్మాధుర్య మాస్వాదింపఁ బలువురు చేరుచుందురు. ప్రతిపక్షుల నిరాకరించుటయం దెంతటి శ్రద్ధయో యీయనకు స్వపక్షుల నాదరించుటయందు నంత శ్రద్ధ కలదు. ఈయన కొంతకాలము బందరుపురములో హిందూహైస్కూలను నున్నతపాఠశాలలో నాంధ్రపండితులుగా నుండెడువారు. ఆపట్టణనివాసుల కిప్పటికిని వీరియం దత్యంత గౌరవము గలదు.

తిరుపతిశాస్త్రులుగారు పదిసంవత్సరములకుఁ బూర్వము దివంగతులైరి. వేంకటశాస్త్రిగారు సుఖజీవులై యున్నారు. జగదీశ్వరుఁ డీకవిశేఖరుని జిరంజీవిగా నొనర్చుంగాత.

కొప్పరపు సోదరకవు లాశుకవిత్వమునందు మిక్కిలి నిపుణులు. వారిలో జ్యేష్ఠుఁడు సుబ్బారాయఁడుగారు చాలఁ బ్రతిభావంతులు. ఆయనను జూచియే యాయనతమ్ములు నాశుకవిత్వము నేర్చుకొనిరి. సుబ్బరాయకవిగారు నాలుగైదుసంవత్సరములక్రిందట దివంగతులైరి. తమ్ములు ప్రవర్ధమానులై యున్నారు.

హరి కథలు. భక్తిరసప్రధానపురాణగాథలలో నేదైన నొకటి యెత్తుకొని దానిని శ్రోతలమనస్సుల నాకర్షించునట్లు గద్యములు పద్యములు, గానములతో సమ్మేళనముచేసి ప్రపంచించుట హరికథాకాలక్షేపమందురు. ఇట్టి హరికథలు చెప్పు

నాచారము మనదేశమందు పూర్వమునుండియుఁ గలదు. వర్తమానకాలమం దీవిద్యలో విజయనగరవాస్తవ్యులయిన ఆదిభట్ల నారాయణదాసుగారు ప్రథము లని చెప్పవచ్చును. ఈయనకు సంస్కృతాంధ్రములందుఁ గవిత్వము చెప్పు నేర్పును గానమునందుఁ బాండిత్యమును గలవు. వీరి హరికథాకాలక్షేపములు రమణీయములై బహుజనుల నాకర్షించును. ఈయన కొన్ని హరికథలను స్వయముగాఁ బ్రౌఢశైలిని రచించిరి. పద్యవిద్యయందు తిరుపతివేంకటేశ్వరకవులకుఁ బోలె హరికథావిద్యయందు నారాయణదాసుగారికి శిష్యుల మనుకొనువారు పెక్కండ్రు కలరు.

వార్తాపత్రికలు ప్రాచీనకాలమం దెప్పుడు నీదేశమం దున్నట్లు కనఁబడదు. ఆంగ్లేయసంప్రదాయము ననుసరించి యివి క్రొత్తగా బయలుదేఱినవి. ఈపత్రికలలోఁ గొన్ని కేవల వార్తాపత్రికలు. కొన్ని కేవల సాహిత్యపత్రికలు. ఈసాహిత్యపత్రికలే నేఁటికి నధికముగా నున్నవి. ఈపత్రికలలో నాంధ్రగ్రంథములును, భాషావిషయకవ్యాసములును బ్రకటింపఁ బడుచుండును. నాకుఁ దెలిసినంతవఱకు నీపత్రికలలో మొట్టమొదటిది కొక్కొండ వేంకటరత్నముపంతులుగారు ప్రకటించుచుండిన ఆంధ్రభాషాసంజీవని. కొన్నాళ్లపిదప వీరేశలింగముగారు రాజమహేంద్రవరములో వివేకవర్ధని యను పత్రికను బ్రకటింప నారంభించిరి. వేంకటరత్నముగారికి వీరేశలింగముగారికిని భాషావిషయకమగు వైషమ్యము హెచ్చి యొకరికృతుల నొక

రు ఖండింపఁ బూనుకొన్నతరువాత ఆంధ్రభాషాసంజీవని కను బంధముగా హాస్యసంజీవనియు, వివేకవర్ధని కనుబంధముగా హాస్యవర్ధనియు బయలుదేఱినవి. వివేకవర్ధనిలో భాషావిషయములు మాత్రమే గాక వార్తలును, రాజకీయాదివ్యవహారసంబంధచర్చలును బ్రకటింపఁబడుచుండెడివి. కొంతకాలమైనపిదప వివేకవర్ధని చింతామణి యను కేవల సాహిత్యపత్రికగా మాఱినది. ఇది యిటీవల నంతరించినది. అముద్రితగ్రంథచింతామణి యనుపత్రిక నెల్లూరిలో, పూండ్ల రామకృష్ణయ్యగారు ప్రకటించుచుండిరి. ఇందుఁ బ్రాచీనాంధ్రగ్రంథములును సాహిత్యచర్చలును బ్రకటింపఁబడుచుండెడివి. కాకినాడలో మందారమంజరి, ప్రబంధకల్పవల్లి, రాజయోగి యను పత్రికలు పూర్వ ముండెడివి. పిదపఁ బోలవరము జమీందారుగా రగు కొచ్చెర్లకోట రామచంద్ర వేంకటకృష్ణారావుగారు సరస్వతి యను మాసపత్రికను స్థాపించి 15 సంవత్సరములు నడపిరి. ఇందుఁ బెక్కుకావ్యములు నాటకములుఁ బ్రకటింపఁబడినవి. ఆకాలమందే యేలూరిలో లక్కవరము జమీందారుగా రగు శ్రీ మంత్రిప్రెగడ భుజంగరావుగారు నటువంటిదే మంజువాణి యనుపత్రికను బ్రకటించుచుండిరి. రాజమహేంద్రవరములో శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు కళావతీ పత్రికను, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు మనోరమ యను పత్రికను గొంతకాలము నడపిరి. పిఠాపురములో రామకృష్ణకవులు కొంతకాలము కవిత యను మాసపత్రికయం దనేకగ్రంథములన్ను బ్రకటించిరి. చెన్నపట్టణములో మన్నవ బుచ్చయ్యపంతు

లుగారు హిందూజనసంస్కారిణి యను పత్రికను స్థాపించి యందు ధర్మశాస్త్రము లర్థసహితముగఁ బ్రకటించుచుండిరి. బుచ్చయ్యపంతులుగారు వీరేశలింగముగారివలెనే సాంఘికాచారసంస్కార ప్రియులు. చెన్నపట్టణములోనే వనప్పాకము అనంతాచార్యులుగారు వైజయంతి యను మాసపత్రికను గొన్నినాళ్లు నడిపిరి. గుంటూరుమండలములోని జానపాడను గ్రామమునందు జానపాటి పట్టాభిరామశాస్త్రిగారు అభినవసరస్వతి యను భాషావిషయకపత్రికను జిరకాలమునుండి ప్రచురించుచున్నారు. కొంతకాలముక్రిందట బందరుపురములో కొత్తా శ్రీరామశాస్త్రిగారు శారద యను పత్రికను గొన్నాళ్లు నడపి నిలిపివేసిరి. దానిపిదపఁ జెన్నపురములో కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారు భారతి యను సాహిత్యపత్రికను బ్రారంభించి నేఁటివఱకును జరపుచున్నారు. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక పరిషత్తు స్థాపింపఁబడినప్పటినుండి నేఁటిదనుక సాగుచున్నది.

వార్తాపత్రికలలో వివేకవర్థని మొదటిది; చెన్నపట్టణములోఁ, బిదప ఏ. సి. పార్థసారథినాయఁడుగారు, ఆంధ్రప్రకాశిక యను పత్రికను నెలకొల్పి చిరకాలము నిర్వహించిరి. ఆపత్రిక నడచుచుండఁగనే కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారు బొంబాయిలో ఆంధ్రపత్రిక యను వార్తాపత్రికను బ్రకటింప నారంభించిరి. కొంతకాలమైనపిదప నా వారపత్రిక నాగేశ్వరరావుగారితోఁ గూడఁ జెన్నపట్టణమునకు వచ్చి నేఁటికిని దినపత్రికయై ప్రకటింపఁబడుచున్నది. ఆంధ్రవార్తాపత్రికలలో నెల్ల నిది

యే మిగుల వ్యాప్తి కలది. కృష్ణాపత్రిక యను వారపత్రికను బందరులో ముట్నూరి కృష్ణారావుగారు చిరకాలమునుండి ప్రకటించుచున్నారు. చెన్నపట్టణములో సమదర్శిని యను పత్రిక వారమునకు రెండుసారులును, త్రిలింగ యను పత్రిక వారమున కొక్కసారియుఁ బ్రకటింపఁబడుచున్నవి. గట్టుపల్లి శేషాచార్యులుగారు శశిరేఖయను వారపత్రిక కొంతకాలము చెన్నపట్టణములోఁ బ్రకటించిరి.

ఆధునిక పద్యగ్రంథములు.

పద్యగ్రంథరచనము పూర్వమువలె నేఁటికిని నడచుచునే యున్నది. ఇటీవల బయలుదేఱిన గ్రంథములలోఁ గొన్నిటిని ముఖ్యముగాఁ బేర్కొనవలసియున్నది. యథావాల్మీకిరామాయణములు మూఁడుగ్రంథములు బయలు వెడలినవి. వానిలో మొదటిది శ్రీవేంకటగిరిమహారాజావారి యాస్థానకవి యగు గోపీనాథము వేంకటకవి రచించినది. రెండవది వావిలికొలను సుబ్బరావుగారును, మూఁడవది జనమంచి శేషాద్రిశర్మగారును రచించిరి. ఈగ్రంథము లన్నియు వాల్మీకిరామాయణములోని మాట లేవియు విడువకుండఁ దేనిఁ గింపవలయు ననునూహతో రచియింపఁబడినవి. సత్తెనపల్లి జమీందారి కుటుంబములోనివారగు మానూరి గోపాలరావుగారు పూర్వమే యిట్టిగ్రంథమును రచించి రని వింటిని గాని యాగ్రంథము ప్రకటితము కాలేదు. ఇట్టిదే ఘనగిరిరామకవి యను పూర్వకవి రచించిన యథావాల్మీకమునందు గొన్ని కాండములు కనఁబడుచున్నవి. ఇప్పుడున్న మూఁడుగ్రంథములలో గోపీనాథ

ము వేంకటకవిగారి గ్రంథము శైలియే బాగుగా నున్నదని నా యభిప్రాయము. ఈగ్రంథమునకు గోపీనాథరామాయణ మను పేరు వాడుకలో నున్నది.

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు రచించుచున్న శ్రీకృష్ణభారతము ప్రశంసార్హము. కవిత్రయమువారు విడిచిపెట్టినభాగములనుగూడఁ జేర్చి మూలభారతమునకు సరిగాఁ దెలిఁగించుచున్నా రని శాస్త్రులుగారి ప్రతిజ్ఞ. ఈగ్రంథరచనము పూర్తియైనదఁట. చాలవఱకు ముద్రణము కూడ నైనది. ఈగ్రంథము కవిత్రయగ్రంథముకంటెఁ జాలఁ బెద్దదిగా నుండును. దీనిని యథావ్యాసభారత మనవచ్చును. అసాధారణమైనపట్టుదలయుఁ గవితాకౌశలమును లేక యింతగ్రంథ మొక్కచేతిమీఁద రచియించుట యసాధ్యము. కావ్యశైలి మొత్తముమీఁద హృద్యముగా నుండును.

శ్రీ మంత్రిప్రెగడ భుజంగరావుగారు క్రైస్తవవేదమగు బైబిలులో నుత్తరభాగమును బద్యరూపముగాఁ దెలిఁగించిరి. క్రైస్తవధర్మము లన్నియు నిందు నిరూపింపఁబడియున్నవి. కవితాశైలి చక్కఁగా నున్నది.

దాసు శ్రీరాములుగారు సంపూర్ణముగను, దిరుపతి వేంకటేశ్వరకవు లసంపూర్ణముగను దేవీభాగవతమును దెనిఁగించి ప్రకటించిరి. వీరికిఁ బూర్వము ములుగు పాపయ కవియు, త్రిపురాన తమ్మయ్యకవియు నీగ్రంథమునే తెనిఁగించిరఁట. అవి యచ్చుపడలేదు.

దాసు శ్రీరాములుగారు రచియించిన "తెలుఁగునాఁడు" చిత్రమైనఖండకావ్యము. తెలుఁగుదేశములోని నానావర్ణములందును గల శాఖాభేదముల గుణాగుణములు వర్ణింపఁదలఁచి ముందుగాఁ గొన్నిబ్రాహ్మణశాఖలను మాత్రము వర్ణించెను. ఈగ్రంథము కొంతవఱకు క్రీడాభిరామమును శ్రీనాథుని వీథినాటకమను ప్రతీతిగల వేఱొకచిన్నిగ్రంథమును బోలియున్నది. కాని యీగ్రంథమం దశ్లీలవర్ణనము లెందును లేవు. మొత్తముమీఁద గుణదోషనిర్ణయము సహబుద్ధితోడనే చేయఁబడినది. మచ్చునకై కొన్నిపద్యము లుదాహరించెదను:—

వైదికులు:—

లేవరు లెండు లెం డనిన, లేచినవారయినం దటాలునం
బోవరు పోవుచున్నిలిచిపోదురు పోమను త్రోయకుండటం
జీవరుసందు గేస్తు నలయింతురు పెండిలిలో సదస్యసం
భావననాఁడు చూడవలె బాఁపన సాముల సాములన్నియున్.

నియోగులు:—

నమ్మిన నమ్మకున్న సరి నావశమా జనులాడుకొన్నవా
క్యమ్ములు నేను జెప్పెద భయంపడియో వడకో నియోగిలో
క మ్మనివార్యకార్యఘట కమ్మువుఁగాని పరోపకార శూ
న్యమ్మును స్వప్రయోజనపరాయణముం దలపోయ నిద్ధరన్.

వడ్డాది సుబ్బారాయకవికృత మగు "భక్తచింతామణి" పద్యములు మిగుల హృద్యము లయినవి. భక్తిరసప్రధానములైనను నితరవిషయము లనేకము లిందిమిడి యున్నవి. భావము

ఉదారములు. చదువుటకును వినుటకును బద్యము లింపుగా నుండును. గయోపాఖ్యానము తరువాత నధికప్రతు లమ్ముడుపడు గ్రంథ మిదియే యని విన్నాఁడను. మచ్చునకై రెండుపద్యము లుదాహరించెదను.

మ. తలిదండ్రుల్ బలెఁ దప్పు లోఁగొనుచు వాత్సల్యంబునం
బ్రోతు; నెచ్చెలియుం బోలె సుధామయోక్తులను మాసేమం
బెఱింగింతు; కేవలధర్మప్రభు వట్లు నీప్రజలయిబ్బందుల్ దొ
లంగింతు; నిన్నెలమిం గొల్వమి మాయభాగ్యదశ గాదే?
భక్తచింతామణీ!

శా. సేవింతున్ భవదీయపాదజలరుట్చింతానుపానంబుతో
దేవా! మందు; ననామయత్వముఁ బ్రసాదింపంగదే మేలికిం
బ్రావృణ్మేఘపుఁబ్రాపు గల్గినను, దావం బేర్చునే వృక్షమున్
నీ వుండన్ హృది నాకు వ్యాధి భయ మున్నే? భక్తచింతామణీ!

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు రచించిన "కృపాంభోనిధి" పద్యములుకూడ నీవర్గము లోనివే. కవికి సహజమైన మధురశైలి నొప్పారుచున్నది. ఉదా:—

శా. అన్నా! నీదగు మూర్తి యెట్టిదియొ జాత్యంధుండుకాలాద్యవ
చ్ఛిన్నంబై జగదేకపూర్ణ మగు నీచిన్మాత్ర దివ్యాకృతిం
గన్నారం గనుఁ బుండరీకదళ సంకాశస్ఫుర న్నేత్రుఁడున్
నిన్నుం జూడఁగలేఁడు చిత్ర మిది తండ్రీ సత్కృపాంభోనిధీ.

మ. గగనం బద్భుతలీల నీదగు నిరాకారత్వమున్ గాలి నీ
దగు విష్ణుత్వము, నీరు నీకరుణ, దీప్యద్వహ్ని నీతేజు నీ .

దగు శాంతిన్ ధరచాటుచున్నయవి,యాహా పంచభూతంబులే
పొగడున్నీగుణరాజి వందులయి శంభూ సత్కృపాంభోనిధీ.

క్రొత్తపల్లి సూర్యరావుగారు రచించిన "ఉన్మాదసహస్రము" అనుగ్రంథము కడు నపూర్వమైనది. వెఱ్ఱి వేయివిధములను లోకోక్తి ననుసరించి యొక్కొక్కపద్యమునం దొక్కొక్కవిధమైన వెఱ్ఱిని వర్ణించుచు వేయిపద్యములు చెప్పి యీకవిత్వము చెప్పుట యింకొక వెఱ్ఱి యని మఱియొక పద్యముం గూడఁ జెప్పెను. ఒకవెఱ్ఱిచేతనే మతి చెడవలసియుండఁగా నిన్నివెఱ్ఱులను దలకుఁ బట్టించుకొని వర్ణించి తుదకుఁ దన కేవెఱ్ఱియు లేకుండ యథాపూర్వముగా నుండఁగలిగిన యీకవిశక్తి ప్రశంసార్హము. చక్కఁగాఁ బరిశీలించినచో నిజమైన కవు లందఱు నిట్టివారే గదా! గ్రంథములందు సందర్భోచితముగా వివిధభావముల వర్ణించియుఁ దమస్వభావము మాత్రము మాఱకుండనుండుట సత్కవిలక్షణము. మచ్చునకై కొన్నిపద్యము లుదాహరించెద.

సీ. అఱువది యెనిమిది యగువెఱ్ఱి నాగ గ్ర
హోన్మాద మని యందు రుర్విబుధులు
ఉరగంబుగతి నేల నురమునఁ బ్రాకును
నాలుక చాఁచును నాకుసెలవి
కస్సను బుస్సను గసరుఁ గోపంబునఁ
దలయెత్తు వంచును దారినడుమ

మసలుచుండును డాఁగు మాటున ముడుచుకొ
ని పరుండు బుసకొట్టు నేర్పుమీఱఁ
గుబుసమును సడల్చు గొబ్బునఁ దొడుగును
మెలఁపుఁ దోన పాముమీసములను
బాలుఁ దేనెఁ బ్రాలపాయసంబును బెల్ల
ముఁ జలిమిడివిగోరు భుక్తియందు.

శా. నన్నూటర్వదియేడగుం గుధనిచెంతన్ దుష్టవుల్ నిచ్చలుం
జిన్నంబో చిదురో గ్రహించుచును నిచ్చెం గంధమాతంగసం
పన్నంబౌ నమితార్థ మంచుఁ బాగడన్ వా యెట్టు రావచ్చు నిం
టన్నారీమణిఁ జూడఁ దేటపడు బండారంబు సర్వంబు నాన్.

గీ. ఏడువందల యిరువదా ఱేట్టుసభను
జరుగదే కద శాస్త్ర చర్చ ఫలహార
ముండకున్నను నడుమ నేమున్నదింకఁ
దిండికోసమ కద యెల్ల దేవులాట.

క. తొమ్మన్నూటిరువదిమూఁ
డెమ్మగువకు నైనఁ బట్ట నెప్పుడు మగనిం
దె మ్మనును గాసు లాభర
ణమ్ములు లేకున్న భోజనము వెట్ట ననున్.

---

# ఆధునికాంధ్రవాఙ్మయవికాసవైఖరి.

———:(o):———

## ౮ వ అ ధ్యా య ము.

———:o:———

### —♦ కృతివిమర్శనము ♦—

గ్రంథవిమర్శన మీదేశమందు మొదటినుండియుఁగలదు. ఆవిమర్శనములోఁ దప్పులు పట్టుభాగమే యధికముగా నుండుట చేఁ గావ్యములందుఁ గుకవినింద తఱచుగా నగపడుచున్నది. భవభూతి యంతటివానికిఁ గూడ నీవిమర్శనము దుస్సహమై యాతఁ డిట్లనియె.

"యేనామ కేచి దిహ నః ప్రథయ న్త్యవజ్ఞాం
జానన్తి తే కి మపి తా న్ప్రతి నైష యత్నః
ఉత్పత్స్యతే హి మమ కోపి సమానధర్మా
కాలో హ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ" మాలతీమాధవము.

దూషణ బహుళము లగు విమర్శనములు నేఁటికిని నశింపలేదు.

కొక్కొండ వేంకటరత్నముపంతులుగారును వీరేశలింగము పంతులుగారును నొండొరుల గ్రంథముల నిష్ఠురముగా ఖండించుకొనుచుండిరి. ఇటీవల వేంకటరత్నముపంతులుగారు రచించిన యాంధ్రప్రసన్నరాఘవనాటకమును విమర్శించుచు వేదము వేంకటరాయశాస్త్రిగారు మూలముకంటె నాలుగురెట్లధిక ప్రమాణముగల గ్రంథము రచించిరి. వేంకటరత్నముగారి కవిత్వమును గూర్చి విమర్శనగ్రంథపీఠికలో నిట్లు వ్రాసిరి.

"ఈప్రబంధమందు ఎట్టి సారస్యము కుదిరిన దన, రాత్రి చిమ్మచీకటిలో అగమేల్లోని నడచినవాఁడు స్తంభమునకు ఢక్కని తలఁ గొట్టుకొనిన నెట్టి సారస్యమో యట్టిది కుదిరినది. ఛందో వ్యాకరణాలంకారముల కది వేరుపురువు. ఇందు గద్యము విన్నను పద్యము విన్నను గ్రచ్చకంపను చెవిమీఁద వేసి లాగినట్లుండును. × × × × × పూర్వులు చెప్పినపాకము, లిందు లేవు. గ్రచ్చకాయపాకము, మేడిపండుపాకము, ముసిఁడిపండు పాకము, దృష్టిపిడతపాకము, బీఱపీఁచుపాకము...ఇత్యాదులు గలవు."

ఉన్నతప్పులను మృదువుగాఁ గనఁబఱుపవచ్చును గాని యిట్లు తెగడుట సరసపద్ధతికాదు.

రాగద్వేషములు లేక సమబుద్ధితో గ్రంథమందలి గుణ దోషములను, ఉన్నవి యున్నట్లు తెలుపుట సహృదయుఁ డగు విమర్శకునిపని. అట్లు చేయక తప్పులు పట్టుటయే విమర్శన మని తలంచి నెఱసులను—పెద్దవిగాఁ జేసియు లేనివి యున్నవనుకొని యు దూషించుట సమంజసము కాదు.

కావ్యవిమర్శనపద్ధతిని జక్కగా నెఱుఁగక కొందఱు పెడ మార్గములను ద్రొక్కుచున్నారు. మనుచరిత్రములో వరూధిని

మనుచరిత్ర విమర్శనము. ప్రవరుని గామించి యతని నొడంబఱుపందలంచి పర స్త్రీసంగమము తప్పు గాదని వాదించెను గాన నా ప్రబంధ మసత్కావ్యమని కొందఱు తలంచుచున్నారు. కావ్యములందు నాటకములందునవలెనే సత్పాత్రములు నసత్పా

త్రములు గూడ నుండును. ఆపాత్రముల పలుకులు వారిశీలము నకుం జరితమునకు నుచితమైనవిగా నుండవలయును. అట్లుండుట యే కావ్యగుణము లేనిచో దోషమే యగును. వరూథిని కాముకురా లగు నప్సరఃస్త్రీ. ఆమె యన్నమాట లట్టిపాత్రమున కుచితముగానే యున్నవి గాన నది దోషముగాక గుణమే యని చెప్పఁదగియున్నది. అసత్పాత్రము లున్నమాత్రాన కావ్య మసత్కావ్య మగు నన్నచో వాల్మీకిరామాయణముకూడ నసత్కావ్యమే కావలసి వచ్చును. సత్కావ్య మేభాషయందును దొరకనే దొరకదు. ప్రవరుఁడు హిమాలయమున కేఁగినది సిద్ధుఁడు తనకు దివ్యౌషధ మిచ్చినదినమందా లేక మఱునాఁడా, ఆదినమందే యైనచో నందలి కుతపకాలవర్ణనము సరిగ నున్నదా యను పెద్ద సంశయము విమర్శకలోకమును బాధించుచున్నది. ధర్మశాస్త్ర ప్రసంగములు కావ్యవిమర్శనమం దప్రస్తుతములు.

మనుచరిత్రమునందే ప్రవరుఁడు వరూథినిని నిరాకరించి పోయినపిమ్మట సూర్యాస్తమయమును వర్ణించుసందర్భమున—

తరుణి ననన్యకాంత నతిదారుణ పుష్పశిలీముఖవ్యథా
భరవివశాంగి నంగభవుబారికి నగ్గముచేసి క్రూరుఁడై
యరిగె మహీసురాధముఁ డహంకృతితో నని రోషభీషణ
స్ఫురణ వహించెనోయన నభోమణి దాల్చెఁ గషాయదీధితిన్.

అను పద్యము గలదు. అస్తమయసమయమందు సూర్యమండలమునం దగపడు రక్తకాంతి దీన యైనవరూథినిని బరిత్యజించి పోయిన ప్రవరునిమీఁది కోపముచేత సూర్యునకు మోము జేవు

రించుటచేఁ గలిగిన యరుణిమమా యని కవి యుత్ప్రేక్షించెను. ఇందువలన జారిణీసంగమము విహిత మని కవి యుద్దేశమైనట్లు తేలుచున్నదిగాన నీకావ్య మసత్కావ్యమని కొందఱు విమర్శకుల మతము. ఈపద్యము చెప్పుటలోఁ గవియుద్దేశము ప్రవరునిచే నిరాకరింపఁబడిన వరూధిని దైన్యాతిశయమును జమత్కారముగా వర్ణించుటయే కాని తన్నిరాకరణ ధర్మాధర్మ విచారము కాదు. సంప్రదాయసిద్ధ మగురీతిని సరసహృదయముతోఁ బరిశీలించినప్పుడే కావ్యామోదము సిద్ధించును గాని యప్రస్తుతశాస్త్రచర్చలతో స్తనశల్యపరీక్ష చేయుటచే సిద్ధింపదు. [కుసుమసౌరభ మనుభవింపఁగోరువాఁడు మందమారుతము రీతి ననుకరింపవలయును గాని వనచరమువలెఁ బూవుల నలఁపి పిండిచేయరాదు.]

ఆంగ్లేయకవులలోఁ గొందఱు స్వీయచరిత్రాంశములను దమకాలమునాఁటి దేశచరిత్రాంశములను దమకృతులలో నచ్చటచ్చట సందర్భానుసారము ప్రచ్ఛన్నరూపముగా నూతనవిమర్శనరీతి. నిముడ్చు రనియు నుద్దేశపూర్వకముగా వారు చేర్పకపోయినను నవకాశముగా నయిన నట్టియంశములు గ్రంథములందుఁ జేరు ననియుఁ జెప్పుటయు, విమర్శకు లట్టియంశములను సూచించుటయుఁ గలదు. ఈసంప్రదాయము ననుసరించి యాంగ్లవిద్యాప్రవీణు లగు మనవారు కొందఱు సంస్కృతాంధ్రగ్రంథములందుఁగూడ నిట్టి సూచన లున్నవని తలంచి వానిని బ్రకటింప యత్నించుట యిటీవల బైలుదేఱినది. ఇట్టి విమర్శనములు చేయు గ్రంథములలో కట్టమంచి రామలింగారెడ్డిగారు రచించిన

"కవిత్వతత్త్వవిచార" మొక్కటియు "కవిత్వవేది" యనుమాఱు పేరుతో నెవరో రచియించిన "ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహ" మొక్కటియు కోరాడ రామకృష్ణయ్యగారు రచించిన "భారత కవితావిమర్శన" మొక్కటియు ముఖ్యములు.

రామలింగారెడ్డిగారు సుప్రసిద్ధ విద్యాధికులు. వీరి తండ్రిగారి కాంధ్రవాఙ్మయమందు—అందులో భారతమందు—అభిరుచి యధికముగా నుండెడిదట. అందులోఁ గొంత కవిత్వతత్త్వవిచారము. తద్భాగము చిన్నతనమందు రామలింగారెడ్డిగారికిఁ గూడ సంక్రమించినది. ఇటీవల వీ రాంగ్లవిద్యయం దధికశ్రమచేసి యింగ్లండునకుఁ బోయి యచ్చటఁ బెద్దపెద్ద పరీక్షలలో నుత్తీర్ణులయి విఖ్యాతిని గాంచినారు. ఆంగ్లవిద్యయం దింతపాండిత్యము సంపాదించినను వీరికిఁ దెనుఁగునందు రుచి తగ్గలేదు. కాని యాంగ్లవిద్యాసంపర్కమహిమచేత నారుచి కొంతవఱకు రూపాంతరమును దాల్చియుండవచ్చును. రాజ్యతంత్రమునం దేమి, యాచారవ్యవహారములందేమి వాఙ్మయవిషయమున నేమి వీరికాంగ్లేయసంప్రదాయములం దభినివేశ మధికము. ఆసంప్రదాయములే వీరి కాదర్శములు. కావుననే యీకవిత్వతత్త్వవిచారమునం దెక్కడఁ జూచినను, నాంగ్లవాఙ్మయసంప్రదాయములనే ప్రమాణము చేసికొని యాప్రమాణములనుబట్టి యాంధ్రవాఙ్మయమునందలి గుణదోషనిర్ణయము చేయుట కానవచ్చుచున్నది.

రామలింగారెడ్డిగారి సిద్ధాంతములలో స్థాలీపులాకన్యాయముగా నొకటిరెం డుదాహరించెదను:—

"ఆంధ్రదేశము వీర్యశౌర్యాదిగుణంబులచే విరాజిల్లుచున్న కాలంబున నన్నెచోడుఁడు, నన్నయ, తిక్కన మొదలగు కవిగ్రామణులు ప్రాబల్యమునకు వచ్చిరి. కావున వారి వ్రాఁతలలో రసము లమేయముగ మెఱయుచుండుటయే కాదు. ఉత్సాహామనుగుణంబును వెల్లి విరియుచుండుటయు మహమ్మదీయులచే నోడింపఁబడి యుక్కు తక్కువయై కుక్షింభరులమై యున్న కాలంబులోఁ బుట్టిపెరిఁగిన ప్రబంధకవులలో పాండిత్యబలము విశేషముగ నున్నను పందతన మొక్కటి యెక్కువగ నున్నదే కాని, ధైర్యముతోఁ దలయెత్తుకొని మనుష్యులలో మనుష్యుఁడుగఁ దిరుగుటకుఁ దగిన యుత్సాహ మంతగాఁ గాన్పింపదు. శ్రీకృష్ణదేవరాయలకాలములో పౌరుష మొకింత యుద్దీపించె. కాని యయ్యది మెఱుఁగుదీఁగవలె నొక్కనిమిషమాత్ర మాంధ్రప్రపంచమును దగద్ధగితముఁ జేసి యంతర్ధాన మయినంతన యథారీతిని మరల గాఢ మగుచీఁకటి యాక్రమించినది."

అని రెడ్డిగారొకచో వ్రాసినారు. దీనినిబట్టి వీరికి దేశచరిత్రమునందుఁ బ్రవేశము తక్కువ యనియుఁ బ్రబంధ నిర్మాణమునకును దేశచరిత్రమునకును వీరు కల్పించిన కార్యకారణసంబంధ మసంబద్ధ మనియుఁ దేలుచున్నది.

కృష్ణరాయలకుఁ బూర్వము కర్ణాటరాజ్య మెన్నఁడును మహమ్మదీయుల స్వాధీనమై వారిపాలనములో నుండలేదు. మహమ్మదీయులు కృష్ణ కుత్తరమున నున్న గోలకొండ రాజ్యము నాక్రమించుకొని యుండిరి. కృష్ణ దాఁటివచ్చి కర్ణాటరాజ్యమును

గూడ నాక్రమించుకొన యత్నించిరి గాని యాయత్నము సాఁగ లేదు. ఆకాలమందు కర్ణాటరాజ్యమును హొయిసలరాజులు పాలించుచుండిరి. వారు బలహీనులై యుండుటచే హరిహర రాయలు, బుక్కరాయలు ననువారు నవీన కర్ణాటరాజ్యమును స్థాపించి తురుష్క విప్లవమును నివర్తింపఁజేసిరి. పిదపఁ దురష్టు లొకప్పుడు కృష్ణదాఁటి రాయచూరు ప్రాంతమందలి కొంచెము దేశము నాక్రమించిరి. కృష్ణదేవరాయలు వారి నక్కడనుండి పాఱఁద్రోలుటయే కాక పూర్వరాజులకాలమందు కళింగదేశా ధీశులైన గజపతు లాక్రమించుకొన్న తూర్పుసముద్రతీరదేశము నుగూడ స్వాధీనపఱచుకొనియెను. ఈమహారాజు శౌర్యధైర్యాది సద్గుణసంపత్తి యాంధ్రకవులే కాక యాయన నెఱిఁగిన పాశ్చా త్త్యులుకూడ బహుముఖములఁ బొగడిరి. ఆరాజపుంగవు "దుర వగాహఖేలదుగ్రప్రతాపాగ్ని" తోఁక చిచ్చుభంగి నుదయగిరి మొదలుకొని కటకమువఱకుఁ గాల్చిన దని కవులు చెప్పినది యథార్థమే కాని స్తుతికాదు. ఈమహాపురుషుని యాస్థానమే ప్రబంధవాఙ్మయమునకుఁ బుట్టినిల్లు. ప్రబంధరాజ మనఁదగు నాముక్తమాల్యద నీకవిరాజే నిర్మించెను. మనుచరిత్రము, పారి జాతాపహరణము లీయన కంకితము లైనవి. ఆముక్తమాల్యద పీఠికలోఁ గృష్ణరాయలు తాను గళింగదేశముపై దండెత్తి పోవుచు బెజవాడలోఁ గొన్నిదినంబులు విశ్రమించియుండుతఱిఁ దత్సమీ పమున నున్న శ్రీకాకుళములోని యాంధ్రవిష్ణువును సేవింప నరిగి నప్పు డాదేవుఁడు తనకు స్వప్నమునందుఁ గనఁబడి తనకుఁ బ్రీతిగా

నాముక్తమాల్యదకథను దెనుఁగుప్రబంధముగా రచింపు మని యాజ్ఞాపించె ననియు సూర్యోదయమైనవెంటనే తాను గాల్యాక రణీయవిధులుదీర్చి "నిండోలగం బుండి దండనాథ సామంత సందోహంబులం బెండలకడన మందిరంబుల కనిపి వివిధవేదాగమ విదు లగువిద్వజ్జనంబులఁ గాన్పించుకొని నమస్కరించి యాశుభ స్వప్నంబు వినిపించిన హర్షించి" వారు స్వప్నఫలము విప్పి చెప్పి రని చెప్పెను. ఆంధ్రవిష్ణువుమాటలంబట్టి కృష్ణరాయ లంతకుఁ బూర్వము మదాలసాచరిత్రాది సంస్కృతకావ్యములు గొన్ని రచించిన ట్లగపడుచున్నది. ఇటీవలి ప్రబంధకర్తల కాదర్శమై యొప్పు వసుచరిత్రము కృతిపతి కర్ణాటాధీశ్వరుం డగు తిరుమల రాయలు. ఈయనకృష్ణరాయల యల్లుఁడగు నళియరామరాజు తమ్ముఁడు. అన్నతోఁగలసి యీాయన పెద్దయుద్ధములలోఁ బోరి నవాఁడె. తాళికోట యుద్ధకాలమందు అళియరామరాజు వృద్ధుఁడై యుండియు సమరరంగమునకుఁబోయి యందు నిహతుఁడై వీరస్వర్గమున కేఁగెను. అట్టి మహాశూరున కనుజుఁడు సరివాఁడు నయి సదాశివరాయల యనంతరము రాజయిన యీా శూరుఁ డల్పుఁడా! ప్రబంధకవులు పందలైనచోఁ గృష్ణరాయలే మొదటిపంద. పందలలో పంద గావలసివచ్చునుగదా! అతఁడే పందయైనచో నాతని నామమైన నుచ్చరించుట కధికారములేని యీనాఁటి విద్వాంసులా శూరులు? ఈదేశమం దెన్నటికిని వీర శృంగారముల రెంటిని సమముగాఁ బాటించుటయే యాచారమై యున్నది. కొన్నికొన్నిపట్టుల వీరరసము శృంగారమునకుఁ బోష

కముగా గ్రహింపఁబడినది. శివధనుర్భంగముచేసి రాముఁడు సీతను వరించెను. మత్స్యయంత్రమునేసి యర్జునుఁడు ద్రౌపది నార్జించెను. శిశుపాలాది రాజుల ననేకుల నోడించియే కృష్ణుఁడు రుక్మిణిని భార్యగాఁ బడసెను. వీరందఱును "శౌర్యమే యుంకు వఁజేసి" ప్రాణదయితల సంపాదించుకొనిరి. ఈసంప్రదాయము మనదేశమందే గాక యూరోపుఖండమునందుఁగూడ నుండెడిది. పౌరుషమే ప్రధానగుణ మని భావింపఁబడుచుండిన కాలములో (In the days of chivolry) పౌరుషవంతులు సాహసకార్య ములు చేసియే తాము వలచినకాంతల కటాక్షవీక్షణములకుఁ బాత్రులగుచుండి రని చరిత్రము చెప్పుచున్నది. నెపోలియన్ అను మహాశూరునిపేరు జగద్విఖ్యాతము. అతఁడు సామాన్య కుటుంబములోఁ బుట్టి సామాన్యసైనికుఁడుగానుండి క్రమక్రమ ముగా మహావీరుఁడై యూరోపుఖండ మంతయుఁ దనస్వాధీనము చేసికొని యందలిరాజ్యములఁ దనబంధువులకు నాశ్రితులకుఁ బం చిపెట్టి తా నధిరాజై యుండెను. శత్రుసేన లెన్నియక్షౌహి ణులు వచ్చినను సరకుసేయని యాశూరుఁ డొక్కసుందరాంగి కన్నుంగవకు లొంగిపోయెడివాఁడఁట. ఈతఁడు మనసిద్ధాంతమును బట్టి పందయే కావలసివచ్చునుగదా! ఇఁక శూరు లెవ్వరు? వాక్శూరుల మగు మనమా! కిచ్చెనరుదొరవంటి శుష్కవీరు లక్కడక్కడ నుందురేమోగాని—

మ. పరుఁజూచు న్వరుఁజూచు నొంప నలరింపన్ రోషరాగోదయా

విరతభ్రూకుటి మందహాసములతో వీరంబు శృంగారమున్

జరగం గన్నులం గెంపు సొంపుఁ బరఁగం జండాస్త్ర సందో
హామున్ ।సరసాలోక సమూహము న్నెఅవుచుం జంద్రాస్య
హేలాగతిన్.

అన్నట్లు శృంగార వీరరసములు రెంటిని బరస్పరావిరోధ
ముగాఁ బాటించుటయే వీరసంప్రదాయము.

ప్రబంధము లన్న రామలింగారెడ్డిగారికి జుగుప్సయధి
కము. వానియందలి యితివృత్తమునుగూర్చి—

ఉ. కేవల కల్పనాకథలు కృత్రిమరత్నము లాద్యసత్కథల్
వావిరిఁ బుట్టురత్నము లవారితసత్కవి కల్పనావిశే
షావహపూర్వవృత్తములు సానలఁదీటిన జాతిరత్నముల్
గావున నట్టిమిశ్రకథగా నొనరింపుము నేర్పు పెంపునన్.

అని రామరాజభూషణుఁడుచేసిన నిర్ణయ మీాయనకుఁ
గిట్టదు. "ప్రబంధము స్వకపోలకల్పితముగానున్న నదియొక
దోషమఁట. శుద్ధముగఁ బూర్వవృత్తముగ నున్న నదియు సరిపడ
దఁట. కథ ప్రాచీనముగాను వర్ణనలు నవీనముగాను నున్న సాన
పెట్టినజాతిరత్నమువలె నిగనిగ లాడునని రామరాజభూషణుని
యభిప్రాయము." అని పైపద్యమునకు వ్యాఖ్యానము చేసిరి.
"సత్కవికల్పనావిశేషము" లన్న నితివృత్తములోఁ గవిచేసిన
మార్పులు గాని వర్ణనలు కావు. వర్ణనలు కథాభాగములు కా
వుగదా! ప్రబంధములు వర్ణనాప్రధానములు గాని కథాప్రధాన
ములు కావని రామలింగారెడ్డిగా రనుమాట సత్యమే. ప్రబంధ
ములు త్యాగరాజుకృతులవంటివి. ఈకృతులయందు గానమే

ముఖ్యము గాన మూలముననే రసోత్పాదన మగును. సంగీతమున కాశ్రయముగాఁ గొలఁదిపాటి సాహిత్య ముండును. కథాప్రధానములగు గ్రంథములు చదువునప్పుడు పద్యమారంభించి పూర్తి చేయునప్పటికి రాగకళ యేర్పడునట్లు కొంచెము గానముతోఁ జది విననే యాపద్యభావము చక్కఁగా మనస్సునకుఁ బట్టును, గాని రాగము పెంచి యాలపించినచోఁ బద్యార్థము వెనుకఁబడి మన స్సున కెక్కదు. పురాణాదిగ్రంథములందుఁ గథప్రధానము. అందుఁ గూడ యథోచితవర్ణనలు తగుమాత్ర ముండినచో వాని మూల మునఁ గథ కొక విధ మైనసొంపు వాటిల్లును. వర్ణనలే ముఖ్యము లగుప్రబంధములలో నితివృత్త మప్రధాన మైనను రమ్య మైనచో వర్ణనలకు వికాసముఁ గల్పించును. కథ ప్రసిద్ధ మైనదై యిం చుక సంస్కరింపఁబడినచోఁ జిత్తాకర్షక మగును. ఉన్నదియున్నట్లే చెప్పినచో నది ప్రాఁతవడి యుండుటచేత నంతగా రుచింపదు. కేవల కల్పితకథచే రంజింపఁజేయుట కష్టసాధ్యము. రామలింగా రెడ్డిగారి ప్రశంసకుఁ బాత్రుఁడైన పింగళి సూరన్నకృతులే చూ డుఁడు—వానిలోఁ బ్రభావతీప్రద్యుమ్నము చదివి యానందించు వారిసంఖ్యకంటెఁ గళాపూర్ణోదయము చదివి యానందించెడు వారిసంఖ్య మిక్కిలి తక్కువ. ఆతక్కువమందిలో నైనను గథను సమగ్రముగా గ్రహించి మనస్సునకుఁ బట్టించుకొన్న వారిసంఖ్య మఱియు నల్పము. కాదంబరికూడ నిట్టిదియే. పాండిత్యమునకే యాగ్రంథమును జదువుచురుగాని యందలి కథ నామూలాగ్ర ముగా నెఱిఁగినవా రరుదు. శాకుంతిలోత్తరరామచరితములందుఁ

గల ప్రీతిలో నూఱవవంతయినను జనులకు మృచ్ఛకటికనాటకము నందు లేదు. ఈకారణముల చేతనే నేఁటికిఁగూడ నాటకకర్తలు సామాన్యముగాఁ బూర్వవృత్తములనే గ్రహించి మెఱుఁగుపెట్టు చున్నారు. జగద్విఖ్యాతిఁ గన్న మహాకవి షేక్స్పియరు (Shakespeare) నాటకరాజము లించుమించుగా నన్నిటియం దును బూర్వసిద్ధము లయిన యితివృత్తములే గ్రహింపఁబడినవి. 'వాల్టరుస్కాట్టు' (Sir Walter Scott) నవలలలోఁగూడ నీపద్ధ తియే కానవచ్చుచున్నది. ఎప్పటికప్పుడే క్రొత్తకథను గల్పిం చుటయన్న సులభము గాదు.

వసుచరిత్రము నాదర్శముగా నుంచుకొని యందలి వర్ణన లకెల్లఁ బ్రతివర్ణనలు చేయుటయే కవితానైపుణి యను భావ ముతో రచింపఁబడుచున్న నేఁటికాలపు ప్రబంధములు ప్రశస్తము లయినవి కావని రామలింగారెడ్డిగారు వ్రాసిన దెంతయు సముం జసముగానే యున్నది. పాడినదే పాడినరీతిగా నిర్మింపఁబడుకా వ్యములు రసికజనహృదయముల రంజింపఁజేయఁజాలవు. కాని పూర్వకవుల జాడలు లేకుండఁ గవిత్వముచెప్పుట దుర్ఘటము. శ్రీనాథసుకవిమౌళికృత హరవిలాసములోని భావములు కొన్ని కాళిదాసకృత కుమారసంభవమునందును, శివరాత్రిమాహాత్మ్య మునందలి భావములు కొన్ని కాదంబరియందును గనఁబడుచు న్నవి. కాళిదాస రచిత రఘువంశములోని యనేకభావములకు మూలరూపములు వాల్మీకిరామాయణముం దగపడుచున్నవి. ఆ రామాయణములోని భావములలోఁ గొన్నియైన వేదమునం దు

న్నవేమో. ఎఱిఁగియో యెఱుఁగకయో పూర్వకవిభావముల గ్రహింపకయే యెప్పటికప్పుడు నూతనకల్పనలతో గ్రంథరచన ము సేయుట తెనుఁగునందే కాదు మఱి యేభాషయందును గూడ నసాధ్య మని చెప్పవచ్చును ఆంగ్లభాషలో ననాఖ్యాక ములుగా బయలువెడలుచున్న నవలలయందును, వానిపద్ధతి ననుసరించి తెనుఁగులో రచియింపఁబడుచున్న నవలలయందును నీదోషము లేకపోలేదు. ప్రాఁతవడినకల్పనలఁ గొంచెము మార్చి మెఱుఁగుపెట్టి క్రొత్తకల్పనలఁబోలెఁ గన్పడునట్లు చేయుటయే నేఁటికవుల కౌశలము. నవ్యకవిత యనుపేరితో నిప్పు డిప్పుడు బయలుదేఱుచున్న కవిత్వములందలి భావము లనేకము లాంగ్ల వాఙ్మయములోఁ బ్రాఁతగిల్లినవే.

ప్రబంధములలోని సర్వావయవవర్ణనములు తుచ్ఛము లని రామలింగారెడ్డిగారిమతము. స్త్రీల యవయవము లతిమా త్రముగా వర్ణించుట రసోత్పత్తికి భంగకరమనియే నాయభిప్రా యము. ముఖ్యము లగువర్ణన లేవియో రెండుమూఁడు చేసి వానిమూలమున వర్ణ్యమగు వస్తువు మనస్సునకుఁ బట్టునట్లు చే యుటయే కళానైపుణి. అట్లు చేయఁజాలనివాఁడు ప్రౌఢుఁడు కాఁడని యెంచవలెను. కాని, పాశ్చాత్యపద్ధతులనే ప్రమాణ ముగా గ్రహించి వానినిబట్టి మనపద్ధతుల నిరసించువారు పాటిం పవలసిన విషయ మొక్కటి యున్నది. పాశ్చాత్యవాఙ్మయమం దు నగ్నరూపవర్ణన మంతగా నుండదుగాని నగ్నరూపముల దృ ష్టిగోచరములుగా నొనర్చుట వారిమతముచేఁ దప్పుగాదు. పూ

ర్వకాలపు యవనుల (Greeks) ప్రతిమాశిల్ప ముత్తమ మని నాఁటికి నేఁటికిని బరిగణింపఁబడుచున్నది. ఆనాఁడుపుట్టిన శిలా విగ్రహము లిప్పుడు గలవు. అవి తఱచుగా నగ్నాకారముగానే యుండును. వర్తమానకాలమందు యూరపుఖండములో నగ్న స్త్రీరూపములఁ జిత్రవర్ణములతోఁ లిఖించుటయు (Nude pictures) నాచిత్రముల మహాసభలోఁ బ్రదర్శించుటయు నా చారముగా నున్నది. చిత్రకారు లిట్టిచిత్రములఁ జిత్రించునపుడు వానికి మాతృకలుగా స్త్రీలఁ దమయెదుట నుంచుకొని వారిని వివిధాసనములఁ గూరఁజేసి తమ కిష్టములయిన రూపము లేర్పడి నప్పుడు వానిని లిఖింతురఁట. అట్టిస్త్రీలకు "నమోనాలు" (Models) అను సంజ్ఞ కలదు. నమోనాలుగానుండుటయే కొం దఱుస్త్రీల కీకాలమున జీవనాధారముగా నున్నదఁట. ఏయవ యవ మేరీతిగా నుండవలయునో యారీతిం జిత్రించుట కళాకౌశల మనియు నగ్నముగా నున్నపుడుగాని శరీరము నల్లు చిత్రించుట కవకాశ ముండ దనియుఁ గావున నగ్నరూప లేఖన ముచితమని యుఁ బాశ్చాత్య పండితుల మతము.

"కవిత్వవేదిగారు"కూడ నాంగ్లవిద్యాభ్యసన మొనర్చి పట్ట పరీక్షయం దుత్తీర్ణులయినారఁట. వీరి కాంధ్రవాఙ్మయమునం దభిరుచి కలదని వారిగ్రంథమే తెలుపుచున్నది. పనివడి యనేక గ్రంథములు శ్రద్ధాపూర్వకముగాఁ జదివినా రనుట నిస్సంశయ ము. గ్రంథగుణదోషనిర్ణయము సమబుద్ధితోఁ జేయుటయే వీరి ముఖ్యోద్దేశమని కూడఁ గనఁబడుచున్నది. కాని వీ రనుగమిం

చిన కొన్ని విమర్శనపద్ధతుల మూలమున నట్టినిర్ణయము కొన్ని కొన్ని పట్టులఁ దేలిపోయిన దని చెప్పవలసియున్నది. రామలింగా రెడ్డిగారికివలెనే వీరికిని బాశ్చాత్యవిమర్శన పద్ధతులయందుఁ బ్రీతి యధికము. తిక్కనసోమయాజి కవిత్వమును గూర్చి చర్చించుచు వీ రిట్లు వ్రాసిరి.

"తిక్కన యసాధారణపురుషపుంగవుఁ డని యతనిజీవితము ముందుగాఁ జరిత్రభాగమున వర్ణితములైన యతనిగుణములును స్థిరపఱుచుచున్నవి అతని జీవితమునాఁటి సాంఘికస్థితిలోని యౌన్నత్య మాతనికి సంక్రమించినది. అప్పటి శృంగారములోని పవిత్రత యాతనియందుఁ బ్రతిఫలించినది. ప్రతాపరుద్రుని శౌర్యము, గణపతిదేవుని రాజనీతి, విశ్వేశ్వరశివదేశికుని యాధ్యాత్మసంపద, తన వంశములోని ఖడ్గతిక్కన సాహసము, తన తాతలోని కవితారామణీయకము కవితిక్కనలోఁ గలిసినవి. భారతాంధ్రీకరణమున ఫలించినవి." అని.

తిక్కనసోమయాజి భారతమును దెనిఁగించినవాఁడుగాని మూలగ్రంథమును రచించినవాఁడు గాఁడు. భారతములోనిపదములే యాతనివి గాని భావములు పూర్వపువే. తెనిఁగించుటకే యాతనికిఁ "కవిత్వవేది" గారు వర్ణించినంత సాధనసామగ్రి కావలసియున్నచో మూలగ్రంథము రచించిన వ్యాసున కెంత సాధనసామగ్రి కావలయునో! అది యెక్కడనుండి వచ్చినదో, కవిత్రయముకంటె మిక్కిలి విపులముగా భారతమును దెనిఁగించుచున్న శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి కా సాధనసామగ్రి

యెక్కడనుండి వచ్చినదో, వాల్మీకి కా సాధనసామగ్రి యెట్లు లభించినదో.

శ్రీనాథుఁడు జారుఁడను జనశ్రుతినిగూర్చి చర్చించుచు "అతని పద్యములు, నతని భావములు స్వానుభవయుతములు నన్న (లన్న) చో నతని జంగమభక్తుఁ డని యున్నట్లే జారుఁ డనియును, ధూర్త శృంగారధౌరంధర్యము గలవాఁడనియు నొప్పుకొనక తప్పదు." అని చెప్పి "కృతిభర్తల మెప్పించుటకై శ్రీనాథుఁడు శృంగారాతిరేకము గలపద్యములను రచించియుండు నని నిశ్చయించి- అట్టిచో శ్రీనాథునిచాటువులు ప్రభుసముఖమున తత్ప్రీతికై రచింపఁబడిన వగుట కవినే జారునిగాఁ జేయఁజాలవు" అని సిద్ధాంతీకరించినారు. ప్రభువులప్రీతికై కవులు బూతుకవిత్వము చెప్పుదురనుమాట యటుంచి కేవలకవిత్వమునుబట్టి కవిస్వభావము నిర్ణయింపఁదలఁచుట సరియైనపద్ధతి కాదనుట నిర్వివాదాంశము. శృంగార రస మధికముగా వర్ణించినవాఁడు జారుఁ డనియు, వీరరసము హెచ్చుగా వర్ణించినవాఁడు శూరుఁ డనియు నిశ్చయింపవలయునా? అట్లయినచోఁ గరుణరసప్రధానుఁ డగు భవభూతి నేమనవలయును? నవరసభరితములగు మహాగ్రంథములు రచించిన వాల్మీకి వ్యాసాదుల నేమనవలయును? సృష్టికర్త యగు నీశ్వరునకువలెఁ గవితాసృష్టికర్త యగు కవీశ్వరునకుఁ గూడ సందర్భోచితముగఁ దత్తద్రసము లుద్భవములయి యాసృష్టియైనపిదప నవి యంతర్ధానమగును. రసములు కవులకు స్వతస్సిద్ధములు. వానికి మూలబీజములు వారల జీవితమం దుండవలయుననుట యపసిద్ధాంతము.

కాముకు లగు ప్రభువులప్రీతికై శ్రీనాథుఁడు శృంగారాతిరేకము గల పద్యముల రచియించి యుండునని "కవిత్వవేది" గారి యభిప్రాయము. రామలింగారెడ్డిగారుకూడఁ గృతిభర్తల యాదేశముచేతనే కవులు శృంగారప్రబంధముల రచించియుండురని యభిప్రాయపడుచున్నారు. శృంగారప్రియు లగు ప్రభువులు తమ కేయేవిషయముల వర్ణించుట యిష్టమో యావర్ణన లేరీతిగా నుండవలయునో తెలుపు సూచీపత్రముల (Syllabus) వ్రాసి యీయఁగా నాపత్రముల ననుసరించి కవులు గ్రంథములు రచించియుందురని యీవిమర్శకుల యభిప్రాయ మైనట్లు తోఁచుచున్నది. మన సంప్రదాయముల బొత్తిగా నెఱుఁగని కేవల పాశ్చాత్యపండితు లిట్లు దలఁచినఁ దలఁపవచ్చునేమోకాని మన మిట్లూహించుట సరికాదు. భారతమును దెనిఁగింపుమని రాజరాజనరేంద్రుఁడు నన్నయభట్టారకుని బ్రోత్సహించినట్లు కొందఱక్కడక్కడఁ బ్రభువులు కవులచేఁ గొన్నిగ్రంథములను లోకహితార్థము రచింపించియుండిన నుండవచ్చును. ప్రభువులలో శృంగారప్రియులు కొంద ఱుండిన నుండవచ్చును. సామాన్యముగాఁ బ్రభువులు కేవల శృంగారప్రియులనియు వారి యనుమతి ననుసరించియే శృంగారప్రబంధములు రచింపఁబడినవనియు సూచించుట యనుచితము. కృతులఁ బ్రభువుల కంకితముచేయు సంప్రదాయ మిది కాదు. పాఠశాలలలో విద్యార్థులు చదువుటకుఁ దగిన చిన్నచిన్న గద్యగ్రంథములు రచించుటయు, వానిని బఠనీయగ్రంథములుగా నిర్ణయించుటకై నిర్ణాయకసభలోని స

భ్యులను నిర్ణయమైనపిదప దమతమ పాఠశాలలలో నాగ్రంథ ముల నుపయోగించున ట్లుత్తరువు చేయుఁడని పాఠశాలాధ్యక్షుల నాశ్రయించుటయు నీకాలమునఁ జూచుచున్నారము. పూర్వ కవుల సంప్రదాయ మిది కాదు. తమకుఁ దోఁచినభంగిని గృతి యొనర్చుటయుఁ బిదప నెవ్వనికో తగిన వయన కిచ్చుటయు ననూచాన మయిన సంప్రదాయము. ఇది యిప్పటికిని వాడుక లో నున్నది. కృతి ధనికుల కంకితము చేయుట ధనాపేక్షచేతనే యనుట సత్యమె యగునుగాక! ధనికు లందుల కంగీకరించుట కృతిపతిత్వము యశోమూలమనియే కాని వేఱొక యుద్దేశము తోఁ గాదు. "సప్తసంతానములలోఁ బ్రశస్తిఁగాంచి, ఖిలము గాకుండునది ధాత్రిఁ గృతియకాన, గృతిరచింపుము మాకు—" అని కృష్ణరాయలు పెద్దనార్యునితో ననియెను. తంజావూరు సర్ఫోజీమహాలులోఁ దంజావూరి ప్రభువగు ప్రతాపసింహుని మంత్రివర్గములోనివాఁడగు ఖండోజీ కృతిపతిగాఁ గల "ఘటి కాచలమాహాత్మ్యము" అను పద్యకావ్య మొకటి గలదు. అది తెనాలి రామకృష్ణకవి రచించినట్లును, తగిన కృతిపతి దొరకక యట్టె యుంచినట్లును గొన్నాళ్లపిదప రామకృష్ణుని మనుమఁడా కావ్యమును ఖండోజీ కంకితము గావించినట్లును నందుఁ గలదు. కూచిమంచి జగ్గకవి తొలుత, చంద్రరేఖావిలాస మను ప్రబంధ ము నొక్కటి రచించి చింతలపాటి నీలాద్రిరాజునకు సమర్పించు టకై యాతని యొద్దకుఁ బోయెననియు నేకారణముచేతనో యారా జనాదరము చూపఁగా నలిగి జగ్గకవి యాకావ్యమును

జింపి వైచి "చంద్రరేఖావిలాప" మను దూషణగర్భితకావ్యము ను రచించె ననియు వాడుక గలదు. చంద్రరేఖావిలాప మిప్ప టికిని గలదు.

కవులు తమ యిచ్ఛానుసారముగాఁ గావ్యముల రచించి పిదప నెవ్వరికో యంకితముచేయుటే సర్వసాధారణమైన యా చారము. కవులు సాధారణముగా నిర్ధనులగుటచే ధనికుల నా శ్రయించినను, ఆధనికులు చెప్పుచేఁతలప్రకారమే కవిత్వము చె ప్పుచుండిరనుట న్యాయము కాదు. కవితాధార లోపల నుద యింపఁ దాని నాఁపఁజాలక "కవితా యద్యస్తి, రాజ్యేన కిమ్" ను భావముతోనే కృతులు నిర్మించుట సర్వసాధారణమైన యా చారమై యున్నది. ఇది నేఁటికిని జరుగుచునే యున్నది.

ఈనడుమ కోరాడ రామకృష్ణయ్యగారు రచించిన 'ఆం ధ్రభారతకవితావిమర్శన" మనుగ్రంథములోఁ గొన్నియపూర్వ సిద్ధాంతములు గనుపట్టుచున్నవి. వీరు ముఖ్యముగా విమర్శింపఁ దలఁచినది తిక్కనసోమయాజి కవిత్వము. దాని కవతారికగా నన్నయభట్టారకుని కవిత్వమును గుఱించి కొంత ముచ్చటించి యుండిరి. ప్రథమాంధ్రకవియును, సకలాంధ్రజనసన్మాన్యుఁడును, దిక్కనసోమయాజిచే "విద్యాదయితుం" డనిపించుకొన్నవాఁడు నగు నన్నయభట్టారకునియందును, ఆయన కవిత్వమందును, నేకారణముననో గాని రామకృష్ణయ్యగారికి నిరసనభావము కలి గినది. నన్నయభట్టు "వర్ణాశ్రమధర్మరక్షకుఁడును ధర్మమతో ద్ధారకుఁడు నగు ధర్మరాజునందుఁ బ్రత్యేకగౌరవము కలవాఁడై

పాండవోత్తములచరిత్రము వైదికదృష్టితోఁజూచి రచించినాఁ" డఁట. తిక్కనసోమయాజి "యద్వైతభావమునం దభిరుచి గల వాఁడై కావ్యకళాదృష్టితో భారతకథాభాగమును రచించె" నఁట. పాండవోత్తముల చరిత్రము "వైదికదృష్టితోఁ" జూచుట యన్న నేమో తెలియకున్నది. "అద్వైతభావమునం దభిరుచి" కలిగియుండుటకును, భారతమును, "కావ్యకళాదృష్టితో" రచించుటకును సంబంధముకూడ మృగ్యమే. ఇంకొకచోట నన్నయ రచనను గూర్చియే "ఇట్లు కాలానుగుణముగా భారతకృతి భర్తయొక్కయు కృతికర్తయొక్కయు నుద్దేశము లేకయె యాంధ్రభాషలో నితొలి రచన కొకవిధమగు వైదికతాగుణము నాపాదించినవి" యని వ్రాసిరి. భారతమునకు వైదికత యాపాదించుట యననేమో." నన్నపార్యుని నిరసించుటయుఁ దిక్కనసోమయాజిని బొగడుటయు నీయన కిష్టము. చూడుఁడు:—

నన్నయ రచించిన భారతమును తిక్కనార్యుఁడు చూచినను జూడకున్నను, మొత్తముమీఁద నాతఁడు ప్రారంభించిన భారతాంధ్రీకరణోద్యమమును కొనసాగించి తుద ముట్టింపవలయు నని మాత్ర మీతనికి దృఢసంకల్పము కలిగినది." అని యొకచోటను "హృదయాహ్లాదిత్వము, ఊర్జితకథోపేతత్వము, నానారసోభ్యుదయోల్లాసిత్వము" అను విశేషణములే భారతరచనాసందర్భమున నీతనిఁ 'తిక్కన సోమయాజి' దృక్పథమును మనకు సూచించుచున్నవి. ఈతనిది ముఖ్యముగా కావ్యకళాదృష్టి, రసమయమగు దృష్టియే గాని, నన్నపార్యుని సంహితా

రచనాదృష్టి, యాగఫలసంపాదనాదృష్టి, వైదికమతధర్మరక్షణ దృష్టియు మాత్రము గాదు. కావుననే నన్నపార్యుఁడు "జగద్ధితముగ" రచించిన మూఁడుపర్వముల జోలికిఁ బోక "బుధసంతోషంబు నిండార భారతామృతము కర్ణపుటంబుల నారఁ గ్రోలి యాంధ్రావలి మోదముం బొరయునట్లుగను మిగిలిన పదునేనింటిని తెనుంగుబాసను రచించినాఁడు" అని మఱియొకచోటను వచించినారు. తిక్కన సోమయాజి నన్నయభట్టారకరచితభాగతిభాగమును చూచియే యుండఁ డనియుఁ నాభాగమందుఁ బ్రబంధ శైలి కనుగుణము లగు కథలు లేవు. కావున వాని "జోలికిఁ బోలే" దనియు వ్రాసిన వ్రాఁత యెంతయు ననుచితము.

అం దాది దొడంగి మూఁడుకృతు లాంధ్రకవిత్వవిశారదుండువి
ద్యాదయితుం డొనర్చె మహితాత్ముఁడు నన్నయభట్టు దక్షతన్.

అని ప్రశంసించి మిగిలిన పదునైదు పర్వములను దాఁ దెనిఁగించెద నని ప్రతిజ్ఞ చేసిన సోమయాజి నన్నయకవిత్వమును చూచియే యుండఁ డని సూచించుటకూడ నసంబద్ధమే. ప్రబంధ శైలి కనువుగా లేకుండుటచే సోమయాజి మొదటి మూఁడు పర్వములజోలికిఁ బోలేదఁట. నలచరిత్రము, యయాతిచరిత్రము, హరిశ్చంద్రచరిత్రము, దుష్యంతచరిత్రము, శిశుపాలవధ, మొదలగు కథలతో నిండియున్న పర్వములు ప్రబంధ శైలి కనువుగా లేవఁట. విరాటపర్వము కొంతవఱకుఁ బ్రబంధ శైలి నున్నదిగాని మిగిలిన పదునాలుగు పర్వములుఁగూడ నాశైలి నున్నవా? నన్నయ యంతకుఁ బూర్వము మొదటి మూఁడుపర్వములు తెనిఁ

గించి యుండుటయే తిక్కన విరాటపర్వముతో భారతాంధ్రీకరణ మారంభించుటకుఁ గారణము. విస్పష్టమైన యీ కారణమును మఱచి యేవేవో లేనిపోని యూహలు కల్పించుకొని గాథ లల్లుట సరసపద్ధతి కాదు.

త్రిమూర్తులను నితర దేవతలను స్మరించినాఁడు గావున నన్నయభట్టు కేవల వైదికాచారపరాయణుఁడఁట. హరిహర నాథుని బొగడినాఁడు గావునఁ దిక్కన సోమయాజి కద్వైత భావము సిద్ధించిన దఁట. హరిహరుల కభేదము చెప్పినంతమా త్రముచేత నద్వైతి యగునా? అద్వైతసిద్ధాంతమునకు విషయ మైనది జీవేశ్వరాద్వైతము కాని శివకేశవాద్వైతము గాదు. శివానందలహరిలో శివస్తోత్రమును, లక్ష్మీనరసింహాష్టకములో విష్ణుస్తవమును విడివిడిగాఁ జేసెను గాన శంకరాచార్యు లద్వైతి కాకపోవలయునా? తమ గ్రంథములను హరిహరనాథున కంకితము చేసిన నాచనసోముని, వేంకటరాజును నద్వైతసిద్ధి గలవారన వలయునా?

శివాయ విష్ణురూపాయ శివరూపాయ విష్ణవే
శివస్య హృదయం విష్ణు ర్విష్ణోశ్చ హృదయం శివః.

అని ప్రతిదినము సంధ్యావందనములోఁ బఠించు బ్రాహ్మణు లందఱు నద్వైతసిద్ధియయినట్లేనా?

వేఁకోట రామకృష్ణయ్యగా రిట్లు వ్రాసిరి:—

"ఈతని (సోమయాజి) భారతమున కళాసౌందర్యమును, అద్వైతభావమును, చక్కని సమ్మేళనమును బొందినవి. నన్నప

ర్యుఁడు కేవల కర్మపర మగు వైదికదృష్టితోఁ గొంతభాగమును రచించినను, ఈభారతమును కృష్ణద్వైపాయనుఁడు, అద్వైతార్థ బోధకం బగునటులనే రచియించి యున్నాఁడు గాని మతవైషమ్యమును బెంచుటకుఁ గాదు.” అని.

కర్మకాండప్రతిపాదకములగు వేదము లుత్పన్నముగానుండ నిలిపిన వేదవ్యాసు “లద్వైతార్థబోధకం బగునటులనే” భారతమును రచించె నని రామకృష్ణయ్యగా రంగీకరించుట వ్యాసుల వారిపుణ్యము. వ్యాసులయుద్దేశమును, నన్నయభట్టు చెడఁగొట్టె నని చెప్పుటకుఁగా నిట్లు వ్రాసిరేమో తెలియదు. వ్యాసుఁడు మతవైషమ్యమును బెంచుటకు భారతమును రచింపలేదఁట. అద్వైతపరముగాఁ జెప్పినగ్రంథమునందు ద్వైతులకు విశిష్టాద్వైతులకు ద్వేషము కలుగదా! ఈవ్రాఁత యంతయు నిరాధారము.

నారాయణభట్టు నన్నయభట్టునకుఁ జేసిన సాహాయ్యమునుగూర్చి రామకృష్ణయ్యగా రిట్లు వ్రాసిరి.

“పరమ వివేక సౌరభవిభాసితములును, సద్గుణపుంజ వారిజోత్కరరుచిరంబులును, సకలగమ్యసుతీర్థములును, మనోహరసుచరిత్రపావనపయః పరిపూర్ణములునగు నత్సభాంతర సరసీవనంబులను గొనియాడి యావెంటనే భారతఘోరరణము యొక్క యారమ్యమును దెచ్చి నారాయణభట్టు సహాయముచే భారతసంహితఁ దెనుఁగున రచియించుట యను మహాత్కార్యము నిర్వహింపఁబడిన దనుటచే వివేకశూన్యులును, అసూయాపరత్వాది దుర్గుణపుంజ యుక్తులతోఁ గూడిన సత్పురుషులకగమ్య

ములగు మఱికొన్ని సభాంతరములయందు భారతసంహితను దెనుంగుచేయు విషయమగు వాదములు కలిగె ననియు నట్టిసందర్భముల నారాయణభట్టు నన్నయకుఁ దోడయి నిల్చి ప్రతిపక్షుల వాదంబున నోడించి కన్నడభాషావాఙ్మయ సాదృశ్యంబును దెలిపి దానివలెనే సంస్కృతభూయిష్ఠంబుగ సంస్కృతచ్ఛందోవృత్తమార్గమున భావరసాద్యలంకృతులతో నొప్పారిన సంస్కృతకావ్యంబులసరణి ననుసరించి రచించునట్లుగాఁజేసి యీకార్యభారమును నిర్వహించె నని యూహింపఁదగియున్నది." అని.

1. నన్నపార్యుని భారతరచనమును గూర్చి వాదములు జరిగెనఁట.
2. ఆవాదములలో నారాయణభట్టు నన్నయభట్టుపక్షముగా నుండి ప్రతివాదుల నోడించెనఁట.
3. ఇంతియకాక నన్నయభట్టునకు నారాయణభట్టు కన్నడవాఙ్మయసాదృశ్యమును దెలిపి దానివలెనే భారతమును రచించునట్లుగాఁ జేసి "యీకార్యభారమును నిర్వహించె" నఁట.

ఈవ్రాఁత పేరుమాత్రమే నన్నయభట్టుది కాని కావ్యమంతయు నారాయణభట్టు చేసె నని స్ఫురింపఁజేయవచ్చును. అది యసంబద్ధము. భారతరచనమునుగూర్చి వాదములు పుట్టె ననుట కాధారములు లేవు. రాజాపరమున నన్నయభట్టు తనయింటిలోఁ దాను వ్రాసికొనుచుండఁగా వాదము లేల కలుగవలెనో తెలియకున్నది. అట్టివాదములు పుట్టినను గ్రంథరచనమునకు

నభ్యంతర మెట్లు కలుగునో తెలియదు. నారాయణభట్టు నన్న పార్యునకుఁ "గన్నడవాఙ్మయసాదృశ్య"మును దెలిపెనఁట. అది వఱకాంధ్రవాఙ్మయమే లేనపు డాసాదృశ్య మెట్లు కలిగినది? ఆ "సాదృశ్యము" తెలియకపోవుట యాంధ్రగ్రంథరచన కభ్యంతర మెట్లగును? కన్నడమును జూచి భట్టారకుఁడు నేర్చుకొనవలసిన దేమో తెలియదు. ఛందస్సందురా? వృత్తము లన్నియు సంస్కృతమునుండి గ్రహించినవే. కన్నడములోఁ గూడ నావృత్తములే యున్నవి. కాని, కన్నడములోను, సంస్కృతములోను లేని వడి తెనుఁగునం దున్నది. జాతులా యంతకుఁబూర్వమే తెలుఁగునం దున్నవి. ఇఁక నారాయణభట్టు నన్నయభట్టునకు నేర్పిన కన్నడకవితాపద్ధతి యేదో తెలియకున్నది. నారాయణ భట్టు నన్నయభట్టు భారతము రచించునట్లుగాఁ జేసి యీకార్య భారమును నిర్వహించె" నఁట. ఇంత కార్యభారము వహించి నారాయణభట్టు గ్రంథమునఁ దనపే రేల పెట్టుకొనక చేతఁగాని నన్నయభట్టుపే రేల పెట్టెనో?

"నన్నపార్యుఁడు భారతాంధ్రీకరణ విషయక మగు నభ్యంతరముల నన్నింటిని దాఁటి నారాయణభట్టు సహాయము చేతను, రాజావలంబనముచేతను భారతభారతీసముద్రమును దరియంగ నీఁద మొదలుపెట్టెనే గాని తాను తుదిముట్ట నీఁది యావలిపారమును బొందలేకపోయెను. అతఁడు సూచించినట్లుగా నెట్లో 'విధాతృనకే' అనఁగా దరువాత సుమారు 200యేండ్లకు వచ్చిన 'కవిబ్రహ్మకే' యెట్లో సాధ్యమైనది గాని యితరులకు,

అధర్వణాచార్యులకుఁ గూడ సాధ్యము కాలేదు." అని రామకృష్ణయ్యగా రింకొకచోట వ్రాసినారు. ఈవాక్యములు నన్నయభట్టు భారతరచనము కొంతవఱకుఁ జేసి చేతఁగాక తక్కినది విడిచిపెట్టెనను ధ్వని గలుగఁజేయుచున్నది. ఇది యసందర్భపు వ్రాఁత. ఆంధ్రలోకమంతయు నేకగ్రీవముగాఁ గొనియాడుచున్న విద్యాదయితుని నిరసింపవలయు నను తలంపు రామకృష్ణయ్యగారి కెందువలనఁ గలిగెనో నే నూహింపఁ జాలకున్నాఁడను.

నన్నయభట్టు పిదపఁ జాలకాలమువఱకు భారతశేషము తెనిఁగింపఁబడకుండుటకుఁ గారణమును రామకృష్ణయ్యగా రిట్లు నిరూపించుచున్నారు.

"చాళుక్యకులావతంసుఁ డగు రాజనరేంద్రునితరువాత నాతనివలె నంత శ్రద్ధతో నీయుద్యమమును బ్రోత్సహించెడువారు లేకయుందురు. ఆకారణముచే నీయాంధ్రీకరణోద్యమమునకుఁ బ్రతిస్పర్థులై నిలిచి యింతకుఁబూర్వమే "ఘోరరణము" సల్పినవారి వాదబలమే మరలఁ బ్రబలము కాఁజొచ్చియుండును. ఒకప్రభువు తన యనుచరులలోఁ గొందఱికి యిష్టములేని కార్యమును దలపెట్టి తన యధికారబలముచేఁ గొన సాఁగించుకొనినను, అతఁడు గతించినవెంటనే ప్రతికక్షులోనివారు తరువాతిప్రభువును దమపక్షమునకుఁ ద్రిప్పుకొన యత్నించి వెనుకటికార్యమునకు విఘాతము గలిగించుటకు యత్నించుచుందురు. రాజరాజనరేంద్రుని యనంతరము నాతని యాస్థానమున నట్టి ప్రయత్నము జరిగియుండును." అని యొకచోటను— "12 వ శతాబ్దమున నీదే

శము భిన్నమతకల్లోలములకుం దావలమైనది. ఒకవైపు రామానుజుని వైష్ణవమతము విజృంభించి వీరవైష్ణవమై తక్కిన మతముల నణఁగఁద్రొక్క యత్నించుచుండెను. మఱియొకవైపున వీరశైవమతము బైలుదేఱి బౌద్ధమతముతోపాటు వైదికమతమునకుఁగూడ ప్రతిస్పర్థియై తద్వ్యాపనమును ప్రతిఘటింపఁ జొచ్చెను." ఇత్యాదిగా నింక నొకచోటను వ్రాసిరి.

ఈప్రసంగ మంతయు నిరాధారము లగు నూహాలతో నిండియున్నది. భాగతాంధ్రీకరణవిషయములో "ఘోరరణము జరిగినదనుట కాధారములు లేవు. ఆవిషయమై రణ మేలజరుగవలయునో తెలియకున్నది. మఱియు ద్రావిడదేశమందు బైలుదేఱిన వైష్ణవమతమును కన్నడదేశములో బైలుదేఱిన వీరశైవమతమును దెనుఁగువారు కవిత్వము చెప్పుకొనుట కభ్యంతరమేల కలిగింపవలయునో తెలియకున్నది. పాల్కురికి సోమనాథుఁడాకాలమునాఁటివాఁడేకదా! అతఁడు కవిత్వము చెప్పలేదా? నిరాధారములైన వ్రాఁతలు చరిత్రము లనిపించుకొనవు.



# ఆధునికాంధ్రవాఙ్మయవికాసవైఖరి.

———:(o):———

౫ వ అ ధ్యా య ము.

———:o:———

## భా వ క వి త్వ ము.

ఆంగ్లవాఙ్మయ సంపర్కముచే నాంధ్రవాఙ్మయము నందు గలిగిన మార్పులలో రెండు విమర్శింపవలసి యున్నది. గ్రామ్యవాద మొక్కటి. భావకవిత్వ మొక్కటియు. గ్రామ్య వాద మాంధ్రవాఙ్మయవృక్షమునకు వేరుపురుగువంటిది. అది ప్రస్తుత ముండనిచ్చి భావకవిత్వమునుగూర్చి చర్చింతము. ఇది యాంధ్రవాఙ్మయభూజమునకు నవ్యసురభిమంజరి యని భావ కవుల యభిప్రాయము. ఒకవిధమైన వెఱ్ఱితల యని మఱికొం దఱి యభిప్రాయము. దీనియథార్థస్వరూప మెట్టిదో విచారింతము.

ముందుగా శబ్దార్థము విచారింతము. భావకవిత్వ మన నర్థ మేమి? "భావముయొక్క కవితాస్వభావము భావకవిత్వ ము" అని యొక భావకవి నిర్వచించెను.(1) ఈనిర్వచనమున కర్థము నిర్వచనకారులే చెప్పవలసియున్నది. భావము గలకవిత్వ మనియు భావము ప్రధానమైన కవిత్వ మనియు సామాన్యార్థ మొకటి స్ఫురించుచున్నది. భావము లేనిది కవిత్వమే కాదు

---

(1) 1934 సం॥ జూలై నెల ప్రబుద్ధాంధ్రలో కవికొండల వేంకటరావు గారివ్యాసము చూడుడు.

గదా! భావకవిత్వ మన నేల యని దీని కాక్షేపము వచ్చుచు న్నది. ఈశబ్దమునకు వ్యతిరేకలక్షణచే భావహీన మైన కవిత్వ మని యర్థము చెప్పవలయునని కొందఱు విమర్శకు లనుచున్నా రు. భావుకవులలోనే కొందఱి కీపేరు గిట్టదట. "ఈనవీనకవి త్వం చేసేవారిలో శిరోమణి ప్రొఫెసర్ రాయప్రోలు సుబ్బా రావుగారు" ఈపేరు వాడవలదని యభిప్రాయపడుచున్నారట. కావుననే కాఁబోలుఁ గొంద ఱిటీవల దీనికి నవ్యకవిత యని పేరు పెట్టినారు. పే రేదిపెట్టినను వస్తు వదియే కదా!

సంప్రదాయసిద్ధ మైనరీతికంటె విలక్షణ మైనరీతిని గవిత్వ ము చెప్పుట యీనూతనకవుల యాశయమగుట స్పష్టము. ఈ నూతనరీతి కేవలనూతనరీతి గాదు. ఆంధ్రకవితారీతికంటె భిన్న మగు నాంగ్లకవితారీతిని బోలినది. ఇంచుమించుగా భావకవు లందఱును గొంచెమో గొప్పయో యాంగ్లభాషాపరిచయము కలవారే. ఆంగ్లవాఙ్మయములో కావ్యములు Epic poems అనియు Lyric poems అనియు రెండువిధములుగా విభజింపఁ బడుచున్నవి. ఇతి వృత్తము ప్రధానముగా నచ్చటచ్చట ననేక భావములు పొడచూపునట్లు రచింపఁబడు పెద్దకావ్యములు Epic poems అందురు. కథ ప్రధానము కాకుండ నేదో యొక భావము స్ఫురించునట్లు చెప్పు ఖండకావ్యముల Lyric poems అందురు. మనశతకములవలెనే యీఖండకావ్యములు సాధారణ ముగా భక్తిశృంగారకరుణరసముల వెలయించుట కనువుగా నుం డును. ఈయాంగ్లఖండకావ్యములే మనభావకవుల కాదర్శ

ములు. ఈయాదర్శము మొదటఁ గనిపెట్టినవారు మహాకవి రవీంద్రనాథఠాకురుగారు. ఈకవిశేఖరుఁడే మనభావకవుల కాచార్యుఁడు. రాయప్రోలు సుబ్బారావుగారు శాంతినికేతనమునకు వెళ్లి కొంతకాలము ఠాకురుగారికి శుశ్రూష యొనర్చినారు. కావున నాంధ్రభావకవిత్వము విమర్శించుటకుఁ బూర్వము రవీంద్రనాథఠాకురుగారి కవిత్వతత్త్వ మెట్టిదో తెలిసికొనుట యుచితము. ఠాకురుగారి మూలగ్రంథము లన్నియు బంగాళీభాషలో రచియింపఁబడినవి. బంగాళీభాషాపరిచయము లేని యస్మదాదుల కీమూలగ్రంథముల గుణాగుణములు విమర్శింప నలవు గాదు. కాని ఠాకురుగారికి లోకములో మహాకవి యను ప్రఖ్యాతి కలిగినది మూలగ్రంథమునుబట్టి యొనర్పఁబడిన యాంగ్లానువాదములను బట్టి కాని, మూలగ్రంథములఁబట్టి కాదు. ఈయనువాదములు గద్యరూపములు ఠాకురుగారొనర్చినవియే. ఈపని చేయుచుండినకాలములోఁ గవిగారు కొంతకాల మింగ్లాండులో నివాసముగానుండి యచ్చట నీయనువాదగ్రంథములకు మెఱుఁగుపెట్టి యచ్చువేయించినట్లు తెలియుచున్నది. ఠాకురుగారికి మంచి యాంగ్ల పాండిత్యము కలదు. వారి యాంగ్లగ్రంథముల శైలి మిక్కిలి మనోహరముగా నున్నది. లోకములో ఠాకురుగారికిఁ గలిగిన యశస్సున కంతకును నీయాంగ్లగ్రంథములే మూలము. వీరి మూలగ్రంథములలోని బంగాళీభాష గ్రామ్యమనియు గ్రాంథికవాదు లాగ్రంథముల నంతగా మెచ్చుకొన రనియు వినియున్నాఁడను. ఠాకురుగారికిఁ గవితాధార యేవిధముగా నుద్భ

వించి యేవిధముగాఁ బరిణతిఁ జెందినదో యించుక విచారిం తము. ఈవిషయమై కొంతకాలముక్రిందట Calcutta Review అనుపత్రికలో జయంతి కుమారదాసగుప్త యను నాయన యొక వ్యాసమును బ్రకటించిరి.(1) అందులోని ముఖ్యాంశముల నీక్రింద నుదాహరించెదను.

"సముద్రయాత్రచేయు నాచారము బంగాళాదేశమందు వ్యాపింపని కాలమందు రవీంద్రుని పితామహుఁ డగు ద్వారకానాథఠాకురుగారు ఇంగ్లాండు దేశమునకు వెళ్లి చూచి వచ్చినారు. రవీంద్రుని యన్నగారగు సత్యేంద్రనాథఠాకురుగారు ఇంగ్లాండులోఁ జదువుకొని Indian Civil Service అను రాజకీయోద్యోగిశాఖలోఁ జేరినారు. ఈయుద్యోగము సంపాదించుటలో బంగాళాదేశమం దీయనయే మొదటివాఁడు. జ్యోతీంద్రఠాకుర్ అను నీయనసోదరుఁడు ఫ్రెంచిభాషలోఁ బాండిత్యము సంపాదించి ఫ్రెంచిగ్రంథము లనేకములు బంగాళీభాషలోనికిఁ బరివర్తనము చేసినాఁడు. రవీంద్రనాథఠాకురుగారు చిన్నతనమునందే యాంగ్లభాషాభ్యాస మారంభించిరి. అక్షయచంద్రచౌదరి యనునాయన కవిగారి కాంగ్లకావ్యములు శ్రావ్యముగాఁ జదివి వినిపించుచు నాంగ్లవాఙ్మయమం దాయన కభిరుచి పుట్టించెను. ఆకాలమునం దీయన Goldsmith రచించిన Vicar of Wakefield అను నవలకును Shakespeare మహాకవి రచిం

(1) Reproduced in the Hindu of 1st May 1933 under the heading "The genius of Tagore, western influence in his poetry."

చిన Macbeth అనునాటకమునకును, ఉపాధ్యాయుల సాహాయ్యమున బంగాళీభాషానువాదము లొనర్చినారు. ఈకాలమం దీయనను "బంగాళీషెల్లీ" యని పిలిచెడివారు. అక్షయచంద్ర చౌదరియు, ప్రియనాథసేనుపండితుఁడును రవీంద్రనాథునకుఁ గవిత్వమందు గాఢమయిన యభిరుచిని బుట్టించినారు.

ఈకాలమం దీయన Moore, Burns, Byron, Shelly Tenny son, Shakespeare మొదలగు నాంగ్లకవుల గ్రంథములఁ గొన్నింటికి సరియైన బంగాళీగ్రంథములు రచియించెను. 1878_79 సంవత్సరములలో నాంగ్లవాఙ్మయమునుగూర్చియు, రషియాదేశపు వాఙ్మయమును గూర్చియు వ్యాసములు భారతి యను పత్రికలోఁ బ్రకటించెను. 1887 వ సంవత్సరములోఁ గవిగారు విద్యాభ్యాసమునిమిత్త మింగ్లాండునకుఁ బోయి లండను విశ్వకళాపరిషత్తులో గొప్పగొప్ప పండితులయొద్ద నాంగ్లభాషా కావ్యములు పెక్కులు చదివి యందలిరసము నాస్వాదించిరి. మొత్తముమీఁద నీయన యాంగ్లకావ్యరసమం దోలలాడె నని చెప్పవచ్చును. గీతాంజలిలోని కొన్నిభావములంబట్టి క్రైస్తవ మతమం దీయన కభిమానము కలదని కొంద ఱూహించుచున్నారు.

పాశ్చాత్యభావము లనేకము లీయనకృతులలోఁ బ్రతిబింబితములై యుండుటచేతను, ఆకృతులు సులభశైలిని పాశ్చాత్యభాషలోనికిఁ బరివర్తనము చేయఁబడియుండుటచేతను రవీంద్రనాథఠాకురుగారు ప్రాక్పశ్చిమ ప్రజాభావ ప్రపంచముల

రెంటికి సంధికర్తయని చెప్పనొప్పును. పాశ్చాత్యకావ్యభావము లీయనకు బాల్యమునుండి యలవడియున్నను, ఆభావములే యాయనకృతులలోఁ దఱచుగాఁ గాన్పించుచున్నను, ఈయన కేవల పాశ్చాత్యకవియై పోలేదుసరిగదా స్వీయభావములఁ ద్యజించి కేవల పరభావములనలవఱుచుకొనుట తప్పనికూడ నీయనమతము.

ఇంతవఱకు దాసగుప్తగారి వ్యాసతాత్పర్యము. 1933 వ సంవత్సరము డిసెంబరునెలలో ఠాకూరుగారు సికింద్రాబాదులో "విద్యార్థులకు సందేశము" అనుపేర నిచ్చిన పెద్దయుపన్యాసమొక్కటి వార్తాపత్రికలలోఁ బ్రకటింపఁబడినది. ఆయుపన్యాసములోని ప్రస్తుతాంశములకు సంబంధించిన భాగముల గొన్నింటి నీక్రింద నుదాహరించుచున్నాఁడ.(1)

"పాశ్చాత్యసంపర్కమువలనఁ గలిగిన నైచ్యానుసంధానబంధమునుండి విడిపించుకొని మనము కేవలాకించనులము కామని సమర్థించుట మనకుఁ గర్తవ్యము. మన యింటిలోనే మనము చక్కగా వెదకినయెడల ననశ్వరములయిన వస్తువులఁ బడయఁగలము. ఆవస్తువులవలన మనము కృతార్థుల మగుటయేగాక యితరులను గూడఁ గృతార్థులను జేయఁగలుగుదుము. పాశ్చాత్యుల ననుకరించుట కర్తవ్యమని మనలోఁ గొందఱు తలఁచుచున్నారు. అది నాకు సమ్మతము కాదు. కేవలానుకరణము

(1) Published in the Hindu of 25th December 1933 under the Head. "A message to student"– Dr. Tagore's address in Hyderabad.

నిర్జీవవస్తులక్షణము. పాశ్చాత్యనిర్మాణములు పాశ్చాత్యులకు సహజములు కావున వారికే తగియుండును. పాశ్చాత్యప్రకృతి వేఱు మనప్రకృతి వేఱు. తత్తద్దేశీయభావసంపత్ప్రవాహములు విడివిడిగాఁ బోయి సకలదేశభావసముచ్చయ మహాంబుధిలోఁ జేరును. అస్మద్దేశీయప్రవాహమును గనిపెట్టి దానినే మన మనుసరింపవలయును." × × × ×

"అత్యంతేదానీంతనవాదులు మనదేశము పూర్వచరిత్రము శూన్యమనియు నందు మనము గ్రహింపవలసిన విషయ మేమియు లేదనియు భావించుచున్నారు. అది పొరపాటు. అప్పుడప్పు డాయా దేశములందు బయలుదేఱిన నూతనవికాసవృక్షము లాయాదేశములందుఁ బూర్వనిక్షిప్తములై యున్న బీజములఁ బట్టి యుత్పన్నములైనవే గాని పరదేశమునుండి దిగుమతి యైన విత్తనములవలనఁ బుట్టినవి కావు. మనదేశము పూర్వకాలమందు గర్భదరిద్రమై యుండలేదు. మనపూర్వులు మనకై సంపాదించి పెట్టిన నిధానము లున్నవి. అవి తెఱచి చూచినయెడల నందు మనకుఁ గావలసిన భాగ్యమంతయు దొరకును. మనము పరుల యిండ్లకుఁ బోయి వారు పెంటకుప్పలపై బాఱవైచిన ముఱికిగుడ్డపేలికల నేఱి తెచ్చుకొననక్కఱలేదు."

ఇది ఠాకురుగారు చెప్పిన మాటలభావము. పూర్వవయసునందు పరకీయభావసంపదనే యారాధించుచుండిరను ప్రఖ్యాతి గల ఠాకురుగా రుత్తరవయసునం దీరీతిగా నుపదేశించుట గొప్ప విశేషము. దేశవ్యవస్థల నన్నింటిని దాఱుమాఱుచేసినఁగాని దే

శము బాగుపడదని యూహించు దేశాభిమానులందఱును ఠాకు రుగారి యీవాక్యముల నాప్తవాక్యములనుగా గ్రహింతురు గాక.

నేను పాశ్చాత్యవిద్యలను, పాశ్చాత్యభావములను సర్వథా నిరాకరింపవలయు ననువాఁడను గాను. విద్య యెక్కడను న్నను గ్రాహ్యమే. కాని, యావిద్యను సంపాదింపఁగోరువాఁడు తన కెంతవఱకది యుపయోగించునో, ఆవిద్య యిదివఱకే తన కుపలబ్ధమై యున్నదేమో యనువిషయముల విచారించుకొనవల యును. ఠాకురుగారు చెప్పినట్లు మనపూర్వులు సంపాదించి కొట్లలో నింపియుంచిన ధనమును మనము చూడక, ఆకొట్లతలుపులు తెఱవనైనఁ దెఱవక యాధనము లేదనుకొని యన్యులయింద్లకుఁబోయి మాధుకర మెత్తుట నీచకార్యము. మనకు లేని వస్తువునుగదా మన మితరులను యాచింపవలయును? ఉన్నదేదో లేనిదేదో తెలియక యాచనావృత్తియే ప్రధానముగాఁ దిరుగుట స్వాభిమాన పురుషలక్షణము గాదు.

కవిత్వము విషయములో ముఖ్యముగాఁ బాటింపవలసిన విషయ మొక్కటియున్నది. ఏభాషయందైనను గవులభావములకును ఆభావములను వ్యక్తపఱచుట కాకవులు ప్రయోగించు శబ్దములకును సాహచర్య సంబంధ మొకటి యేర్పడియుండుటచే నాయాశబ్దము లుచ్చరించినతోడనే యాయాభావములు విను వారి మనసునకుఁ బట్టును భావము లీరీతిగాఁ జప్పున మనసునకు స్ఫురించినప్పుడే కవిత్వము హృద్య మగును. అట్టి సాహ

చర్యసంబంధము లేమిచే నొకభాషలోని భావములను వేఱొక భాషలో వివరింపవలయునన్న నదికష్టసాధ్య మగుపని. ఆంగ్లకవిభావముల నాంధ్రకవితారూపమున వివరింపవలయు నను కవులాంధ్రభాషయందును వాఙ్మయమందును జక్కని ప్రవేశము గలవా రయి యుండి యాంగ్లకవి భావముల నాంధ్రులకుఁ బరిచితములైన భావములకుఁ గొంచెము చేరువుగా నుండునట్లు మార్చి యాంధ్రకవిసంప్రదాయానుసారముగా రచనచేయవలయును. అట్లు చేయనిచో భావములకును భాషకును బొత్తు కుదురక, అపుష్టార్థాసమర్థనేయార్థాది పదదోషములును సహచరచ్యుతసంశయాద్యర్థదోషములకును బట్టగును. భావకవిత్వమందిట్టిదోషములు తఱచుగాఁ గన్పట్టుచున్నవి. భావకవులలోఁ జక్కని యుభయభాషాపరిచయము గలవారు కొందఱున్నారనుట నిస్సంశయము. కాని యట్టిపరిచయము తక్కువగలవారు కూడఁ గలరు. ఇట్టివారే యధికముగా నున్నారని కొందఱ యభిప్రాయము.

భావకవిత్వమందుఁ బెక్కుమందికి స్ఫురించుచున్న పెద్ద దోషము భావాభావము. అనంతపంతుల రామలింగస్వామి పంతులుగారు రచించిన "శుక్లపక్ష" మనుఖండకావ్యమంజరియందీదోషము రసవంతముగాఁ జిత్రింపఁబడినది. దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి "కృష్ణపక్షము"నకుఁబోటీగా రామలింగస్వామిగారు తమకృతికి శుక్లపక్షనామకరణము చేసినట్లు కనఁబడుచున్నది. భావకవిత్వమును నిరసించుటయే యీకృతి ముఖ్యోద్దేశము.

కవులపేళ్లు తలపెట్టక వారికవిత్వములయందుఁ దనకుఁ దోఁచిన దోషముల మృదురీతిని గవి వర్ణించెను. ఈమంజరియం దెనిమిది పుష్పములు గలవు. వానిలో "భావతురంగము" "భావకవి" యనునవి ముఖ్యములు.

భావతురంగములోని యితివృత్త మేమన:—

కవి తా నొక చిన్నకావ్యమును రచించి దాని కేపేరు పెట్టుదు నని యోజించుచుండఁ దనపేరిటివాఁ డగు తెనాలి రామలింగకవి ప్రత్యక్షమయి "భావతురంగ" మను పేరు పెట్టు మని చెప్పి తన్నామౌచిత్యము నిట్లు వివరించెను. రాయ లొకప్పుడు కొలువు తీర్చియుండఁగా నొక చిత్రలేఖకుఁ డశ్వచిత్రపట మొకటి తెచ్చి యిచ్చెనఁట. రాయ లది చూచి మెచ్చుకొని యిట్టి చిత్రములు వ్రాయువా రీసభలోఁ గలరా యని యడిగెనఁట. అంతట రామలింగకవి లేచి యాచిత్రము నిటు లాక్షేపించెనఁట.

చ. తగులదు మెత్తగాఁ దరిసి తాఁకిన, భీతిఁ గలంగఁ జేయఁగా
నెగురదు, కొంచెమైన సకిలింపదు, వాలము త్రిప్ప దిట్టి ద
శ్వగణమునందు నున్న సగపాలు గనంబడ దెట్టిచిత్ర మీ
పగిదివి చిత్రచిత్రములు వందలు వేలు రచింపకుందునా.

గీ. అనఁగ వసుధేశుఁ డాడె నాకంత నిటులు
భావనము చేయవలెఁ జిత్రపటము దెలియ
భావశూన్యున కది హృద్య భావ మొసఁగు
నీకళాపరమరహస్య మిది నిజమ్ము.

రాయ లిట్లన రామలింగకవి తానును జిత్రరచన చేయు

దునని చెప్పి కొలువుకూటములో నొకగోడమీఁద మసితో నేవే వో పిచ్చిగీఁతలు గిసి, రాయ లది చూచి గోడ పాడు చేసితి వని యాక్షేపింపఁగా నాయన కిట్లని సమాధానము చెప్పెనఁట—

“ భావనము చేయవలెఁ జిత్రపటముఁ దెలియ
భావశూన్యుల కది కద్యభావ మొసఁగు
నీకళాపరమరహస్య మిది నిజమ్ము ”

*　　*　　*　　*　　*

కచబంధచ్యుత కేశలేశ మొకచోఁ గన్పట్టఁ దన్నైల్యమున్
రుచులం దత్పరిమాణమెంచి యది యేలోలాక్షిదో యామె నే
రుచు విద్యావిభవంబు లెట్టివొ వయో రూపంబులే పాటివో
వచనం బెట్టిదొ పోల్చు నాతఁడె కళావైదగ్ధ్యసంపూర్ణుఁడౌ.

అని చెప్పి తాను జిత్రించినచిత్రమును భావించు విధము నిట్లు విశదీకరించెనఁట.

“గండుమై గఱులెత్తి కొండ లుద్దండత
నెగురుచున్నటులు భావించుకొనుము
బ్రహ్మాండ భాండార్తి వాప నిర్జరులింద్రు
వేఁడుచున్నటులు భావించుకొనుము
ఇంద్రుఁ డుచ్చైశ్శ్రవంబెక్కి వజ్రాయుధం
బెత్తి పోవునటు భావించుకొనుము
చిత్రంబునందు విచిత్రంపు మసిపూఁత
యే మబ్బులంచు భావించుకొనుము
అట్టి మబ్బులఁ జొచ్చిన యామహేంద్రు

వాజి వాలాగ్ర మిా కనఁబడెడు తెలుప
టనుచు భావించుకొను మింక వినుము దీని
పేరు భావ తురంగంబు ధారుణీశ."

ఇది విని నవ్వి సత్కృతికిఁ బ్రయోజన మానందము గావున, గా మలింగకవిచిత్రము మూలమునఁ దన కానందము కలుగుటం బట్టి యది సత్కృతియే యని రాజు పల్కెనఁట—

కవిభావమును సూచింపఁగల సాధనసామగ్రి భావకావ్యములలో లే దనుటయే యీ భావతురంగము తాత్పర్యము.

భావకవిభావము భావకవికే తెలియదని నిరూపించుటకై "భావకవి" యను కృతి రచింపఁబడియెను. ఈకృతిలో ముందుగా భావకవి తన స్వరూప మిట్లు వర్ణించుకొనెను.

చ. "ఇరువది యేండ్లదాఁక పఠియించితి నాంగ్లము పాఠశాలలన్
దరుగ ధనంబు దేహబలదర్పము లన్నియు నాఁడునాఁటి కా
ఖరునకు నందుఁ బాండితి తగం గనిపింపకపోయె నింక నే
వెఱుఁగనుసంస్కృతంబదిమహింగలిలోమృతభాషయాటచేన్"

"ఆంగ్ల విద్యాభ్యసనమున నైన కాల
మందు నగపాలు దేశభాషైకశిక్ష
నైన సంపూర్ణపాండిత్య మమరకున్నె
యని వినుచు వాద మేను మెచ్చను రవంత.

"అవిరళపాండితీప్రతిభ యన్నది ప్రాప్తము కాకపోయినన్
లవమగు లాభమేమియయినం గణుతింపఁగ లేకపోయినన్
నవనవహూణకావ్యపఠనంబున నిక్కము దాఁపనేల నేఁ

గవి ననిపించుకొంట కొక కాంక్షజనించెఁ గ్రమక్రమంబుగన్.

"సంస్కృతాంధ్ర కవిత్వరచనమునందుఁ
గోటి నియమంబు లుండుటఁ గోటి కొక్కఁ
డాపనికిఁ బూనుకొనుచుండె నాంగ్లమందు
నట్లు గాకుంట హూణులం దధికకవులు.
"కైతకును గట్టుపాట్లకు జ్ఞాతి వైర
మౌటఁ బ్రాచీన కవన మాహ్లాద మిడదు,
కానఁ గైతను నియమాలు గంగఁ గలిపి
యతి నిరంకుశకవులనే ననుగమింతు.

* * * * *

"వ్రాయఁగా వ్రాయఁగా నగు వ్రాఁతకాఁడు
పాడఁగాఁ బాడఁగా నగుఁ బాటకాఁడు
కైతఁ జెప్పంగఁ జెప్పంగఁ గవియుఁ గానఁ
గవి గరుత్మంతుఁడను గానొ కడఁగి తుదకు.
"హూణభాషను గవినౌట కూహ లేదు
సంస్కృత కవిత్వ రచనాప్రసక్తి కలుగ
దాంధ్రునిగఁ బుట్టుటను దెనుఁగాడనౌను
కాన నే నాంధ్రకవి నౌటయే నిజంబు.

అని తన కవితావిర్భావసరణి వివరించి భావసంపదనుగూర్చి యిట్లనియె.

"నీదు పద్యభాష నే నెంతగనినను
భావ మొక్కఁడేని బయలుపడదు

నీవ నీదు పద్యభావమునను మన
నెల్లిదముగ నగుచు నిట్లులందు.

* * * * *

"భావావేశసమయమున
నేవేవో వ్రాసినాఁడ నిపు డడుగఁగనే
నేవిధిఁ దెలుపుదు నీవా
భావావేశంబు నొంది భావింపఁదగున్."

భావకావ్యములభావ మితరులకుఁ దెలియకుండుట యటుండఁ గావ్యకర్తలకే తెలియదని దీనిభావము.

భావకృతులలోఁ గొన్ని మంచివి లేకపోలేదు, గాని పెక్కులు రామలింగముపంతులుగారు చేసిన యుపహాసమునకుఁ బాత్రము లనియే పలువుర యభిప్రాయము.

"శుక్లపక్షము"ను గూర్చి యభిప్రాయ మిచ్చుచు శతావధాని చెళ్లపిళ్ల వెంకటశాస్త్రులుగా రిట్లు వ్రాసినారు:—

"ఇప్పుడు కొలఁదికాలమునుండి కవిత్వమున నొకక్రొత్త పోకడ ప్రారంభమైనది. పలువురు యువకు లాపోకడనే రచించుచున్నారు. ఆ రచనలభావమును గ్రహించుట సామాన్యులకే కాదు, పెద్దపెద్ద వ్యాఖ్యాతలకును దురవగాహముగనేయున్నది. ఇంతియకాదు.

"జీవతః కవేః ప్రష్టవ్యమ్" అని తెలిపి గ్రంథకర్త యొద్ద కరిగి దీనిభావ మేమన నా కేమితెలియును. నీవే చూచుకొమ్మనుట కూడ ననుభూతమగుటచే నీకవిత్వ మేల యుద

యించుచున్నదో చెప్ప వీలులేకున్నయది." అని.

"భావకవిత లనఁబడు నేఁడు బయలువెడలుచున్న ఖండకావ్యములలో ననేకము లభిప్రాయావేదకశబ్దసామగ్రీపూర్ణములు కాక యర్థవ్యక్తిగుణభూషితములు కాకున్నమాట నిజమే" యని వరుఖల చినసీతారామస్వామిశాస్త్రులుగారి యభిప్రాయము. ఇటులే యనేకు లితరులుగూడఁ దలంచుచున్నారు. కొంతకాలముక్రిందట నాంగ్లభాషాపరిచయముగల యాంధ్రకవులు కొందఱు రవీంద్రనాథఠాకురుగారు రచించిన గీతాంజలిలోని కొన్నిపద్యముల భావము గ్రహింపఁజాలక కవిగారినే యడుగ నావేశములో నున్నప్పు డేభావముతో నాపద్యములఁ జెప్పితినో యిప్పుడు చెప్పఁజాలను. ఈపద్యముల కిప్పుడు నేఁ జెప్పెడియర్థముకంటె మీరుచేసికొనెడియర్థమే చక్కగా నుండవచ్చునని సమాధానము చెప్పినారఁట. భావకవు లీరీతి ననుసరించుచున్నట్లున్నది. ఈభావమునే పాశ్చాత్యపండితుఁ డొకఁ డిట్లు వివరించుచున్నాఁడు :—

It is a mistake, therefore, to ask a poet to explain his poems. That is to make the wrong approach to poetry, to knock at the wrong door. This amotional unity which is the *raisond etre* of every poem. Cannot be measured by the instruments of reason. Otherwise it would be simple to express it in prose. The poem must be received directly, without questioning, and loved or hated. It has a necessary and eternal existence; it is impervious to reason, and if it has no discoverable

meaning, it has immeasurable power. The poet has created an objective equivalence in words, of his emotional experience; the words may not make sense but they make the emotion–follow the contour of the thought–and reproduce as nearly as possible, "the mind's internal echo of the imperfect sound."(1)

“కావ్యార్థము చెప్పుమని కవి నడుగుట తప్పు. కావ్యార్థము తెలిసికొనుమార్గ మదికాదు. కావ్యములోని భావము వివేచనశక్తిచే గ్రహింపఁదగినది కాదు. అట్టిదయినచో వచనరూపముగాఁ దెలుపుటయే యుచితముగా నుండును. ఆమోదించినను నిరాకరించినను గావ్య మున్నది యున్నట్లు గ్రహింపవలయును గాని దానిని బరీక్షింపఁగూడదు. అర్థము స్ఫురింపక పోయినను దానియం దతిగంభీరమయిన భావ ముండును. కావ్యములోని పదముల కర్థము లేకపోవచ్చును. భావముండకపోదు,” అని దీనిభావము.

ఇదియే సిద్ధాంతమైనచో నున్మత్తప్రలాపములును శిశుజల్పితములును గూడఁ గావ్యములే కావలసివచ్చును. తన కవిత్వము తనకే తెలియక యితరుల కంతకంటెఁ దెలియవక్కఱలే కున్నచోఁ గవిత్వము కానిశబ్దమే యుండదు. కవిగాని పురుషుఁడే యుండఁడు. ఈ కవితాలక్షణ మపూర్వము. నేఁటి యపూ

(1) Extract from Mr. Herbert Read's paper headed obscurity in poetry—is it a Vice—published in the Book man and reproduced in the " Hindu " of 29th October 1933.

ర్వాకవితకుఁ దగినట్లున్నది. కవికిఁ గవితావేశము కలుగుననుట యుచితమే కాని యాయావేశ మొడలెఱుఁగని సివమువంటి దన రాదు. నన్ను నేనే యెఱుఁగను నిన్నేమియెఱుఁగుదు నన్నట్లు చెప్పినకవితను జూచి ముక్కుడులవలె భావకవులు తమలోఁ దామె యానందింపవలయును గాని యవి పరుల నామోదింపఁ జేయఁజాలవు.

ఉత్పత్స్యతేహి మమ కోపి సమానధర్మా
కాలోహ్యయం నిరవధి ర్విపులాచ పృథ్వీ.

అని కూడ వీరనుకొనుట కవకాశ ముండదుగదా! ఏపని చేయువానికైనను నావేశము పుట్టవచ్చును. దొంగకు చౌర్యావేశము, తిట్టఁబోతునకు దూషణావేశము, దెబ్బలాడువానికిఁ గలహావేశము ఇత్యాదు లూహ్యములు. ఏపనిచేసిన, నావేశము కొంత యుండినఁగాని యాపని పట్టుదలతోఁ జేయుట తటస్థింపదు. పామరస్త్రీలు తీవ్రముగాఁ బోట్లాడుకొనుట పెక్కురు చూచియుందురు. ఆపోట్లాటలు బండబూతులతోడను, గరచరణాద్యవయవవిక్షేపములతోడను నిండి యావేశపూరితములయి యుండును. ఇందు వీరరసము అంగి. బూతులలో నిమిడియున్న పచ్చి శృంగారము, అంగము. ఆవేశభూయిష్ఠంబును రసద్వయవిశిష్టంబు నగు నీకలహావాదమును గూడఁ గవిత్వమనవలయునా? ఆవేశమే ప్రధానమైనచో నున్మత్తుని యావేశ ముత్తమము. ఒకానొకపట్టణములో నొకానొక బ్రాహ్మణుఁడు గలఁడు. అతఁడాంగ్లవిద్య నభ్యసించి బి. ఏ. పరీక్షలో నుత్తీర్ణుఁడైనపిదపఁ గొన్ని

ళ్లకుఁ బిచ్చివట్టెను. ఆపిచ్చి యొకలెఱుఁగని సివము వంటిదే. ఆతఁడు తనలోఁదాను గొణఁగుకొనుచు నుండి యుండి తటాలున నెవ్వఁడో తన్నెదుర్కొనినట్లు భావించుకొని వానిని పడఁదిట్టి కొట్టిన ట్లభినయించును. కన్నులెఱ్ఱవడును. ఒడలు కంపించును. నాలు గైదునిమిషము లిట్లుచేసి శాంతించి తిరిగి తనలోఁ దాను గొణఁగికొనుచుండును. ఈప్రకారము గంటకు రెండుమూఁడు సారులయినఁ జేయుచుండును. ఈయున్మాదావేశ మవ్యాజమైనది యనుటకు సందేహము లేదు. దీనిని గవిత్వమనవలయునా?

ఇది యటుండ నావేశవిడంబనములు కూడఁ గలవు. ఒక యూరిలో నొక హరిదాసు గలఁడు. అతఁడు హరికథఁ జెప్పుచు నడుమనడుమ భక్త్యావేశము వచ్చిన ట్లగపడి యొడలెఱుఁగక క్రిందఁ బడిపోవును. అప్పు డిద్దఱుముగ్గురు భక్తు లాతనిని బడకుండఁ బట్టుకొన నింకొకఁడు కర్పూరహారతి యిచ్చును. కొంత సేపటి కాయన జాగ్రదవస్థలోనికి వచ్చును. ఆయన చెప్పు ప్రతి హరికథయందును రెండుమూఁడుసారు లిట్లు జరుగును. ఇది నిజమైన భక్త్యావేశ మని తొలుత ననుకొనుచుండిరి గాని పిదప నదియంతయు విడంబన మని యెల్లరకుఁ దోఁచినది. నిజమైన కవితావేశ మెవ్వరికైన నున్నదేమోగాని యీనాఁటి భావకవు లనుకరించు నావేశ మిట్టిదియే.

నవరసభరితం బైన మహాకావ్యము షడ్రసోపేతమైన యాహారమువంటిది. ఏకరసాత్మకమయిన ఖండకావ్య మట్టియాహారమం దొక్క పదార్థమువంటిది. ఇప్పుడు బయలుదేఱుచున్న

భావకావ్యములలో నిట్టివి కొన్ని గలవుగాని యనేకములు భావలేశమాత్ర ప్రధానములై యొకమాఱు చప్పరించి పాఱవేయవలసిన పదార్థములవంటివే.

కొంతకాలమునుండి వంగదేశీయులే మన కాచార్యులుగా నున్నారు. బ్రహ్మసమాజమతము వంగదేశమం దుద్భవమైనదే. రాజకీయవ్యవస్థలలో లాల్మోహనఘోసు, సురేంద్రనాథబెనర్జీ, బిపినచంద్రపాలు ప్రభృతులు మన కుపదేశికులుగానుండిరి. ఇప్పుడు చిత్రకళయందును గవిత్వమునందును గూడ వంగదేశజులే మన కాదర్శములుగా నున్నారు. రెండును దురవగాహముగానే యున్నవి.

వివిక్త ప్రదేశమునందుఁ గూరుచుండి చదివికొన్నప్పుడు పదములకూర్పుచేతఁగాని భావసంపదచేతఁగాని హృదయానందము కావించునదిగదా పద్య మనవలయును. అట్టి పద్యములం గొన్నంటి వినుఁడు—

"నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు కృపారసంబు పైఁ
జల్లెడువాఁడు మౌళిపరిస్ఫురితపింఛమువాఁడు నవ్వురా
జిల్లెడుమోమువాఁ డొకఁడు చెల్వలమానధనంబుఁ దెచ్చెనో
మల్లియలార మీపొదలమాటున లేఁడుగదమ్మ చెప్పరే.

"చెలియా కృష్ణుఁడు నన్నుఁ బాసి వనముం జేరంగ నయ్యాక్షణం
బులు నాకన్నియుఁ జూడఁ జూడఁ గడునాపూర్ణంబులై సాగిలో
వలఁ దోఁచుం బ్రహరంబులై దినములై పక్షస్వరూపంబులై
నెలలై యబ్దములై మహాయుగములై నిండారుఁగల్పంబులై.

" చెలికాఁడ రమ్మని చేరు నొక్కొకవేళ
మన్నించు నొకవేళ మఱఁది యనుచు
బంధుభావంబునఁ బాటించు నొకవేళ
దాతయై యొకవేళ ధనము లిచ్చు
మంత్రియై యొకవేళ మంత్ర మాదేశించు
బోద్ధయై యొకవేళ బుద్ధిచెప్పుఁ
జనవిచ్చి యొకవేళ సారథ్య మొనరించుఁ
గ్రీడించు నొకవేళఁ గేలిసేయు
నొక్క శయ్యాసనంబున నుండుఁ గన్న
తండ్రికైవడిఁ జేసినతప్పుఁ గాచు
హస్తములఁ బట్టి పొత్తున నారగించు
మానవాధీశ మాధవు మఱపురాదు.

ఇత్యాది పద్యములంబోలుట యటుండ వానికిఁ జేరువుగానైన నుండఁదగిన పద్యంబు లున్నచో భావకవిత్వము సంభావనీయ మగును.

---

# ఆధునికాంధ్రవాఙ్మయవికాసవైఖరి.

:(o):

## ౬ వ అ ధ్యా య ము.

:o:

### గ్రామ్యవాదవిమర్శనము.

గ్రంథములయందు నేఁటివఱకు నుపయోగింపఁబడుచున్న నలక్షణాంధ్రభాష కడుఁ బ్రాచీన మగుటచే నేఁటియాంధ్రులకు దురవగాహముగా నున్నదనియు, నాభాషను విడిచిపెట్టి యక్షరాస్యు లగునాంధ్రులు పరస్పరసంభాషణమందు వాడుచున్న వ్యావహారికభాషయందే యిఁకముందు గ్రంథములను రచియింపవలయు ననియు, నట్లు చేసినఁగాని గ్రంథములు సామాన్యజనులకు సుబోధములుగా నుండవనియు నొకవాద మిటీవలఁ బుట్టినది. ఈవాదము నవలంబించువా రంగీకరించెడి వ్యావహారికభాష వ్యాకరణశాస్త్రదృష్టిచే గ్రామ్య మగును గాన నీవాదము గ్రామ్యవాద మన నొప్పు.

ఈవాద మించుమించుగా నిరువదియైదుసంవత్సరముల క్రిందటఁ బుట్టినది. తొలుత నీవాదమును బ్రతిపాదించినవారిలో విశాఖపట్టణవాస్తవ్యులగు పి. టి. శ్రీనివాసయ్యంగారును, విజయనగరనివాసులయిన గురుజాడ అప్పారావుగారును, పర్లాకిమిడిలోనుండు గిడుగు వేంకటరామమూర్తిగారును ముఖ్యులుగా నుండిరి. వీరిలో రామమూర్తిగారు నేఁడుగూడ నీవాదమ్మును

వ్యాపింపఁజేయుటకై యత్నము చేయుచునే యున్నారు. తక్కిన యిద్దఱును దివంగతులయినారు. ఈనూతనవాదు లల్పసంఖ్యాకు లయ్యు నప్పుడు పాఠశాలాపరీక్షాధికారి (Inspector of Schools) గానుండిన యేట్సు (Mr. Yates) మహాశయుని సాహాయ్యమును సంపాదించి వ్యావహారికాంధ్రభాష కాధునికాంధ్రమని పేరుపెట్టి యది యాధునికాంగ్లభాషవంటిదని విద్యాశాఖాధికారి (Director of Public Instruction) గారికి నచ్చఁజెప్పి మాధ్యమికపాఠశాలోత్తమపరీక్షకు (Secondary School Leaving Certificate Examination) బోవు విద్యార్థులాంధ్రభాషావ్యాసములు గ్రాంథికభాషలోఁగాని యాధునికభాషలోఁగాని రచింపవచ్చునని యుత్తరువును జేయించిరి. ఈయుత్తరువు పుట్టినవార్త క్రమక్రమముగా నాంధ్రలోకమున వ్యాపించి యాందోళనమును గలుగఁజేసినది. భాషాభిమాను లెల్లరు నాంధ్రసాహిత్యపరిషత్తును బురస్కరించుకొని బహువిధములఁ బ్రతిఘటింపఁ దుద కాయుత్తరువు రద్దయినది. ఈకాలమందే మదరాసు విశ్వకళాపరిషత్తువారు (Madras University) పరిషత్పరీక్షలకు వచ్చు విద్యార్థులు వ్యాసము లెట్టిభాషలో రచియింపవలయు నను విషయమును నిర్ణయించుట కొకవిద్వత్సంఘము నేర్పఱిచిరి. ఆసంఘములో గ్రాంథికవాదులును గ్రామ్యవాదులును గూడ నుండిరి. తుద కాసంఘమువారి యభిప్రాయము ననుసరించి వ్యాసరచనము గ్రాంథికభాషలోనే చేయవలయునని విశ్వకళాపరిషత్తువారును దీరుమానించిరి. ఈవిధముగా రెండు

చోటులయందును గ్రామ్యవాదము నిరాకృతమై గ్రాంథికవాదమే నిలిచినది.

కాని, యిటీవల మదరాసు విశ్వకళాపరిషత్తులోనేమి యాంధ్రవిశ్వకళాపరిషత్తులోనేమి గ్రామ్యవాదులు కొందఱు పరీక్షకులుగాను బఠనీయగ్రంథనిర్ణాయకులుగాను బ్రవేశించుచుండుటచే నీవాదము తిరిగి తలయెత్తుట కవకాశము కలుగునేమో యని యనుమానింపఁదగియున్నది. ఇంతియకాక భావకవులను పేర నిప్పుడు బయలుదేఱుచున్న నూతనకవితాప్రవర్తకులలోఁ గొందఱు గ్రామ్యభాషనే వాడుచున్నారు. ఈరెండువాదములలోను జేరక తటస్థముగా నున్నవారిలో గ్రాంథికగ్రామ్యభాషలకుఁ గలభేద మెట్టిదో తెలియనివారు కొందఱుండవచ్చును. కావున నీరెండుభాషల స్వరూపమును వానికిఁ గలభేదమును వివరింపవలసి యున్నది.

ముందుగా భాషయన నేమిటి యనువిషయ మాలోచింతము. భాషయనఁగా మనుజులు తమతమభావముల నితరులకుఁ

భాషాస్వరూపము. దెలుపుటకు ముఖ్యసాధన మని చెప్పనొప్పును. వివిక్తదేశమం దొక్కఁడే నరుఁ డుండినచో వానికి భాషతోఁ బనిలేదు. కాని, పలువురుమనుష్య లొక్కచో సంఘముగాఁ గూడియున్నప్పుడు పరస్పరభావప్రకటన మావశ్యకమగును. అట్టి ప్రకటనమునకుఁ దగిన సర్వజనసామాన్యసాధనమొకటి యుండవలయును. అట్టిసాధనము కాలక్రమమున బయలుదేఱును. కొంతవఱకు జనుల ముఖవికారములే వారిభావము

లఁ దెల్పును. ఇదియు నొకవిధమయిన భాషయని చెప్పవచ్చు ను. కాని యీభాషకు వ్యాప్తి మిక్కిలి సంకుచితమైనది. జనుల తాత్కాలికానంద దుఃఖములు మాత్రము స్థూలరూపముగా ముఖవికారములవలనఁ దెలియును గాని యాభావముల సూక్ష్మాంశములఁగాని, యితరభావములనుగాని వ్యక్తపఱుచుట కాభాష చాలదు. కరచరణాద్యవయవనిక్షేప మంతకంటె మేలు. దీని మూలమునఁ బెక్కుభావముల వ్యక్తపఱుపవచ్చును. మూఁగవాంఢ్రభాష యిదియే. అభినయశాస్త్రమునకు మూలముకూడ నిదియే. ఇదియైనను సమగ్రము గాదు. సూక్ష్మభావముల వ్యక్తపఱుచుట కిది చాలదు. మిక్కిలి సమీపమందున్నవారితోడను మాత్రమే సంజ్ఞలతో మాటలాడుట కనువగును. జనుల బుద్ధి వికసించినకొలఁది నీభాష చాలక వాగ్రూపక మగు భాష యుత్పన్నమయి క్రమక్రమముగా వృద్ధినొందినది. సర్వభావములను సూక్ష్మాంశములతోఁ గూడ నీభాషామూలముగా వ్యక్తపఱుపవచ్చును. కాని యుచ్చరింపఁబడినతోడనే మాటలు నశించును. వానియర్థము వాసనారూపముగ విన్నవారి మనస్సుల నంటియుండును. కాలాంతరమం దీయర్థమును స్మరించుకొనవలసివచ్చినప్పుడు స్మృతి దుర్బలమైనచో నాయర్థ మున్నది యున్నట్లుగాఁ దలంపునకు రాదు. ఈలోపము నివారించుటకును దూరదేశమునం దున్నవారికిఁ గూడ భావములఁ దెలుపుటకును లిపి కల్పింపఁబడినది. మానవసంఘములు ప్రబలి వారియూహాలు, బుద్ధిబలము, వ్యవహారములు హెచ్చినకొలఁది లిపి యావశ్యక

మగును. ఈలిపి తొలుత నుత్తరప్రత్యుత్తరములు, పద్దులు, లెక్కలు మొదలగు చిన్నచిన్నపనుల కుపయోగింపఁబడి క్రమముగా గ్రంథరచన కుపయోగించును. విడిపద్యములు, చిన్నచిన్న కావ్యములు లిఖితములు గాక కేవల వాగ్రూపమున నుండవచ్చును గాని కావ్యములు ఖిలములుగాకుండ శాశ్వతముగా నుండవలయునన్నచో వానిని లిఖించి యుంపవలయును. కనుకనే వాఙ్మయము గలభాష లన్నింటిలో లిపి యుండుట చూచుచున్నారము. కోదు(కుయి) సవర మొదలగు నాటవికభాషలకు లిపి లేదు. దక్షిణకర్ణాటమండలమునందు వాడుకలో నున్న తులుభాష యాటవికభాష కాకున్నను దానిలోఁగూడ లిపిలేదు. ఈభాషలలో వాఙ్మయమును లేదు. లిపి లేనిభాషలలో వాఙ్మయము పుట్టుటకుఁగాని యభివృద్ధి నొందుటకుఁగాని యవకాశ మంతగా నుండదు. లిపి సమగ్రముగా నుండవలయునన్నచో వేఱువేఱు ధ్వనికెల్ల వేఱువేఱు చిహ్నము లుండవలయును. ఒక్కధ్వనికిఁ బెక్కక్షరములుగాని పెక్కుధ్వనుల కొక్కటే యక్షరముగాని యున్నచో నాలిపి సంపూర్ణమయినది కాకపోవును. ఈపద్ధతిని బట్టి చూడ సంస్కృతలిపియుఁ దెలుఁగులిపియు నించుమించుగా సంపూర్ణములే యనవచ్చును. ఆంగ్లేయద్రావిడభాషలలిపి యసమగ్ర మని చెప్పక తప్పదు. కావుననే యీభాషలయందు వ్రాఁత యుచ్చారణానుసారముగా నుండుటకు వీలులేదు. కొన్నిశబ్దములలో వ్రాఁత యొకవిధముగను బలుకుబడి వేఱొకవిధముగను నుండును తెలుఁగున నీవ్యత్యాస మంతగా లేదు.

వాఙ్మయావిర్భావము.

జనులలోఁ దెలివితేటలు వ్యవహారధర్మములు విద్యలు వికసించినకొలఁది వాఙ్మయము క్రమక్రమముగా నేర్పడును. అట్టి జనులకు వాఙ్మయములేనిది లోకవ్యవహారము చక్కఁగా నడువదు. కావుననే నాగరకు లనుపేరు పొందిన జనుల భాషలలో నెల్ల గ్రంథసంచయముండుట చూచుచున్నారము. లిపిగలభాష లన్నింటిలోఁ గొంచెమో యధికమో వాఙ్మయము గలదు.

భాషావికృతి.

కేవల వాగ్రూపభాషాస్వరూపము స్థిరముగా నుండక కాలానుసారముగా వికృతులను జెందుచుండును. ఒకపురుషుఁ డొకమాట నుచ్చరించిన వెంటనే యామాట నశించి పోవును. వేఱొకసారి యాతఁడే యామాటనే యుచ్చరింపవలసినప్పు డాయుచ్చారణము సరిగాఁ బూర్వమువలెనే రాదు. ప్రాజ్ఞులైనను సామాన్యవ్యవహారవిషయములలో నొకరితో నొకరు మాటలాడుకొనునప్పు డలసతచే వర్ణోచ్చారణము శిథిలమై శబ్దములరూపము క్రమముగా మాఱుట యనుభవసిద్ధము. విద్యావిహీనులమాట వేఱె చెప్పనేల. ఈయలసతచేతి శబ్దములలో వర్ణలోప వర్ణవ్యత్యాసములు గలిగి కొంతకాలమున కాశబ్దములు మాఱిపోవును. నదీప్రవాహములోఁబడి కొట్టుకొనిపోవురాళ్లు క్రమక్రమముగా నఱిగిపోయి చిన్నవయినటులు శబ్దములును జనులనోళ్లఁబడి యఱిగిపోయి హ్రస్వరూపములఁ దాల్చును. ఇది సర్వదేశభాషాసమానధర్మము.

వికృతులు హెచ్చినకొలఁది భాషలో నంతర్భేదము లే

ర్పడి యొక్కొక్క ప్రదేశమందలి భాష యొక్కొక్కవిధముగా నుం డును. వీనిని ప్రాదేశికభాష (diolects) లనవచ్చును. ప్రదేశ భేదములను బట్టియే కాక జనుల విద్యాతారతమ్యమును బట్టియు వృత్తులను బట్టియుఁ గూడ భాషాభేదము లేర్పడును. ప్రతిభాష యందు నిట్టిభేదములు గలవు.

మన తెనుఁగుభాషలో గంజాముమండలములోని యేస యొకవిధముగా నుండును. విశాఖపట్టణప్రాంతమందలి యేస దానికంటెఁ గొంత విలక్షణము. గోదావరి కృష్ణామండలముల లోని భాష యేకవిధమని భావింపవచ్చును. గుంటూరు నెల్లూరు మండలములభాష వేఱు. కడప కర్నూలుమండలములభాష వీని యన్నిటికంటె విలక్షణము. కర్ణాటభాషాసంపర్కముచే బళ్లారిప్రాంతమునందును మైసూరుదేశమునందును దెనుఁగు మాఱినది. ఆప్రకారమే చిత్తూరుమండలమందును, నరవదేశమందు ను ద్రావిడభాషాసంపర్కముచేతఁ గొంత వికారము కలిగినది. మఱియు బ్రాహ్మణులు మొదలగు విద్యావంతులు మాటలాడు భాష వేఱు. విద్యాగంధములేని కేవల పామరజనులు మాట లాడు భాష వేఱు. వివిధములైన యేసలతో మాటాడు జను లొక్కచోటఁ గూడి ప్రత్యక్షముగా మాటలాడుకొనునప్పు డొ కరిమాట యొకరికిఁ దెలియకపోదు గాని లిఖితరూపముగానున్న ప్పు డొకప్రదేశములోని యేస వేఱొకప్రదేశములో నుండువా రికి స్పష్టముగాక నట్లుండును.

ఏకభాషలోని శబ్దములే యిట్లుమాఱుచుండ నొకభాష

తద్భవశబ్దోత్పత్తిక్రమము.

లోని శబ్దములు వేఱొకభాషలోఁ జేరునప్పుడు వాని యుచ్చారణము మాఱునని వేఱ చెప్పనక్కఱలేదు గదా! సంస్కృతశబ్దములు కొన్ని తెనుఁగులోనికి వచ్చునపు డవి మాఱి రూపాంతరములఁ దాల్చినవి. అట్టి శబ్దములకు వైకృతము లనియుఁ దద్భవము లనియుఁ బేరు. సాధారణముగా నీశబ్దములు తొలుతఁ బ్రాకృతభాషలలోఁ జేరి యందుఁ గొన్నిమార్పులను బొంది పిదపఁ దెనుఁగులోనికి వచ్చి మఱికొన్ని వికృతులను బొందినవి. సంస్కృతములో నున్న కొన్ని యక్షరములకు సరియైనయక్షరములు ప్రాకృతములందును దెనుఁగునందును లేకపోవుటచే నాశబ్దము లీభాషలోఁ జేరినప్పుడు వానియుచ్చారణము మాఱనలసివచ్చినది. పిదప గొందఱుకవులచ్చతెనుఁగు గ్రంథముల రచించుచుఁ బెక్కుసంస్కృతశబ్దములకు వికృతులు కల్పించి తమ గ్రంథములయందు వాడిరి. ఆంధ్రమునఁ దద్భవశబ్దములు పుట్టినరీతి యిది.

తత్సమశబ్దములు.

మొదటినుండియు సంస్కృతభాషాపాండిత్యము గలవారె తెనుఁగుకవిత్వము చెప్పుచుండుటచేతను వారు రచించినగ్రంథములు బహుళముగా సంస్కృతగ్రంథముల కనువాదము లగుటచేతను భావప్రకటనమునకుఁ గేవల దేశ్య తద్భవపదములు చాలక యాకవు లనేకసంస్కృతపదముల నాంధ్రవిభక్తి ప్రత్యయములఁ జేర్చుటతప్ప మఱియేమార్పులను జేయకయే యున్నవియున్నట్లు వాడిరి. అవియే తత్సమశబ్దములు. తెనుఁగువాఙ్మయమునం దీశబ్దము లత్యధికముగా నున్నవి.

భాషకు లిపి యేర్పడినపిమ్మట మార్పులు కొంతవఱకుఁ దగ్గును. నట్టి నోటిమాటలు మాఱిపోవునంతగా వ్రాఁతకెక్కిన మాటలు మాఱవు. లిఖితరూపము లగు పదములు వ్రాసినప్పు డెట్లుండునో కాలాంతరమునందు నట్లే యుండును కాని యుచ్చారణానుసారముగా వ్రాయఁబడిన శబ్దములరూప మాయాకాలములందలి యుచ్చారణ ననుసరించి మాఱుచునే యుండును. బహుజనసన్మాన్యము లగుగ్రంథములు పుట్టినపిదప నాగ్రంథములందుఁ బ్రయుక్తమయిన భాష తరువాతికవుల కాదర్శ సాయ మగును. ఆభాషయే సలక్షణభాష యనియు నంతకంటె విలక్షణమైనభాష గ్రంథగచనకుఁ దగదనియు భావింతురు. ఈసంప్రదాయము వాఙ్మయము గల సర్వభాషలయందును గలదు. అది యుక్తమే. జనులు వాఙ్మయమువలని ఫలమును సంపూర్ణముగాఁ బొందవలయునన్న నాయాగ్రంథములు పుట్టిన ప్రదేశమందును, తత్కాలమునందును మాత్రమే గాక ప్రదేశాంతరములందును, గాలాంతరమందును గల జనులుగూడఁ జదివి యర్థము చేసికొనఁదగినట్టివిగా నుండవలయును. నియమితము స్థిరము నగు భాషయందు రచింపఁబడినప్పుడే గ్రంథముల కట్టియోగ్యత కలుగును. కావుననే వ్యావహారికభాష మాఱుచున్నను గ్రాంథికభాష నిలుకడఁజెంది యుండుట చూచుచున్నారము. అట్లు కానిచో నించుమించుగా నెప్పటి వాఙ్మయ మప్పుడే ఖిలమయి పోవలసివచ్చును.

గ్రాంథిక భాషా స్వరూపము.

ఇట్లనుటచే గ్రాంథికగ్రామ్యభాషల కన్యోన్యసంబంధము

లేదని యూహింపఁగూడదు. రెంటికి నొకవిధమైన సాహచర్యసంబంధము గలదు. వడఁబోసిన నిర్మలజలప్రవాహమువంటిది గ్రాంథికభాష. తత్తత్ప్రదేశమందలి కల్మషములతోఁగూడిన వాననీరు వచ్చి పడుచుండుటచేఁ గలుషమైన నీటిజాలువంటిది గ్రామ్యభాష. ఈరెండు నొకటికొకటి యనతిదూరముననే ప్రవహించుచుండుటచే వీనికొక విధమగు సాహచర్యసంబంధము గలదు. అప్పుడప్పుడు గ్రాంథికభాషలోని శబ్దములు, రూపములు కొన్ని వాడుకభాషలోఁ జేరుటయు వాడుకభాషలోని మాటలు కొంచెముగనో యధికముగనో సంస్కారముం బొంది గ్రాంథికభాషలోఁ బ్రవేశించుటయుఁ గలదు. ఈభాషలు రెంటికి జన్మస్థాన మొక్కటియే యైనను వాని తదనంతరచరిత్రమును వర్తమానరూపములును భిన్నములు.

సర్వభాషాసామాన్యమగు నీచర్చ తెనుఁగున కెంతవఱకు సరిపోవునో చూతము. ఆంధ్రదేశమందు వాడుకభాష బహువిధములుగా నున్నదని చెప్పియుంటిని. గ్రాంథికభాష ప్రవాహన్యాయమున నేకాకారముగా నున్నది. మనకుఁ దెలిసినంతవఱకు నన్నయభట్టారకరచితభారతభాగమే ప్రథమాంధ్రగ్రంథము. అంతకుఁబూర్వము కవిత్వమే లేదని చెప్ప వలనుపడదు. మధ్యాక్కరపద్యములతో నున్న యుద్ధమల్లుని బెజవాడశాసనమును(1) తరువోజపద్యములతో నున్న గుణగవిజయాదిత్యునినాఁటి ధర్మవరశాసనమును(2) లభిం

**ఆంధ్రగ్రాంథికభాషప్రథమావస్థ.**

(1) (2) చూ. అనుబంధము.

చినవి. ఇట్టికవితలు మఱికొన్ని యుండిన నుండవచ్చును. భట్టా రకునికవిత్వము సర్వాంగసుందరమై సంస్కృతములో వాల్మీకి రామాయణమువలెఁ దెలుఁగులో నాదర్శప్రాయమై యున్నది. భాషాలక్షణమే కాక ఛందోలక్షణము సైతమానాఁటికే స్థిర పడియున్నది. ఇది యంతయు భట్టారకుఁడే కల్పించినాఁ డనుట సమంజసము కాదు. కృత్యాదియందు భట్టారకుఁడే.

"సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకవితార్థయుక్తిలో
నారసి మేలునాన్"

అని చెప్పుటచే నాకాలమం దితరాంధ్రకవులుండి రని తెలుచు న్నది. వారందఱిలో మిన్నయై సర్వజనసంభావ్యమయిన రీతి ను గ్రంథము రచించుటచే నన్నయ ప్రథమాంధ్రకవిగాఁ బరిగణిం పఁబడుచున్నాఁడు. గ్రాంథికభాషాలక్షణమును నన్నయభట్టు కల్పించినాఁ డనుకొనుట యుచితముకాదు. ఆనాఁడు వేఁగీదేశ రాజధానియైన రాజమహేంద్రనగరప్రాంతమందు సలక్షణముగా గ్రహింపఁబడి యుండినభాషనే యాకవి యనుసరించెను గాని తాను క్రొత్తభాషను సృజింపలేదు.

ఈవ్యాసమున కనుబంధముగా నైదు ప్రాచీనశిలాశాస నముల ప్రతుల నిచ్చినాఁడ. వానిలోని మొదటి మూఁడుశాస

ప్రాచీన వ్యావహారిక భాషా స్వరూపము.

నములు గోదావరీమండలములో ద్రాక్షారామ గ్రామమందు శ్రీ భీమేశ్వరాలయములో నున్న వి. ఇవి యిదివఱలో South Indian Inscriptions, Vol. IV. అను పుస్తకమందుఁ బ్రకటింపఁబడి యు న్నవి. ఆపుస్తకములోని పాఠమునే భేద మేమియు లేకుండ నను

బంధములోఁ గనఁబఱిచినాఁడను. నాల్గవశాసనము నైదవశాసనమును గుంటూరుమండలమున, తెనాలితాలూకా వలివేరుగ్రామమందు శ్రీస్వయంభూదేవుని యాలయములో నున్నవి. మూలపాఠమును సరిగా నెత్తి వ్రాసినాఁడను. ఈశాసనము లన్నియు రాజరాజనరేంద్రునికాలమందుఁ బుట్టినవి యని యూహింపవచ్చును. వీనిలో వ్రాఁతతప్పు లనఁదగిన పదముల విడిచినచో నీశాసనములలోని భాషలక్షణ మించుమించుగా నన్నయభట్టారకుని భాషలక్షణమునకు సరిపోవును. ఈసామ్యము రాజమహేంద్రవరమునకు సమీపదేశమందున్న మొదటి మూఁడుశాసనముల యందుకంటె నించుక దూరదేశమందున్న నాలుగైదుశాసనములందె యధికముగాఁ గనుపట్టుచున్నది. ఇది చిత్రము. అక్షరాస్యు లగు జనులందఱు వచ్చి చదువుకొనుటకై యేర్పడిన గద్యశాసనము లాయాకాలములందు వాడుకలోనున్న శిష్టవ్యవహారభాషయందే రచింపఁబడి యుండునని యూహించుట యుచితము. కావున శాసనభాష యానాఁటి శిష్టవ్యవహారభాష యనియు దానికిని నన్నయభట్టారక ప్రయుక్త గ్రాంధికభాషకు నంతర మంతిగాలేదనియుఁ దేలుచున్నది. ఇది వింతగాదు. గ్రాంధికభాష ప్రథమావస్థయందు శిష్టవ్యవహారభాషానిర్విశేషముగానె యుండును. పిదప రానురాను వ్యావహారికభాష మాఱుచుండుటచేతను గ్రాంధికభాష యంతగా మాఱకుండుటచేతను గొంతకాల మగుసరికి గ్రాంధిక గ్రామ్యభాషల కంతర మధిక మగును.

నన్నయభట్టారకునికాలము గ్రాంథికభాషకుఁ బ్రారంభదశ యని చెప్పవచ్చును. అంతకుముందే యాభాష యుత్పన్నమై జనాదరమును బొంది యుండెను గాని భట్టారకుఁడు దానికి మెఱుఁగుపెట్టి భారతమువంటి యుద్గ్రంథము రచించుటకుఁ జాలినదానినిగా నొనర్చెను. కావుననే తిక్కన సోమయాజి యామహాకవికి విద్యాదయితుఁ డను బిరుదమును సమర్పించెను.

నన్నయభట్టారకుఁడు, తిక్కన సోమయాజి, వీరి భాషల స్వరూపము.

వాగనుశాసనుఁ డిట్లు సృజించిన గ్రాంథికాంధ్రప్రపంచము "మహానీయస్థితికిఁ గుండలీంద్రుండు మూలమై నిలిచెను." నన్నయభట్టారకుఁడు కని తన కొప్పగించిన భాషాశిశువును సోమయాజి యోజోదాయకమగు నాహారమిడి పెంచి విద్యాబుద్ధులు గఱపి ప్రౌఢఁ గావించెను. భట్టారకునిభాష ప్రసన్నముగ నుండును. ఆతఁడు సంస్కృతశబ్దము లధికముగా వాడెడి యభ్యాసము కలవాఁడు. అట్లు వాడినను సంస్కృతశబ్దప్రయోగము సందర్భోచితముగా నున్నట్లు కనఁబడును గాని ప్రౌఢిఁ జూపుటకయి పనిపట్టి మాఱుమూలపదములఁ దెచ్చిపెట్టినట్లు కనఁబడదు. పరిణతప్రజ్ఞుఁడగు కవికిఁగాని యిట్టి నేర్పుండదు.

తిక్కన సోమయాజికిఁ దెనుఁగుపదము లుపయోగించుటయం దాసక్తి మెండు. సాధారణముగాఁ దెనుఁగుశబ్దములే యాతని మదికిఁ దట్టును. తెనుఁగుమాటలు దొరకనప్పుడే సంస్కృతశబ్దముల వాడును. ఉదారభావములఁగూడఁ దేటతెనుఁ

గుమాటలలో నీతఁ డిముడ్పఁగలఁడు. ఇదిగోఁ జూడుఁడు.

"తనకుం దా నెరవనినను
విను బంధులు సతమె యన్వివేకంబుననే
పనులపయిఁ జేయ నర్మిలి
నను వగ వొంద దది కారణముగ నరేంద్రా."

"నరనాథ సుఖముదుఃఖముఁ
బరువడిమెయిఁ బొరయుఁగాక పన్నుగ నరునిం
బొరయునె యందొక్కటి యవి
పొరసిన వల దూఁద మోదమును ఖేదంబున్."

"ఇది నాయది యను నూఁత
న్నది నెయ్యది పట్టుకొల్పినను వాసితమై
తుదిఁ జేటు నొంది వానికి
నది శోకము నావహించు నత్యంతంబున్.
శాంతిపర్వము ౮ వ ఆశ్వాసము.

భట్టారకుఁడును సోమయాజియు విద్వద్వర్యులు, కవి శిఖామణులు. వారికి శైలిలోమాత్రము భేద మున్నది. వారిరు వురిలో నెవ్వరెక్కువ యెవ్వరు తక్కువ యని తారతమ్యము నిరూపింప యత్నించుట హరిహరుల తారతమ్యము నిర్ణయించు యత్నమునలె వ్యర్థము.

భట్టారకుని ప్రయోగములకంటె భిన్నములయిన ప్రయోగములు కొన్ని సోమయాజి కవిత్వమం దగపడుచున్నవి.

ఒక్కోఁడు, ఒక్కఁడు మొదలగురూపములుగల యీశబ్దము భట్టారకుని కవిత్వమందు ఒక్కటియను నర్థమం దహమదర్థకముగానె కనుపట్టుచున్నది. మహదర్థకప్రయోగములు కొన్ని కొన్ని యచ్చుప్రతులలో నున్నవిగాని యవి యిటీవలివారు కల్పించిన ప్రక్షిప్తపాఠము లని యెంచఁదగియున్నవి. సోమయాజి కవిత్వమం దీశబ్దము, ఒకపురుషుఁడు అనునర్థమందు మహదర్థకపుంలింగరూపముగాఁగూడ నగపడుచున్నది. ఒక్కఁడుశబ్దమునకు ప్రథమేతరవిభక్తిప్రత్యయములు పరముగునప్పుడు వచ్చు ఒక్కటి యనురూపము, అమహదర్థకముగా సోమయాజి కవిత్వమం దగపడుచున్నది. ఈప్రయోగము భట్టారకుని కవిత్వమందుఁ గానరాదు. ఇప్పుడు వాడుకలోనున్న వచ్చుచున్నాఁడు, పోవుచున్నాఁడు—ఇత్యాది క్రియారూపములు సోమయాజి కవిత్వమందు వీనికిఁ బూర్వరూపము లయిన వచ్చుచున్నవాఁడు, పోవుచున్నవాఁడు——అను రూపములే కనఁబడుచున్నవి. ఇట్టి ప్రయోగభేదములు మఱికొన్నిటినిగూడఁ జూపవచ్చును. తెనుఁగుపదములు, పలుకుబడులు నధికముగా వాడుటలోఁ దిక్కన సోమయాజి గుంటూరు నెల్లూరు ప్రాంతములందు వాడుకలో నున్న వ్యావహారిక రూపములఁ గొన్నింటిని గ్రహించెను. ఆప్రకారమే నన్నిచోడుఁడు, కేతన, యిటీవల శ్రీనాథుఁడు, నాచన సోముఁడు—ఇత్యాదికవులు కొందఱు తమతమ కాలములందు వాడుకలోనున్న వ్యావహారికరూపములఁ గొన్నింటిని దమగ్రంథములయం దుపయోగించిరి. తదనంతరము పుట్టిన గ్రంథము

గ్రాంథికభాష మాఱకుండుటకుఁ గారణము.

లలోఁగూడఁ గొన్ని వ్యావహారికశబ్దములు ప్రవేశించినవి. అయినను గ్రాంథికభాషాప్రవాహము నియమసహితమై సుస్థిరములైనకూలముల నడుమునే ప్రవహించునుగాని గ్రామ్యభాషవోలె గంగవెల్లువలెత్తి దారి తప్పిపోదు. గ్రాంథికభాషకు వాఙ్మయము మనునది దృఢశృంఖలవంటిది. ఈభాష గ్రంథములయందే యుండును. గ్రంథములన్ని దేశముల నెల్లకాలముల జనుల కన్వయించునట్లుండవలయును. గ్రాంథికభాష నియమహీనమై తఱచు మాఱినయెడల గ్రంథరచన కుపయోగింపదు. భాష మార్పవలెనన్నఁ బాతకలోక మనుమతింపవలసియుండును. ఒక మండలములోనివారి కిష్టమైనమార్పు మఱియొక మండలమువారి కిష్టము కాదు. నిన్నటిగ్రంథము నేఁటివారికి దుర్గ్రాహ్యమగును. కాఁబట్టి కొన్ని చిన్నమార్పు లేవియైన నప్పటప్పటికిఁ గలుగుచున్నను భాషస్వరూపము మాఱదు.

నియమము లున్నంగాని లోకవ్యవహారము చక్కఁగా నడవదు. నియమము లేర్పడినపిమ్మట వానిని యథేచ్ఛముగా మార్చుట సులభముగాదు. బహుజనసమ్మతిమీఁదఁ గాని మార్పులు చెల్లవు. ధర్మశాస్త్రమునుండి యుక్కయుదాహరణము:—సపిండు లగువా రొకరి నొకరు వివాహ మాడఁగూడదని సామాన్యశాస్త్రము. దీనికి భిన్నముగా నాంధ్రులలో మేనఱికము, అనఁగాఁ, బురుషుఁడు మేనమామకూఁతును బెండ్లియాడు నాచారము కలదు. ఇది శాస్త్రవిరుద్ధ మయినను

శిష్టాచారముగా నీదేశమందు స్థిరపడి యున్నది. ఈయాచారము సామాన్యశాస్త్రమున కపవాదముగా నున్నది కాని యాశాస్త్రమును రద్దుచేయఁజాలదు. అలాగుననే వ్యావహారికభాషలో నుండి యప్పు డప్పు డొకమాట గ్రాంథికభాషలోఁ జేరుచు వచ్చినను గ్రాంథికభాష మొత్తముమీఁద వ్యావహారికభాషల కంటె విశిష్టమై స్థిరముగా నుండును.

ఈసంప్రదాయము సర్వభాషాసామాన్యము. గ్రామ్యవాదు లుత్కృష్టప్రమాణముగా గ్రహించెడి యాంగ్లేయభాష విషయములు, లౌన్సుబెరో (Mr. Lounsbury) యను విద్వాంసుఁడు వ్రాసినవిషయము నీక్రింద సంగ్రహించి వ్రాయుచున్నాఁడ నది గమనింపుఁడు.

"ఆంగ్లభాషలో వాఙ్మయ మనఁదగిన గ్రంథసముచ్చయముసృష్టి, మధ్యమాంగ్లయుగము(Middle English period) నందుఁ బ్రారంభమైనది. రచనాపద్ధతికిఁ బ్రమాణము లనఁదగిన గ్రంథములు భావిగ్రాంథికభాషకు నియమములఁ గల్పింపక మానవు. ఇట్టికారణముచేతనే యాంగ్లభాష 14 వ శతాబ్దాంతమునుండి నేఁటివఱకు నియమవిశిష్టమై వృద్ధిఁ జెందినది. లక్షణమందును, శబ్దసముచ్చయ మందునుగూడ దానిలో మార్పులు కలుగుచునే యున్నవి. అట్లు మాఱకున్నచో నది జీవద్భాషయే కాకపోవలసివచ్చును. కాని యట్టి మార్పులు యథేచ్ఛముగాఁ గాక నియమితములై కలుగును. అవి భాషలో స్థిరపడుటకుఁ జిరకాలము—కొన్నివిషయములలో పెక్కుతరములు—పట్టును.

వాఙ్మయము పెరిఁగి వ్యాపించినకొలఁది గ్రాంథికభాష మాఱుట తగ్గి పోవుచుండును. మధ్యమాంగ్లయుగప్రారంభము మొదలు నేఁటివఱకుఁ గడచిన యైదువందలసంవత్సరములలోఁ గలిగినమార్పులకంటె నంతకుఁ బూర్వము రెండువందలసంవత్సరములలోఁ గలిగినమార్పు లత్యధికముగా నున్నది. సంఖ్యలో నీరెంటికి సామ్యమే లేదు. ఇటీవలఁ గలిగినమార్పులు చాలవఱకు వర్ణక్రమము (Orthography) నందే యున్నది.(1)

ఆవిద్వాంసుఁడే గ్రాంథికభాషభావిస్థితిని గుఱించి వ్రాయుచు "గతించిన మూఁడువందలసంవత్సరములలో నాంగ్లేయ (గ్రాంథిక) భాష ధరించియున్నరూపము భావికాలమందు నశించిన నశింపవచ్చును గాని యింతకుఁ బూర్వ మెన్నఁడును గలిగియుండ నట్టి యుపద్రవములు కలిగినఁగాని నశింపదు." అని చెప్పెను.

ఏభాషయందైనను వాఙ్మయము వృద్ధి నొందినకొలఁది నావాఙ్మయమందుఁ బ్రయుక్తమైన భాషరూపము స్థిరపడి యేకాకారముగా నుండు ననియు వ్యావహారిక భాషాసంపర్కమునుబట్టి కొన్నికొన్ని చిన్నమార్పులు విరళముగాఁ గలుగవచ్చును గాని పెద్దపెద్దమార్పులు గలుగక మొత్తముమీఁద గ్రాంథికభాష యేకాకారముగా నుండు ననియు నీచర్చవలనఁ దేలుచున్నది. ఇది సర్వభాషాసమానధర్మము.

గ్రాంథికభాష పండితులకుఁ దప్పఁ దక్కినవారికి దురవ

(1) (History of the English language pp. 140-41.

గాహ మనియు నాభాషలో రచింపఁబడు గ్రంథములు సామా గ్రాంథికాంధ్ర న్యజనుల కుపయోగింప వనియు గ్రామ్యవాదు ము దురవగా లందురు. ఇది యతిశయోక్తి. గ్రాంథికభాషయం హము కాదు. దైనను గ్రామ్యభాషయందైనను శైలీభేదము లున్నవి. శైలి మిక్కిలి ప్రౌఢమైనచో వ్యావహారికభాషలో రచింపఁబడిన గ్రంథముకూడఁ గఠిన మనిపించును. గ్రాంథికభాషలోఁగూడ రెండువిధములైన శైలి యున్నది. మిక్కిలి ప్రౌఢమైన ప్రబంధశైలి యొకటి, పురాణాదిగ్రంథము లందుఁ గానవగు సులభశైలి యొకటి. ప్రబంధశైలిలోనున్న గ్రంథములు పండితైకవేద్యము లన్నమాట నిజమే. కాని సులభశైలిలోనున్న శతకములు, వేమనపద్యములు మొదలగు గ్రంథములు సుగమములు. భారతాదిగ్రంథములయందు సందర్భోచితముగా రెండుశైలులును గలవు. ఈభేదమైనను శైలినిబట్టి వచ్చినది గాని భాషాలక్షణమునుబట్టి వచ్చినది కాదు. లక్షణ మన్నింటికి సమానమే.

భారతము మొత్తముమీఁద ప్రౌఢగ్రంథమేకదా! ఆగ్రంథము పల్లెటూళ్లలోఁ బురాణముగాఁ జదువు నాచారము చిరకాలమునుండి యున్నది. ఒకరుపుస్తకము చదువుట యింకొకరర్థము చెప్పుట యాచారము. ఇంచుమించుగా గ్రామములోనున్నవారందఱును వచ్చి యాపురాణము విందురు. స్త్రీలు ముఖ్యముగా వత్తురు. చదువువానికంటె నర్థము చెప్పువాఁడు గట్టివాఁడుగా నుండవలయును గదా! వ్రాలుచేయనేరని వాడు

శ్రుతపాండిత్యముచేతనే భారతమున కర్థము చెప్పుట నే నెఱుఁగుదును. ప్రతిపదార్థముతో నన్వయించు సామర్థ్యము లేకున్నను సభ్యులలో ననేకులకు పద్యము చదువఁగనే దాని ముఖ్యభావము బోధపడును.

ఇంతియకాక, ఇటీవలఁ దెనుఁగులో నాటకములు ప్రబలి తెఱచుగా రంగస్థలములందుఁ బ్రదర్శింపఁబడుచున్నవి. ఈనాటకములు సామాన్యముగా గ్రాంథికశైలిని రచింపఁబడినవే. ఈ నాటకప్రదర్శనములకు స్త్రీలు మున్నగు ననేకులు వచ్చి యానందించుచుండుట మనము చూచుచున్నారము. నాటకభాష యర్థమే కానిచో జను లీరీతిని నత్తురా?

ఇరువదిసంవత్సరములకుఁ బూర్వము నేను చెన్నపురిలో నుద్యోగమందున్నప్పుడు రాజమహేంద్రవరమునుండి యొక నాటకసమాజమువా రక్కడకు వచ్చి యనేకనాటకములను బ్రదర్శించిరి. చెన్నపట్టనములోఁ దెలుఁగునాటకము లాడినప్పుడు వైశ్యస్త్రీ లధికముగా వచ్చుట కలదు. ఒకనాఁ డొకనాటక మాడుచు నడుమ గ్రామాధికారి యొక యభియోగమునువిచారించుట యను చిన్నప్రహసన మొకటి ప్రదర్శించిరి. ఈప్రహసనమునందు వచ్చుపాత్రములు గోదావరీమండలమందు సామాన్యజనులు వాడునట్టి శుద్ధవ్యావహారికభాషను చక్కఁగా ననుకరించిరి. ఆయనుకరణ మస్మదాదుల కెంతయు హృద్యముగా నుండెను. కాని, నాటకము ముగిసినపిమ్మటఁ గొందఱు వైశ్యులు సూత్రధారునొద్దకు వచ్చి మీ రింతకుముందుఁ బ్రదర్శించిన

ప్రహసనముభాష మా కొక్కముక్కయైనఁ దెలియలేదు. ఇట్టి ప్రహసనములే ముందుఁగూడ మీరు ప్రదర్శించునెడల మేము మీనాటకములకు వచ్చుట మానుదు మని చెప్పిరి. నాటకము లోఁ బ్రయోగింపఁబడిన గ్రాంథికభాష సర్వప్రదేశ సామాన్య మగుటచే వారికిఁ గొంతవఱకయిన నన్వయించినది గాని వ్యావహారికభాష వారి ప్రాంతమండలి భాష కాకపోవుటచే వారికర్థము కాలేదు. కావుననే సర్వసమాన మగు గ్రాంథికభాష యొకటి యావశ్యకము.

ప్రబంధముల శైలి ప్రౌఢమగుట నాగ్రంథములు పండితులకుమాత్రమె సుగ్రహము లగు ననుమాట వాస్తవము. కాని, భారతము, భాగవతము, రామాయణము మొదలగు పురాణగ్రంథములను సామాన్యులుకూడఁ జదివి యానందించుచున్నారు. కందుకూరి వీరేశలింగముపంతులుగారు, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు గ్రాంథికభాషలో సులభశైలిని రచించినగ్రంథములను వేసవేలు చదువుచున్నారు. లక్ష్మీనరసింహముగారి గయోపాఖ్యానము మున్నగుగ్రంథములను కొన్నిపరీక్షలకుఁ బఠనీయములుగా నిర్ణయింపఁబడకున్నను బెక్కుసారులు ముద్రితములయి వానిప్రతు లనేకసహస్రములు దేశమందు వ్యాపించినవి. విజ్ఞానచంద్రికామండలి, ఆంధ్రప్రచారిణీగ్రంథమాల యనుసమాజములు శతాధికము లగు గద్యగ్రంథముల రచింపించి వానిప్రతులు వేలకొలఁది యమ్మిరి. అచ్చటచ్చటఁ దప్పులున్నను నీగ్రంథము లన్నియు గ్రాంథికభాషాగ్రథితములే. సత్య మిట్లుండ

గ్రాంథికభాష పండితులకేకాని యితరులకుఁ దెలియ దనుట సాహసము. కందుకూరి వీరేశలింగముపంతులుగా రాధునికాంధ్రవాఙ్మయవికాసమునకు దారిచూపినవారని యెల్లరకు దెలిసినవిషయమే. జనసామాన్యమునకు సుగ్రాహ్యానుగుణ శైలియందు పెక్కు గద్యగ్రంథముల రచించి యాంధ్రలోకమునకు మహోపకారము చేసిరనుట సర్వజనసమ్మతమయిన విషయము. 1912 వ సంవత్సరము నవంబరు 24 వ తేదిని చెన్నపురి పచ్చయ్యప్ప కాలేజీభవనమందు "గ్రామ్యాదేశనిరసనసభ" యను నొకసభ జరుపఁబడినది. వీరేశలింగముపంతులుగా రాసభ కధ్యక్షులుగానుండి చెప్పినమాట లీక్రిందఁ బొందుపఱచుచున్నాఁడను. పాఠకు లామాటను గమనింతురుగాక.

"మొట్టమొదట ఆంధ్రభాష నాగరకభాష, గ్రామ్యభాష యని రెండువిధములు. పట్టణవాసులు మాట్లాడుభాష నాగరకభాష. జానపదులు మాట్లాడెడిభాష గ్రామ్యభాష. నాగరకభాషయే గ్రాంథికభాషగా మాఱినది. ఇప్పుడు గ్రాంథికభాష మార్పవలెనన్న హూణవిద్యాభ్యాసమొనర్చిన నవనాగరకులభాష యాదర్శముగా నుండవలెనా? లేక పండితులయొక్క భాష వాడవలెనా? మొదటిది హూణభాషాపదభూయిష్ఠమై యుండును. రెండవది వ్యావహారికభాషగా నుండును. కాఁబట్టి గ్రాంథికభాష యీరెంటికంటెను భిన్నముగా నుండవలెను. మనుష్యులవలెనే వాడుకలోనున్న భాషలుకూడ సంస్కారమును బొందుట సహజము. సంస్కృతమునకు మొదటిపేరు గీర్వాణ

ము. సంస్కృతమనుపేరు సంస్కరించుటవలననే వచ్చినది. సం॥ అనఁగా చక్కఁగా కృత॥ సంస్కరింపఁబడినదని యర్థము. గీర్వాణభాషను సంస్కరించినతరువాత వాడుకలోనున్న భాషకు ప్రాకృతమని పేరు. ప్రాకృతము పాత్రానుసారముగ నాటకరచనయందును ప్రహసనములందును వాడియున్నారు. అట్లే యాంధ్రమునందుకూడ పాత్రోచితముగ నాటకములందును రసోత్పత్తికొఱకు నవలలయందును ప్రహసనములలోను గ్రామ్యభాష స్వేచ్ఛగా నుపయోగింపవచ్చును.

ఆంధ్రవ్యాకరణము ముఖ్యముగా పద్యకావ్యములకు వ్రాయఁబడినది. రమారమి నలువదిసంవత్సరములక్రిందట తెలుఁగులో గద్యకావ్యములే లేకుండెను. అప్పుడు చిన్నయసూరి తన వ్యాకరణమును రచించి యందుకు లక్ష్యముగా నీతిచంద్రికను వచనముగ వ్రాసెను. దీనిశైలి మిక్కిలి కఠినము. మొట్టమొదట నేనును చిన్నయసూరిగారిత్రోవనే త్రొక్కి కొన్ని గద్యకావ్యములు రచించితిని. కాని యీగ్రంథములను జదివి బోధపఱుచుకొనుటకుఁ గావలసిన శ్రమమునకుఁ దగినంతఫలము లేదని తోఁచి గద్యకావ్యములను సులభశైలిని వ్రాయనారంభించితిని. మొట్టమొదట నన్ను పండితులు పరిహసించినను రాను రాను నాశైలియే యాదర్శముగా నుండనోపునని కొందఱు చెప్పియున్నారు. గద్యకావ్యములు వ్రాయునప్పుడు వ్యాకరణములో కొన్నిమార్పు లవసరమగును. ఎల్లప్పుడు సంధి నిత్యమైనచో వచనరచనయందు కష్టమగును. వ్యంగ్యార్థము స్ఫురించుచోట్ల

ను, అర్థసౌకర్యముకొఱకును, పదములను విసంధిగనే వ్రాయ వచ్చును. గద్యరచనయం దిదివఱకే యిది యంగీకరింపఁబడినది.

మన పూర్వకవులు చూపినత్రోవనే మనము క్రొత్తపదములను స్వీకరింపవచ్చును. క్రొత్తవృత్తులు పెరుఁగుకొలఁది క్రొత్తమాటలు కల్పించుట సహజము. ఇది యిదివఱకు మనభాషలో జరిగిన యంశమే. ఏమార్పులు చేసినను నియమములకు లోఁబడి యుండవలెను గాని విచ్చలవిడిగా నుండరాదు. ఇట్టి మార్పులు భాషాభివృద్ధికిఁ దోడ్పడవు.

గ్రామ్యభాషలో గ్రంథములు వ్రాయుటవలన వాఙ్మయాభివృద్ధి కానేకాదుగదా, యొక మండలమువారి పుస్తకములు మఱియొక మండలమువారికి అరబ్బీభాషగా నుండును. విశాఖపట్టణమువారు "పుల్లలావు" అన రాజమహేంద్రమువారు "పోయి పట్టలేదా" యని యడుగుదురు. చెన్నపట్టణమువారు "పూడ్చాడు" అనఁగా ఉత్తరాదివారు "గోతిలోనా" యని ప్రశ్నించెదరు. ఇంతియకాక "వాడొచ్చాడు" అని వ్రాసినయెడల రెండవది వచ్చుధాతువా? ఒచ్చుధాతువా యని సందేహము గలుగును. కొన్ని మండలములలో "ఆడొచ్చా" డందురు. 'వాడా' 'ఆడా' యని సంశయము పుట్టును. భాషయొక్క పరిశుభ్రత పోవును. శబ్దములు చెడిపోవును. కాఁబట్టి గ్రామ్యభాషలో వ్రాసిన గ్రంథములను పాఠశాలలలో నుపయోగింపఁగూడదు. గ్రంథములను గ్రాంథికభాషలోనే వ్రాయవలెను." (ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక 1 సంపుటము.)

బ్రౌనుమహాశయుని యభిప్రాయము.

పెక్కు సంవత్సరములక్రిందట నీదేశమునకు రాజకీయోద్యోగముపై వచ్చి కడుశ్రద్ధతో నాంధ్రభాష యభ్యసించి పలువురు పండితుల నాదరించి వారిసాహాయ్యముచే "బ్రౌణ్య" మను నిఘంటువు నొనర్చిన సి. పి. బ్రౌను (Mr. C. P. Brown) అనునాంగ్లేయమహాశయుఁడు, ఆంధ్రభాష నభ్యసింపగోరు తోడియాంగ్లేయుల నుద్దేశించి సమకూర్చిన యొకవ్యాసములో గ్రాంథికాంధ్రమును గూర్చి చెప్పినమాటలు సంగ్రహముగా నెత్తి వ్రాయుచున్నాఁడ.

"ఆంధ్రపద్యగ్రంథములు మనము చదువ నారంభించినప్పుడు, ఆగ్రంథములభాష మనము మాటలాడునట్టియు (నుత్తరప్రత్యుత్తరములు) వ్రాయ ట్టియు భాషకంటెఁ గేవలము భిన్నమైనదని తోఁచును. కాని యభ్యాస మించుక హెచ్చిన పిదప గ్రాంథికాంధ్రమునకును వ్యావహారికాంధ్రమునకును గల భేదము మిల్టను, పోపు, డ్రైడెను (Milten Pope and Dryden) అను కవులు వాడిన గ్రాంథికాంగ్లమునకును, మనము వాడుచున్న సంభాషణాంగ్లమునకును గల భేదముకంటె నెంతమాత్రము నధికము గాదని స్పష్టపడును. భాస్కరశతక మనుగ్రంథ మొకటి గలదు. దీనిని బడులలో సాధారణముగాఁ బాఠము చెప్పుదురు. బాలురు, బాలికలు దానిని జదివి సులువుగా గ్రహింతురు. ఈగ్రంథము శైలి ప్రసన్నమై వాల్టరు స్కాటు (Walter Scott) శైలిని బోలియుండును. ఇట్లయినను, నీశతకమును జదివి యర్థము చేసికొనఁగలిగిన యాంగ్లేయులు ముగ్గు

రయిన నగపడరని చెప్పవచ్చును. గ్రాంథికాంధ్రభాష నభ్యసిం పకయే యది దురవగాహ మని యెంచఁగూడదు. "(1)

ఇది యాంధ్రభాష నభ్యసించిన యాంగ్లేయునియభిప్రాయము. ఆంధ్రులై పుట్టి చిన్నప్పటినుండి యాంధ్రభాషయే మాటలాడుచున్న మన గ్రామ్యవాదులు గ్రాంథికభాష యాంధ్రులకుఁ గేవలము దురవగాహమని పలుకుచుంట "పొరుగువాఁడు పాఁడిగేదెయన్న నింటివాఁడు గొడ్డుగేదె" యన్నట్లున్నది. దీనికిఁ గారణమేమని యూహింపఁగా నొక్కటె స్ఫురించుచున్నది :—

గ్రామ్యవాదు లించుమించుగా నందఱును దెనుఁగునందుకంటె నాంగ్లేయభాషయం దెక్కువ పరిశ్రమచేసినవారు. వీరిలోఁ గొందఱిటీవల నాంధ్రమునందుఁ గూడఁ జక్కనిజ్ఞానమును సంపాదించినను మొదటఁ బట్టిన పట్టు విడువంజాలకయున్నారు. వీ రాంగ్లభాషాపరిచయముఁ గొంతవఱకు సంపాదించి యాభాషలో గ్రాంథికవ్యావహారికభాషలకు భేదము లేదని భ్రమపడి తెనుఁగులోఁ గూడ నట్టిభేదము లేకున్నచో గ్రంథరచన యథేచ్ఛముగాఁ జేయవచ్చునను నూహతో నీప్రయత్నము చేయుచున్నట్లగపడుచున్నది. వీ రనుకొన్నట్లు, ఆంగ్లభాషలో గ్రాంథికవ్యావహారికభాషలకు భేదము లేదనుమాట యసత్యము. ఆంధ్రమునందువలెనే యాభాషయందును స్థిరరూపమును ధరించిన గ్రాం

---

(1) Madras Journal of literature and science, 1st series, Vol. X.

థిక భాష యున్నది. మనకువలెనే వారికిని వ్యావహారిక భాష బహువిధములుగా నున్నది. అయినను నాభాషయం దొకవిశేషము గలదు. కేవల ప్రాదేశిక వ్యవహారభాషలకును గ్రాంథిక భాషకును మధ్యస్థమని చెప్పఁదగినట్టియు విద్యాభ్యాసమొనర్చినవారు వాడునట్టియు సామాన్యవ్యావహారిక భాష యొకటి కలదు. దీనిని ప్రామాణిక వ్యావహారికాంగ్లభాష (Standard spoken English) యందురు. విద్యాభ్యాసకాలమందు విద్యార్థులు మాటలాడుటయందు గ్రాంథిక భాష ననుకరించుటచేతఁ గ్రమముగా నీభాష బయలుదేఱినది. ఇది కేవల వ్యావహారిక భాషలకంటె భిన్నము. చాలవఱకు గ్రాంథిక భాషకుఁ జేరువుగా నుండును గాని, కేవల గ్రాంథిక భాష కాదు. దీనికి సంస్కృత వ్యావహారికాంగ్లభాష యని నామకరణ మొనర్పవచ్చును. ఈ భాషవిషయమై వైల్డు (Wyld) అను గ్రంథకర్త యిట్లు వ్రాయుచున్నాఁడు.

"వర్తమానకాలమం దీదేశములో నుపాధ్యాయవృత్తిలో నున్నవారు విద్యార్థులకుఁ బరిశుద్ధమయిన భాషలో సంభాషించు నేర్పును గలుగఁజేయుటకై యధికప్రయత్నములుచేయుచున్నారనుమాట సత్యము గాదని యెవ్వరును జెప్పలేరు. ఉపాధ్యాయవృత్తిలో నున్నవారును, పెద్దసభలలో నుపన్యసింప యత్నించువారును, పెద్దపెద్దవ్యవహారములలోఁ జేరఁదలఁచువారును దమతమ గ్రామ్య భాషను విడిచిపెట్టి సర్వప్రదేశసమానమైన

ప్రామాణికవ్యవహారభాష నభ్యసించుట యుపయోగకర మని యెంచుచున్నారు.*

ఇట్టి సంస్కృతవ్యవహారభాష యితరభాషలయందు లేదు. తెలుఁగులో లేదనుట స్పష్టము. పెద్దపెద్దసభలలో నుపన్యసించువా రిప్పు డిప్పుడు గ్రాంథికభాష ననుకరింప యత్నించుచున్నారు. ఈయభ్యాసము ముదిరినకొలఁది సంస్కృతమైన సామాన్యవ్యావహారికభాష యొకటి యవతరింపవచ్చును గాని వర్తమానకాలమం దదిలేదు. కర్ణాటభాషలోఁ క్రొత్తకర్ణాటము (హొసకన్నడ) అనుభాషాభేద మొకటికలదు. కాని యది కర్ణాటదేశమంతట సర్వసమానముగా లేదు. మైసూరుప్రాంతభాష వేఱు, ధార్వాడప్రాంతభాష వేఱు, ఈభాషల కైక్యము కల్పింపవలయు నని కొంద ఱుత్సాహపడుచున్నారు గాని మార్గముఁ గానకున్నారు.

ఈక్రొత్తకన్నడములో గద్యగ్రంథములు బయలుదేఱుచున్నవి గాని పద్యగ్రంథములు రచించునపుడు తఱచుగాఁ బ్రాచీనకన్నడమే యుపయోగపడుచున్నది. హొసకన్నడము పద్యరచన కింతగాఁ బనికిరాదు. ఈపద్ధతియే వ్యాపించినయెడలఁ బద్యభాష వేఱు గద్యభాష వేఱుగ నుండవలసివచ్చును. ఇది యసంభావ్యము.

బెంగుళూరులో నెలకొల్పఁబడిన కర్ణాటసాహిత్యపరిషత్తు వా రీనడుమ కర్ణాటభాషను వాఙ్మయమును వృద్ధిచేయ నుపా

* Historical study of the mother tongue p. 356.

యము లన్వేషించుటకై బెంగుళూరులో నొక పండితసభ కావించిరి. ఆసభలో మైసూరు రాజాస్థానమంత్రివర్గములోఁ జేరిన (S; P.) రాజగోపాలాచార్యులుగారు నూతనకన్నడమునుగూర్చి యిట్లు ప్రసంగించిరి.

*"కన్నడదేశమందు వివిధప్రదేశములయందుఁ గలభాషాభేదముల కేకీకరణము గావించి సర్వకర్ణాటదేశసామాన్య మగు గ్రాంథికభాష నొకదానిని కల్పించుట యీపరిషత్ప్రయోజనములలో నొకటిగా నుండవలయునని నాయభిప్రాయము; ప్రస్తుతకాలమందుఁ బ్రాదేశికభాష లచ్చటచ్చటఁ గలవు. కేవల వ్యావహారికభాషలో నిట్టిభేదము లుండవచ్చును గాని గ్రాంథిక భాష సర్వకర్ణాటక సామాన్యముగా నుండవలయును" అని.

దీనినిబట్టి చూడ హొసకన్నడమందు సామాన్యమగు గ్రాంథికభాష లేదనియు, అందువలన భాషాభివృద్ధికిని వాఙ్మయాభివృద్ధికిని ఆటంకములు కలుగుచున్నవనియుఁ దేలుచున్నది.

---

*The other matter I would refer to is the unification of Kannada language and the formation of a common literary Kannada for the whole of the Karnataka. We have now what may be called dialects for different parts of Karnataka. While this is natural in the case of spoken dialects, there should be a common literary form of the language for the whole Kannada country, and I trust I am not wrong in saying that this work is well within the normal scope of an Academy of this kind. (The Hindu of Thursday April 25, 1935.)

మన గ్రామ్యవాదుల వాదము నెగ్గినచో తెలుఁగునకుఁ గూడ నిట్టి విపత్తు తటస్థించునుగదా.

దేశ మభివృద్ధి నొందినకొలఁది జనుల యాచారములు, భాషలు మొదలగు వానిలోనున్న యంతర్భేదములు నశించి క్రమముగా నది యేకాకారమును బొందుట లోకమర్యాదయై యున్నది. దీనికి వ్యతిరేకముగా గ్రామ్యవాదులు చిరకాలసంప్రాప్తమైన యేకాకారగ్రాంథికాంధ్రభాషను రూపుమాప యత్నించుచున్నారు. వీరియత్నము కొనసాగినచో నాంధ్రవాఙ్మయము భావికాలపుఁదెనుఁగువారికి దురవగాహమై పఠనములేక నశించిపోవలసివచ్చునుగదా! లోకహితార్థము మహాకవు లించుమించుగా వేయిసంవత్సరములనుండి సంపాదించి మనపరము చేసిన సర్వాంగసుందరవాఙ్మయభాగ్యమును మన మనుభవింపలేక పాడుచేసికొన్నవార మగుదుము. తాము సంపాదించుట లేదుగదా పెద్దలు సంపాదించియిచ్చిన దానినైనను నిలుపుకొనలేక చెడఁగొట్టుకొన్నవాఁ డెట్టిప్రజ్ఞాశాలియో యూహింపుఁడు పెద్దలుకట్టిన దివ్యభవనమును బడఁగొట్టుకొన్న పిమ్మట నిలువనీడ యెద్ది? ఎద్దియో యొకకొంప కట్టుకొందుమందురా? దానికి సాధనసామగ్రియేది? అది యెన్నఁటికిఁ గొనసాగును? ఇఁక ముందు గ్రామ్యకవులు గ్రంథములు రచింపవలసినది గ్రామ్యభాషయందేకదా! ఇది బహుముఖములుగా నున్నది. ఏ దేశభాషలో రచింతురు? గోదావరీకృష్ణామండలములలో విద్యాధికులు వాడుచుండు సంభాషణభాషయందట. ఆభాష యేకాకార

ముగా నున్నదా! ఆభాషలో నున్న గ్రంథము లితరమండలములలో నున్న తెనుఁగువారికి సులభముగా నర్థమగునా? గ్రాంథిక భాషను బోఁగొట్టి తమకర్థముగాని గ్రామ్యభాష నేర్చుకొమ్మని బలవంతపెట్టుట వీరికి ముల్లు దీసి కొఱ్ఱు గొట్టినట్లగునుగదా! ఈవృథాప్రయత్నమేల. వ్యావహారికభాష సుగమమను గ్రామ్యవాదులలో నెంతమంది చంద్రశేఖరశతకము చదివి యన్వయింపఁగలరో! భాషీయదండకమును చిన్నిపొత్తము నెంతమంది యర్థము చేసికొనఁగలరో! అధికసంఖ్యాకులకు సులభముగాఁ దెలియుటే ప్రయోజనమైనచో విద్యాధికుల వాడుకభాషయేల? విద్యావిహీనులయిన ప్రాకృతజనులభాష యేలకూడదు? ఏభాషను గ్రాంథికభాషగా గ్రహించినను గాలక్రమమున దానిరూపములు స్థిరపడి యిప్పటిగ్రాంథికభాషయందుఁ గలవన్నదోషములన్నియు దానికిని బట్టునుగదా! అట్టిచో నీనిరర్థకప్రయత్నమేల?

‘మహిమున్వాగనుశాసనుండుసృజియింపంగుండలీంద్రుండుత
న్మహనీయస్థితిమూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవ న్మహా
మహులైనసోముఁడుభాస్కరుండువెలయింపన్సొంపువాటిల్లు
నీ బహుళాంధ్రోక్తి మయ ప్రపంచమును’

దీని శరీరప్రాయ మగు గ్రాంథికాంధ్రభాషయు నిరాతంకముగా దినదినప్రవర్ధమానములయి శాశ్వతములయి యుండుఁగాక!

# అనుబంధము.

South Indian Inscriptions Vol. IV లో 1008 వ సంఖ్యగల శాసనము.

(1)

(స్వస్తి) సర్వలోకాశ్రయ శ్రీవిష్ణువర్ద్ధన మహారాజులైన శ్రీరాజరాజ దేవరసంవత్సరంబులు ౨౬॥ యోభూత్...ఖ్యోవిశాల వరగుణీధనీ। తస్యసూను...మి...తోయోధరణీతలే॥ (౧) శాకాబ్దే నిధి తర్క నన్దగణితే త్రై(లోక్య) సేవ్యాయనే ప్రాదాదారవి దక్షిణాయ తిధౌ భీమేశ్వరాయ(స్వ)...వందీప్రముఖణ్డవర్త్తి మతులం వంశోత్తమోదమ్మ(ర)ధీః...మ్మడి చోడసెట్టితనయస్త్యాగీగుణానా(ం)న్నిధిః॥ (౨) శకవర్ష...ణ్డు భీమేశ్వర మహాదేవరకు దక్షిణాయననిమిత్త(మునను)...చోడసెట్టిదనయిచ్చినయఖణ్డవర్త్తి దివియకు ని(చ్చి)న...శమున మానెణ్డునేసినెయి ఆచంద్రార్కముం బో...యబోయణ్డును బాదియబోణ్డును నావియ (బోయి)ణ్డును (కొమ్మ) యబోయుణ్డును లోపైన యార్వురుబోలవసమున ని(చ్చి)నవెడ్లు ౫౦ లిఖిత(ం) పెద్దనాచార్య్యః.

(2)

పై పుస్తకములోనే 1010 వ సంఖ్యగల శాసనము.

శాకాబ్దే మునిభూధరాజగణితే నారాయణార్య్యాత్మ

జాభక్త్యా యాచకయూధకల్ప విటపి ప్రోత్తుంగశా(ఖో)పమాః।
ఆనూయ్యైస్థితిదీపమంబుజముఖీ రాత్రిం దివం దీపకం ఖ్యాతా
కుప్ప మనంజ్ఞయా గుణయుతా భీమేశ్వరాయాదరాత్॥ శకవ
ర్ష ౯౭౭ గు నేంట భీమేశ్వరదేవరకుం జక్రవర్త్తి త్రైలోక్య
మల్లదేవరప్రధాని నారాయణభట్లు కుంతుఱుకుపమపెట్టిన అఖణ్డ
వర్తి(ౕ) లోహపుదివియ యొక్కంటికిం గిలారమన చామబో
యు వెంటియయు బాదబోయు దొడ్డియయు నావబోల భీమయ
యుం గొమ్మబోల కాటియయు బెరసిన బోలవస(ము)న నిచ్చిన
ఎడ్లు ౫౦ కి నిత్యపడి త్రిభువనాంకుశమునం బోయుం గల నేమా
౧లిఖితం బేతనాచార్య్యః.

## (3)

పై పుస్తకమందే ౧౦౧౫ వ సంఖ్యగల శాసనము.

---

సకవర్షములు ౧౦౦౬ స్వస్తి సమస్తలోకాశ్రయ శ్రీవిష్ణువర్ద్ధన
మహారాజుల ప్రవర్ద్ధమాన విజయరాజ్యసంవత్సరము ౧౫ గు
(శ్రా)హి దిన 3౦ (౭ణ్ణ)ం జక్రవర్త్తి శ్రీకులోత్తుంగచోడదేవర
అనుంగు గుద్దవాదినాణ్టి పెద్దడాకరేమి పెద్దమునున్నాటి సమర
మొదలి బేతినాయకు కూంతుఱు జయమ యుద్దుల యమినీశ్వ
ర మహాదేవరసన్నిధానమున నుత్తరాయణ సంక్రాంత్తి నిమిత్త
మునం బెట్టించిన కులోత్తుంగ చోడశత్రమునకుం బ్రోలనాణ్టిశుం
కలూరి దక్షనామున చెఱువు దక్షనామున ముప్పది పుట్లు విత్తు
పట్టు సర్వాకరపరిహారముగా శ్రీచోడ (గ)ంగ్గదేవరిచ్చి శత్రి

మునం గుడ్వంగ్గల బ్రాహ్మలిరువణ్డ్రికు దిన ౧ కిం బేరముమ్మడి భీమకుంచ్చమున నిరువుసనడ్డెణ్ణుగా నెనవెంబ్రలకుం కుంచ్చ ౫౦ దిం బవియెన్మిదిగా నైన డుంగ్గుంబ్రాలకుంచ్చ ౪౦ ది పప్పు కుం చ్చ 3 నేతి కు ౧ నంజుళ్లు ౪ మిరియముల అరసోల ౧ సక్కు పల 3 ఉప్పు కు ౧ బెల్ల కు 30 యిుంద్దుల పురోహితునికి దిన ౧ కిం బ్రాకు 3 సంవత్సరజీవిత మాడ 3 వణ్డడిబ్రాహ్మనికిం బ్రా కు 3 జీవిత చి ౭ కట్టపనివానికిం బ్రాకు3 జీవితమాడ ౧ వడ్లుం బ్రాలును డంచ్చి యెంగ్గిల్లెత్తి నీళ్లుదెచ్చు నాణ్డు వాణ్డ్రిద్దఱకుం బ్రాకు3 జీవితమాడ ౧ చి3. ఇమ్మాగ్గ౯మున నాచంద్రాక౯ము నడవంగలవారుగా శ్రీభీమేశ్వర మహాదేవర దేవభణ్డారమునంగల పిరిదేవరకిలరమున చామియబోయు చందయయు బాదియబో యు పోతియయు గొమ్మియబోయు కనియయుం గాటియబోయు కొమ్మియు బెరసిన బోలవసమునం బెట్టిన యెడ్లు 300 టి బ్రాహ్మ లకుం గుడువ నిత్యపడి వోయంగ్గలనేకు ౧ దేవభణ్డారమున శని వార దిన ౧ కి చి(డు)ంగ్గలనూనియ కు ౧ నిత్యపడి వెట్టంగ్గల ఆకులు ౮౦ పోంకలు ౪౦ ది.

(4)

**1920** సంవత్సరములో శాసన విమర్శనాధికారులు సంపాదించిన శాసనసముచ్చయములో **673** శాసనము.

స్వస్తి శకవష౯ంబుల ౯ (౬) ౫ నేణ్టి సుభానుసంవత్సరమున ను త్తరాయణ నిమిత్తమున నగ్గ్రిహారము వెలనాణ్టి వలివేరి త్రిపురు షదేవరకు నాచంద్రాక౯ మఖణ్డవత్తి౯ దివియలు మూణ్టికి

దణ్డనాయక తిక్కపయ్యనాయకు లిచ్చిన గొఱియలు నూట యొంభది పీనిం జేకొని సన్తానక్రమమున నిత్య మూణ్డుమానికలు నేయి మున్మడి భీమన(డ?)ం బోయంగలవాణ్డు ఇద్దేవరక యిన్నం ది యగ్రహారము పెరువలి (న) గ్గియ షడంగ్గవిభట్లు ఆచంద్రా ర్క్కమఖణ్డవత్తి దివియ యొక్కొణ్టికి విచ్చిన గొఱియ లెంభది ఇందుల బ్రహ్మదేవరకు నొంగ్గేఱు మాగ్గమున దేసట్టి మహాసా మన్త నంబయకొడుకు మణ్డలిక గణ్డయు యాచంద్రార్క్క మ ఖణ్డవత్తి దివియ యొక్కొణ్టికి నిచ్చిన గొఱియ లెంభది. ఇద్దేవరక యిందుల- (అసంపూర్ణము.)

(5)

పూర్వోదాహృత శాసనసముచ్చయములో 672 వ శాసనము. స్వస్తి వలివేరి విష్ణుదేవరకు నిందుల దివాకరపెద్దికొడుకు పో తయ యాచంద్రార్క్క మఖణ్డవత్తి(క) దివియ యొకొణ్టికి ని చ్చిన గొఱియలు యేంబది. ఇద్దేవరకు యిందుల కొమ్మియ ష డంగ్గవి కొడుకు సవ్వియ షడంగ్గవి యాచంద్రార్క్కమఖణ్డవత్తిక దివియ యొకొణ్టికి నిచ్చిన గొఱియ లేంబది.



# సవరణలపట్టిక

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| ౧౭ | ౬ | విజయనగరం | విజయరంగ |
| ౩౧ | ౧౫ | తదస్తులైన | పదస్తులైన |
| ౩౭ | ౧౧ | తగువైనవారు | తగులైనవారు |
| ౪౦ | ౨ | పెండ్లా | పెండ్లాం |
| ,, | ౧౨ | పాడుదనో | పాడుదునో |
| ౪౮ | ౨౧ | రత్నావళి | రత్నావళికి |
| ౬౨ | ౨, ౩ | అర్జునితో | అర్జునుతో |
| ౬౬ | ౬ | పఙ్క్తి మొదట " తే. గీ. " అని యుండవలెను. | |
| ,, | ౧౬ | పైప్రకారమే. | |
| ౭౧ | ౮ | వలసినది. | వలసినవి. |
| ౯౧ | ౨౦ | పెద్దమ్మలతో | పెద్దమ్మలతో |
| ౧౨౫ | ౧౬ | నవకాశముగా | నవశముగా |
| ౧౪౪ | ౧౯ | యారమ్యమును | యాపమ్యమును |
| ౧౭౫ | ౨ | diolects | dialects |
| ౧౭౮-౨౦, ౨౧ | | ఈపద్యములలోని యంకెలును పుటయడుగున మాటలును తీసివేయవలెను. | |
| ౧౮౩ | ౧౩ | "కవిత్వమందు" పిదప "గలవు" అని యుండవలెను. | |
| ,, | ౧౪ | "రూపములే" తరువాత "భట్టారకుని కవిత్వమందు" అని యుండవలెను. | |
| ౧౮౫ | ౯ | విషయములు | విషయములో |
| ,, | ,, | లౌన్సుబెరో | లౌన్సుబెరీ |
| ౧౮౯ | ౧౬ | గ్రంథములను | గ్రంథములు |
| ౧౯౩ | ౧౪ | Milten | Milton |